...గీరశ, గుంటూరుసీమలయొక్క భాగములచ్చుముగిసినతోడనే నాకుబంపుటకొరకు, నాపేరునురిజిష్టరుజేసికొని...కృతజ్ఞతాబద్ధునిగావింపవేడుచున్నాను...నిన్నటిదినమున, కొప్పరపువెంకటసుబ్బారాయ, కవిగారిగ్రామము మఱుదేరగా గుంటూరుసీమవలన, వారి సుస్వభావము నెరిగినవాడనగుటచే, అయ్యా! గుంటూరుసీమందిలకించితిరా? తమజల్లిసీమయేమైనదని యడుగ, నేమోమో, ప్రగల్భములం బలికి, జల్లిసీమ, నెలదినములలో వచ్చుననిరి...గుంటూరుసీమయొక్క పూర్వరంగమును తనివిదీరగాంచితి, కొప్పరపువారి యసత్యప్రకటనలును, తమసత్యనిర్ధారణలును, మధురసుధాధారలొలుకు తమకవితానైపుణ్యమును నాకేగాక సర్వాంధ్రులకమందానందము నొనరింపక, మానవని ఘంటాపథముగఁ జెప్పకతప్పదు

మాకరాజు నారాయణరాజు. గుంటూరు 17-4-13

గవర్నమెంటుట్రయినింగుస్కూలు.

...గుంటూరుసీమ, చదివితిని. అఖండమగు మీకవితయందలి కథావిషయగమనము అత్యద్భుతముగనున్నది. ఈకథా సంవిధానపరిపోషణ ఆంధ్రవాఙ్మయమునందు ఒకరిద్దఱు సనాతనకవులయందు తక్కన, పినవీరభద్రుఁడు, తక్క లాఁతియొడలఁగనుపట్టదు..." రుక్మాంమార్ వర్ తిరువల్క్యూణి 2-7-13.

రాయప్రోలు సుబ్బారావు.

...గుంటూరుసీమ పూర్వరంగమను గ్రంథమును... నందుకొంటిమి...సదరు గ్రంథము మాసంశయములను బోగొట్టి నిజమైనవిషయములను దెలియఁబఱచినందులకు మేమెంతయుఁ గృతజ్ఞులము. "నిజమునిలకడమీద దెలియు" ననులోకోక్తి కల్లగాదుకదా? వేయేల! సర్వవిధముల యీగ్రంథము సప్రమాణముగాను, పక్షపాతరహితముగను, చరిత్రాత్మకముగను, వ్రాయఁబడినదనుటకు సందేహము లేదు. దీనింగాంచియైనను గల హాళనులు మౌనముద్రను వహింతురుగాత.

Secunderabad Daccan. ఏ. యస్. రామకృష్ణులు. 30th March 1913

ఉ॥ చూచితినండిసీమ, పరిశుద్ధవచోనిచయాభిరామ, వి
ద్యావతుర ప్రమోదధనధామ, యథార్థ కథానకోక్తిము
ద్రావణశామ గాత్ర్యకవి తంత్రబహిష్కృతి దేవధామ, యం
బాచరణాంబుజాతరసబంభర శ్రీపతి వేంకటేశ్వరా. ౧

శా॥ ప్రాచీనక్ష్మపదిక్ స్థితాంధ్రకుకవిప్రాకారనిలాహింద్రమై
వాచాటోక్తిపక్షరిక్తజనతావక్త్రీకటాసారమై
భూచక్రోపకృతిప్రసూనలతికా సూర్యార్ఘదవ్వనఁదర్తువై
తోఁచెన్ ఖండి చరిత్రయుగ్మము కవీంద్రశ్రేణి చూడామణీ. ౨

క॥ గిరతమా! యత్యద్భుత, ధీరులవనఁదేల్చె 'సీమ' తెల్పె సహార్థ
శ్రీరాజాలవసనార్యులు, చారుప్రజ్ఞలు భవత్ప్రశాంతికి మెచ్చన్. 3

భాషాత్రియశాలి. 22-4-13 గుంటూరు అగ్రహారం

D. Ramaswami Sastri.

ఉ॥ దైవముఖమ్మ్రఁజూచి సమతన్ వహియించి చరిత్రయుగ్మమున్
భావవిదుల్ సెబాసనఁగ వ్రాసితి రానసుశైలిఁ దాము, మీ
చేవ యథార్థ గౌరవ విశిష్టము 'శిష్టజనైక వేద్య' మో
దేవ! భవత్ప్రతాప మతి దృశ్యదరిత్రిబంధకం బహో.

గీ॥ సకలలోకమ్ములకు సత్యసత్త్వ మిట్టి, దనుచుఁ దేల్పంగఁ దాము వ్రాసిన చరిత్ర
'సీమ' నాకొండువ్రిత వీ,పి చేరఁ జేయ, వెంకటకవీంద్ర మొక్కెద వేవిధముల.

మాగంటి వీరరాఘవశాస్త్రి. 24-8-13

...గుంటూరిసీమ, యనువివాదాంశగ్రంథమును నామూలాగ్రముగా జదివితిని సోదరకవులకునుమీకును గలిగినవివాదసందర్భములో మీతప్పేమిలేనట్టు యీగ్రంథమువల్ల యథార్థము బయల్పడినది...ఉత్తరరంగము గూడ...బంపగలందులకు ప్రార్థించుచున్నాను, ఖరీదుఎంతయైనను సరేముందుగంపుమని సెలవిచ్చిన బంపెదను.

చించినాడ వేంకటరత్నశాస్త్రి.) బెజవాడ 29-4-13

గీ॥ సిరులఁజెన్నొందుగుంటూరుసీమ ప్రథమ,రంగమును గాంచితుష్టాంతరంగుఁడైతి,
వెలయనుత్తరరంగము వేమఱరశ,తావధానము వీ. పి. గాదయనుబంప,
కోరినందములు సేతు, కోర్కెదీఱ. చిపుకుల పిచ్చయ్యశాస్త్రి.

స్కూళ్లసూపర్‌వైజరు,పొదిలె,నెల్లూరుజిల్లా,ముకాం తర్లుపాడు21-7-13

శా॥ కన్నుఁగాన లేక మిత్రవితతిఁ గల్లరు లల్లినప్రల్లదంబులన్
గనివిని యబ్బురంపడితిఁ దోకందు శతంబున నైన సున్నె? యం

డిననలదిక్కటాహముల నిండి పయిన్ బయిఁ బొంగినింగిఁ బా
టిన భవదీయకీర్తులకు హారిక నిలువంగ నెవారిక లోపెడిన్. ౧

చ॥ అనదలు మాళ్ళ లేరొకో యహంయుతులై తమసూటియాసుపో
వ నుడుపురిత్తు వలుకులను వంచనకల్గునె? "యూరకుక్కమా
సిన యెడ జంగమయ్య కిలఁజేటగునే?,, బుధులేరు విన్న నీ?
యనుచుఁ బకారగుల్లోఁ నగరాని నగరాని మొగమెత్తనిత్తురా. ౨

ఉ॥ "అక్కనమాదనల్ చెలఁగునందల మెక్క నర్హప్పాటికిన్
నిక్కుచుఁ జెర్వుకట్టపయి నిస్త్రపతన్ తాను నిల్చుచూడిక్కఁ,, దా
రొక్కటరెంటఁ బామరులయొద్ద రహస్యహనావధానముల్
జక్కనొనర్చి రన్నఁ దమపాటికి వత్తురె తక్కఁ గైనరుల్. ౩

చ॥ అనవసరంపుఁ జివ్వకు నహంయుతులై విఫలోరుశాఖ దార్
పెనఁగొని మున్గడించు పెనుపేరుల నీటఁగలంచి నట్టి రీ
వినయవిలేక శాలు లిఁకెఁబెగ్గల వీడి రహస్యలంబులన్ .
గొనఁగుటమాని యిష్టయిన 'గుంటురిసీమకు' మ్రొక్కఁగాదగున్. ౪

క॥ సారతరహృద్య పద్యసు, ధారసనిష్యంది గిరతముబలెనరయన్
మీరచిత, సీమ,నరనం, బై రాజిలె నఖిలసూరు లౌననిమెచ్చన్.

రామడుగు సీతారామశాస్త్రి. 14-1-14

..."గుంటూరిసీమ" చేరినది...మిక్కిలిశ్రమకోర్చి ఆయాపత్రికలయందలి వి
షయములను ముందెన్నడో గ్రంథము వ్రాయవలయునని సేకరించి గ్రంథముత
యారుచేసినందువల్ల తమకు 'చాణక్య' లనుబిరుదు సార్థకమైనదానినిగా దలంచు
చున్నాను. తాము నిజములని వ్రాయించిన విషయములెల్లను నేను పత్రికలయందు
చూచినవగుటచే యిందుమీరెంతమాత్రము అనృతము వ్రాసితిరని నేతలంపను.

వేమూరి సుబ్బరామశాస్త్రి. ఆళ్లమూడి 6-6-13

గీ॥ అంతియేకాక నారాయణశాస్త్రమొకఁడు, బయలువెడలిగుంటురిసీమవటిమనెల్లఁ
జించిచెండాడివెనుఁజూడఁజేయునటులైనఁ, కేమిపురికెక్కగుంటూరుసీమవర్గ

గీ॥ కాన నారాయణశాస్త్రమున్నగ్రమ్ము యాలు,మూడు నేయక మున్నె నమ్మోదమలర
నారయన్ గోరినాడఁ గుంటూరిసీమ, లోని యుత్తరరంగమ్ము లోకవినుత.

తెలికిపల్లి రామచంద్రయ్య. 25-2-14

శ్లో॥ ... పూర్వరంగ ముఖం దృష్ట్వాఽఖిలం మానవ
ప్రాంతే మోదముపైతి సంత్యజతి శాఖాపక్షపాతాదికం॥

శ్లో॥ శాట్యాయనస్యైవ సమస్తం వ్రీకథ్య మను జాత్యైక దేశ ప్రగల్భ
మాయాశాఖాభిమాన ప్రకటితవశగాశక్తదార్జనస్యజనస్యం...”॥

శ్లో॥ ...శాఖాం విజానాతి హి నీతి బాహ్యకః॥

శ్లో॥ రాజ్ఞాంగృహేషుధనమానస్యగృహేషుకుర్వంత్యుద్వాహకాంశ్చవిభవైర్న్వసమా
న్యస్యరేవ,తద్వత్ర విత్వరచనానుబనంతిబహ్వః పాండిత్యవైభవమిదంతువి
చారణీయం॥ భీమిడిపాటి అయ్యప్పశాస్త్రి. 4-4-1913

మండవల్లి లింగాలపోష్టు, కృష్ణాజిల్లా.

ఉ॥ హరనారి చరణాబ్జ చింతనమరందాసక్త హృద్భృంగియు
త్తరరంగం బెవుడబ్బునోయనుచు నత్యాసక్తుఁడై వేంకటే
శ్వరదైవజ్ఞుఁడు దానినే మదినదా భావించుచున్నాఁడు తా
నరయంబొప్పఁగఁ బంత వేఁడెదఁ గవీంద్రా! విముద్రణంబైనచోన్.

ములుకుట్ల కోటీశ్వరః. 9-7-13 యింకొల్లుగ్రామం,

..."గుంటూరుసీమ" యనుగ్రంథములు ఆరుకాపీలు V.P. ద్వారా తను
పంతతొందరలో నాకు పంపఁ బ్రార్థించెదను. ఉభయభాషాకవిత్వమహాకవు
లగుతాము వ్రకృతచర్యనంతయు కలికాలముపైదోసివేసి..సంతలో...మాహాత్మ్యవి
షయ... అధికమగునని యు.పెద్ద లనుకొనుటను విని విశదపఱచుకొంటిని

మన్యం సీతారామయ్య. 2-4-13
ట్రీచర్. టవును హైస్కూల్ గుంటూరు

—.గుంటూరుసీమను చూచినాను అందునిజానిజములు తప్పక తేలుచున్నవి. యి
ట్టి సత్యమును దెలుపు యీపొత్తము దేశమంతటను వ్యాపింపచేయుటకు భగవం
తుని సదా ప్రార్థించుచున్నాను. బొడ్డుపల్లి శేషయ్య. బోర్డుస్కూలు, మాష్టరు.
పొందపాడు 27-3-13

స్థాలీపులాకన్యాయమునఁ జూపితిమే కాని మావద్ద నున్నసామగ్రిలో నెన్నవవంతుగాని గైకొనలేదు, సరికదా? వారినామములుగూడ నుదాహరింపలేదు, పాడుకర్మము ప్రతివిషయమునకును గ్రంథవిస్తరభీతియే మమ్ము వెనుదీయించుచున్నది, పీఠికలో నక్కడక్కడ నుదాహరించిన ప్రతివిషయమును నేదో యొకటితక్క నిట్లే లవలేశముగాఁ గైకొనినదియే కాని యేదియును బూర్తిగా గైకొననేలేదు, ఈలోటు రాఁబోవు 'సమగ్ర'గ్రంథపీఠిక తీర్పఁగాక యని యింతతో విరమించుచు నిఁక నిందలితప్పులం గూర్చి కొండొక చర్చించుచున్నారము, ఎచ్చటనేని యతిప్రాసములు, వ్యత్యస్తము లగుటం గూర్చి ప్రాజ్ఞులు గణింపరు, అది భ్రాంతిమూలకము, అనివార్యము, దానిం గూర్చి యితరులకు గోచరించినంతగ్రంథకర్తకు గోచరింపదు, ఆవిషయముకని పెట్టుటకుఁ బాండిత్యముతో నవసరము లేదు, యతిస్వరూప, ప్రాసస్వరూపములను దెలిసికొనుటకు సరిగా 5 నిమేషములకన్న నెక్కుడు కాలము పట్టదు. అట్టి స్వల్పవిషయమును గూర్చికూడ దినంతులు గొట్టువారు నేఁడు బయలుదేఱుటచే నీకాలముయొక్కదుస్థితికిఁ జాల విచారపడవలసియున్నది. ప్రకృతము, హితకారిణీమనోరంజనులు మాకుఁదప్పులు చూపవలయుననియెంచి పైరీతి తప్పులనే యన్వేషించి యవాకుచవాకులను వదరుచున్నవి, ప్రథమముద్రణము నందలి స్ఖాలిత్యముల నిటీవల సవరించితి మను మాటకూడఁ బాటింపక యీపత్రిక లూరక ప్రేలఁగ మొదలిడుట మఱియును విచారణీయము, స్వాత్మదౌర్బల్యప్రకటనమునకై తమంతఁదామే పలువిధముల సాక్ష్యము నిచ్చుచున్న యీపత్రికలు చూపు తప్పులెట్టివో తెల్పుటకుఁ బ్రకృతగ్రంథమునుండి కొన్ని యుదాహరించుచున్నారము.

“వి। ద్యామహేంద్రులు పశ్యాశబ్దముపైని సారెకుఁ గొందఱు

ఇందు విశ్రమము పొరఁబడినది, దీనింబట్టి యజ్ఞతను సమర్థింపనెంచుచో తి॥ వెం॥ కవులకు, యతియననేమో తెలియదని కాని, అక్షరజ్ఞానము లేదని కాని, మొఱఁగవలసి యుండును. ఈమాట విశ్వసింపఁజేయుట కడుఁగష్టము, ఇట్టి ప్రయత్నమునకుఁ బాటుపడువారి నేమనవలయునో? మఱియు.

డం॥ బలరు నియోగి వైదికులు నందుచునుందురు.

(పూర్వరంగము 4వ పుట 6వ పద్యము చూ)

ఇందుఁ బ్రాసము పొరఁబడినది, పైపద్యము రేఫప్రాసకము, కావున, అల

రు, ఒరయు, అందు, ఒందు, గా మార్పికొన్న సరిపోవచ్చును, యతివిషయమున 'వశ్యశబ్దము తప్పుగాదని కొందఱు' అని సవరించుకోవలెను. ఇట్టి భ్రాంతి ప్రయుక్తములగు స్వల్పలోపము లెందఱు చేతనో యెన్నిసారులో సంస్కరింపఁబడుచువచ్చినను భారతాదులయందుఁగూడ నిప్పటికిని క్వాచిత్కముగాఁ గానవచ్చుచున్నవన నస్మదాదులలెక్కయేమి, భ్రాంతినశించినఁగాని యీలోపములునశింపవు, అది ప్రపంచముతో పాటుండఁదగినది, బ్రహ్మాదులుగూడ దానికిదాసులు, ఇదివిషయాంతరము, ఇంకను వ్రాయవలసినవి చాలనంశములుగలవు, వ్రాసిన వానివలనఁ దక్కినవి యూహించుకొందురుగాక, పూర్వరంగోత్తరంగములలో సూత్రప్రాయముగా నాయీవివాదకు సంబంధించినయావద్గాథయు నిముడ్పఁబడినది, ఆది ఆసనచర్యయు, అంతము వేమవరావధానప్రయుక్తమగు సమ్మానమును సనియెఱుఁగునది, ఆసమ్మానసమయమునందలి పద్యములు మాత్ర ముదాహరించి విరమించుచున్నారము.

చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీకరయుగ్మ మలంకృతంబు చే
సిరికద? కంకణంబులఁ బ్రసిద్ధులు నల్వురు చెన్నయూరు ల
బ్బురమును సంతసంబు నెదఁ బొంపిరివోవఁగఁ జూచుచున్నయం
దఱినయనంబులం దవి కనంబడుచున్న వదేమి చిత్రమో.

తి॥ శా॥

ఉ॥ గోడకు వెల్ల వేయు టది గోడహితమ్మును గోరి కాదు మో
మోడి భవత్కుతూహలము నోమఁగ సింగపుమేల్మిబంగరుం
బోఁడిమికంకణమ్ము లివి పూనుచునుంటిమి యిందు కర్హుఁడౌ
వాఁ డెవఁడో? యెఱుంగఁగలప్రాజ్ఞులు సభ్యులు నేఁడు చూడఁగన్

వెం॥ శా॥



శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ, ఉత్తరరంగము.

శ్లో॥ ఉన్నతం పద మవాప్య యో లఘు, ర్హేలయైవ స పతే దితి బ్రువం
శైలశేఖరగతో దృషత్కణ, శ్చారుమారుతధుతః పతత్యధః॥ ౧

(రసగంగాధరముచూ)

శ్లో॥ యద్యపి నదతి సరోషం, మృగపతి పురతోఽపి మత్తగోమాయుః
తదపి నకుప్యతి సింహో, విసదృశపురుషేషు కః కోపః॥ ౨

(అలంకారశేఖరముచూ)

శ్లో॥ సంత స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణా
స్సర్వత్రైవ జనాపవాదచకితా జీవంతి కృచ్ఛ్రం సదా
అవ్యుత్పన్నమతిః కృతేన నసతా నైవాసతా వ్యాకులః
కృత్యాకృత్యవివేకశూన్యహృదయో ధన్యో జనః ప్రాకృతః॥ ౩

(కువలయానందముచూ)

(సదుపదేశము)

చ॥ వలదు నియోగివైదికవిభాగము, కొంపలు ముస్గుదాన, వ
ర్తిలుఁడు యథానుపూర్విగ, విధేయులు విద్యకుఁగంకు శాఖకున్
జల మిడ నెంచి సద్గ్రంథమును బాయఁగఁ ద్రోచు టదేటి తెల్వి, పూ
ర్వులహృదయం బెఱుంగుఁ డని బోధ నొనర్చఁ గదమ్మ శాంకరీ॥ ౧

చ॥ వలదు నియోగి వైదికవిభాగము వల్వ దసత్యగోష్ఠి, ము
గ్ధులను విదగ్ధులన్ సరిగఁ దూఁచెడి తక్కెడకై ప్రియత్నమా,
వల దపలాపముల్ గిలుక వల్వదు వల్వ దటంచు నంబికే
వలదురితంబుగా నడుచువారిఁ దలకాళ్ల కురిన్ ఘటింపుమీ॥ ౨

చ॥ వలవనికోర్కులం బడినవా రెవరున్ దుద నెగ్గ లేద, యీ
కలియెడఁగూడ సత్యమునె కాంతురు గాని యసత్యమన్నఁ బె
ద్దలకుఁ బ్రపత్తి లేదు ఋజుధర్మము పట్టి చరింపుఁ డంచు మూ
ర్ఖుల నుసికొల్పు పెద్దలకుఁ గొండొక బోధ యొనర్పు మంబరో. ౩

## గ్రంథప్రవృత్తి.

చ॥ సత్య, మసత్య, మంచు మనుజన్ములమంచికిఁ జెడ్డకున్, సదా
దౌత్యము సేయుచుండెడిపదార్థము లందొక దాని కింకొకం
డత్యయమున్ ఘటించెడి యథార్థపదార్థము నిల్పయోగ్యులున్
బ్రాత్యులు వేఱొకండు నిలుపన్ బ్రయతించుచునుంద్రు శాంకరీ. ౧

చ॥ నిలిపిన నిల్వఁ జాలని దనిత్య మసత్యము, నిల్పకున్నను
న్నిలిచి యెసంగఁజాలినది నిత్యము సత్యము, సత్వరప్రశా
కలన కెదే నిమిత్త మది గావలెఁ గావున దానికై మహా
త్ములవచనంబు లూఁత గొని పుస్తక మియ్యది సేతుమంబికా, ౨

ఉ॥ నోటుకుఁ గాలదోష మది నోటియెడన్ గొంట గాదు కాన నె
ప్పాటను యుక్తి సేయుడు నపర్ణత గల్గదు తప్పుత్రోవలం
దాఁటెడివారిరజ్జులు వృథా, ఋణ మిచ్చి యుపగ్రఁదున్ ద్వేష
తోఁకటి నెదిర్చి పేర్చి కవికుంజరుఁడున్ దెలుఁగొంటు నంబికా. ౩

మ॥ మనవాఁ డెవ్వఁడు? సత్యముం బలుకుసంతతాధ్వమి, యన్యుం డెవం
డనృతం బాడెడిదే వె, యీనియతికిన్ న్యాయైకదృష్టుల్ ప్రముఖుల్
దనియన్ బ్రొద్దెద రన్యులోకి? వాఁడుకులై "తాఁబట్టకుందేటికిన్
జనుఁ బాదత్రియమే" యటన్నసుడికిన్ దాసానుదాసాగ్రణుల్. ౪

మ॥ ధనమున్ జూడరు వేషభాషలకుఁ బందవేఁ బోలెఁ జుక్క రె
వ్వని కేగౌరవ మంతెకాని యధికత్వం బొప్పఁగాఁ బోరు స
జ్జనులన్ దకర్కఁ దదన్యులన్ మనమునన్ జర్చింపఁ గాఁ బోరు, ధీ
ధనులంచున్ జనసీరి ఋతం బఢుచు ప్రాజ్ఞశ్రేణికిన్ దెల్పుమీ. ౫

## పూర్వవిద్వన్నాగరికత

శా॥ *"మీవిద్దెల్ ధన మిచ్చి కొన్నయవి మీమీపోకలెల్లన్ ధనా
శావిద్ధంబులు పూర్వనాగరికవిద్యాభ్యాసముల్ వేఱు,త
ద్భావస్ఫూర్తులు వేఱు, వారు మనకై దైన్యంబు నైకోరు మీ
తోత్రివల్ వారికి సైఁప రాని వని యుద్బోధింపుమీ శాంకరీ. ౧

శా॥ పూర్వాచారులవిద్దె నేర్చుగుణలుబ్ధుల్ వారిమర్యాదలె
సర్వోత్కృష్టముగాఁ దలంతు రిపు డాచారముల్ లేమున్నవీ
దుర్వారుల్ గనఁ బోరు, దూర్వ లెనయా దుర్వాసుతో నఁదు రో
శర్వాణీ! యిటువంటినోగులను లక్ష్య మ్మేల సేయన్ వలెన్. ౨

*ఆంధ్రభారతి యను పత్రికనుండి.)

## ప్రాచీన గురుశిష్య పద్ధతి.

శా॥ వెంచీ లక్చరులేదు "గేమ్సు" మొదలౌ "క్లబ్ జల్"విసన్ రావుపామ్మంచున్ నిర్ధనుఁ ద్రోచిపుచ్చరు గురుల్,"ఫ్యా"సైన నేలాభమింఁ దంచున్ నేమము లేదు మీ చదువునందాలోకమీలోకమున్ । గాంచన్ వచ్చెడినార్యులార! మిము మెచ్చన్ జెల్లు నెకాలమున్॥ 1. ఉ॥ ముక్కల నక్కలం గుఱిచి కోర్కెఁ బోత్సుఁ గుఱించి కాక మీ । రెక్కడఁ జూచినన్ ద్విజగద్దివ్యచరిత్రుని దేవుని మహా । భక్తికమై నుతించుసురవాక్కులు శిష్యులకిచ్చి వారిదౌ । వాక్కును దేహమున్ భవముఁ బావనమున్ బొనరింతురొప్పగన్॥ 2. ఉ॥ చెప్పులకాళ్ళు ముండితపు శీర్షము శూన్యలలాటమున్ మఱిన్ । గొప్ప బడాయి వేషములుఁ గుచ్చులపాగలుఁ గోట్లుఁ గంఠమం । దొప్పెడి పట్టముల్ గలుగునొజ్జలు శిష్యులు నీకు లేరు మా । యప్ప! చిరాయువై బ్రతుకు మమ్మరొ వేదమ! నీకు మ్రొక్కెదన్॥ 3. ఉ॥ చాపలె యాసనంబులఁట; జందెములె వరవారవాణముల్। పాపము పాపఁజాలుసదిపట్టులు శాలలు; పుణ్యలోకముల్ । చూపెడి మాలికల్ మెడకుఁ జుట్టినపట్టుము లగ్రిమిమినే । ప్రాపగు జీత మిట్టిగురువర్యుల శిష్యుల మ్రొక్కుకొంటొప్పదే॥ 4. క॥ ధనవంతులకన్నను ని । ర్ధనవంతులె ప్రీతిపాత్రతములగు శిష్యుల్ । వనమాలిఁ దెల్పు లేదు,వన మాలిమి నెగడు మీకు నంజలి సేతున్॥5. సీ॥ అరుణోదయమ్మగునప్పుడ మేల్కొంచి యాత్మానుసంధాన మాచరించి । ఆపగాదులకేగి యట స్నాన మొనరించి రవి త్రయీమయుని కర్మ్యము

## టాటోటురటకుఁడు

ఉ॥ కొట్టు నుహానహం బదియుఁ గొండ్లోక కొంకు వహించు నెవ్వనిం
దిట్టఁగ దానిఁ గుట్టునలదీనుని నాలక్రియు వెనక్రఁ దీయు నా
పుట్టుగుబమ్మచారి యెటుబొంకిన నేమగు? నట్టిచీపురుం
గట్టలు గిలుక్రవాగ్రితలకు గౌరవ మెక్రడి దన్నగి శాంకరీ. ౧

మ॥ ఘటచేటీకరనీచకాచకలనాక్రాంతంబు కర్ణద్వయం
బఁట? నానానృతపాతకాంచితవృథాహంకార పంకాంకితం
బఁట? చేతఁ; బటువంటివాఁ డొకఁడు పేరానించి టాటోటులన్
రటియింపన్ గటువానుగా కవియు ధీరవ్రాతముల్ చూతురే. ౨

---

లోనం గి। తముఁ బోలివర్తింపఁ దగుశిష్యగణములు వెంబడిరాఁగ గృహంబుఁ జేరి నిన్న దండెమ్ముపైనించిననీరాక్రవి పుట్టముల్ ధరియించి భూతిదాల్చి॥ తే॥గీ॥ దేవతార్చన మొనరించి దేవదేవ। నామపూర్వకముగ వేదనాదమును ద, దంగవిజ్ఞానమును శిష్యులనువదింపఁ, గాల మేగించు పూజ్యుల గారవింతు. 6. చం॥ నృపతులు వచ్చి దూరమున నిల్చి నమస్కృతిఁ జేసి పూర్తిగాఁ, దపమును వేచియాపయిని దగ్గఱకుం జనుదెంచి 'మీకునే। ది పనిగొ తెల్పుఁడీ' యిపుడె తీర్చెద మన్న "మకేమి లోటులే, దపరిమితంబ సౌఖ్య, మనునట్టి తపస్వుల మిమ్ముఁ గొల్చెదన్॥ 7. ఆ. వె. చంకజోలితోడఁ జనుదెంచునట్టివి, ద్యార్థిఁ గాంచి బ్రహ్మయరుగుదెంచి, నట్లు సంతసించి యన్నమ్ముపెట్టు ప,తివ్రతామణుల నుతింతు భక్తి, 8, ఉ. "వారలు మీకు విద్యనిడవారము లేమిడఁ జాలమే., యటం, చాఅని పేర్మి దేవుగతి నారసి భుక్తినిబెట్టి విద్యపైఁ। దీఱవియాస్థఁ జూపెడి విధిప్రతిమానుల నగ్రిహారపుం, బాఱుల వారిగేహినులఁ బాయనిభక్తి నుతించి మ్రొక్కెదన్॥ 9. శా, ఏరాజుం గన నిచ్చలేమి 'నెటులో యీపొట్టఁ బోషించిమే! తీరంగావలె' నంచు భైక్ష్య మది యెంతే శ్లాఘ్యమంచెంచి యా, చారం బొప్ప గృహంబు లేగి వెనుకన్ ఛాత్రావళుల్ రాఁగ సం,సారంబీడుచు విద్య నేర్పెడి మహాపంసక్రర్తలన్ మ్రొక్కెదన్॥ 10. క॥ భృతకోపాధ్యాయులఁ గని, మతిలో నేవమ్మగాంచు మాన్యులకున్ బ్రో, న్నత వేదశాస్త్రవిద్యా, రతులకు నతులిడుదు రాజరాజనతులకున్॥ 11. మ॥ శుచియా వేషము శుద్ధమా మతము సంశుద్ధం

ఉ॥ "ఆవులు దూడలుం గలుగ నార్యులు గుంజల కేల" తా నెవం
డీవిషయంబు నేమెఱుఁగు నింతకుఁ దన్యవఁ దీసడింపకే
పో విడుచున్ జరిత్ర మన బొంకులు బూతులుఁ గూడనా నెకోని
కావల మేడని సత్యపుఁ బ్రకార మదేడని వచింపు మంబికా. 3

ఉ॥ ఇట్టి వృథా ప్రజల్పకుల హీనపు వ్రాతఁలు కీర్తికామినిం
గట్టుడు నాపె "కాళ్ల కురి గట్టె" నటం చొకమూల నాఁగుచోఁ
బట్టవగంటఁ జూక్రాలప్రభావము వెల్లకపోదు "తా డొగిన్
రొట్టెయుఁ గాకపో దొకనరుం డలతానుకు గాకపోఁ"డకన్. 4

బు దేహం బని। శ్రవణీయం బగుపాండిత్యగరిమ ద్రవ్యంబం దనాసక్తి పూ। ర్వ
చరిత్రంబులయందు భక్తియును ఛాత్ర శ్రేణిపై రక్తిగ। ల్గు చతుర్వేదుల సాంగులన్
నిరతముస్ లో నెంచి కీర్తించెదన్॥ 12 మ॥ ఘను లుద్యోగులు వచ్చి "మీ సుతు
నకున్ గన్యామణిన్ మేటులో। ధనధాన్యాదులతో నొసంగెద" మనన్ దత్ప్ర
న్యఁగైకో మనం। బున నిష్టంబదిలేక 'మీరలతులుల్ పూఁబోఁడి మీకన్నమే।
మనఁగా రిక్తుల" మంచుఁ దప్పికొనుమి మ్మర్పింతుఁ బుష్పమ్ములన్; 13. చ॥ ధ
నమును భూమియున్ దమకుఁ దామయి యిచ్చెడి రాజు లుండ "నం। దనులకు
విద్య రాదు ధనధాన్యవశంవదులైన" నంచుఁ గై। కొనక యెటో కుటుంబము
నకున్ ధృతి గూర్చు నిస్పృహత్వనే। ధనునుఁగఁ గాలమున్ గడపు ధన్యులఁ
బూర్వుల నాత్మ నెంచెదన్॥ 14. ఉ॥ రా జరుదెంచునప్పటి కరఁటులతోఁ టకు
గొప్ప ద్రవ్య త। మ్మాజనపాలుఁ డొయ్యఁగనీ। "యార్య! కృతార్థుఁడనైతి
మీకు నన్య। ర్ఘ్యభజము లెక్కలేదయిన భూమినొ ద్రవ్యమొ స్వీకరించి మా। తేజ
ముఁ బెంపుఁ" డన్న గణుతింపనిసూరుల నాశ్రయించెదన్॥ 16, ఉ॥ "పుట్టితి
మొట్టలో నిచటఁ బుట్టినయూరెటు వీడవచ్చు ని। ప్పట్టుననే వసించి బుధవ
ర్యులఁ జేసెదఁగాక శిష్యులన్। బెట్టెద నేనయన్న" మని పేదతనంబనుకోక
దాతలం। బట్టి స్వశిష్యులన్ బెనుచువారి నుతించి యశంబు లిచ్చెదన్॥ 17.
ఉ॥ పెట్టెలు లేవు కల్గినను బీగము నున్న విభూతి నంచియే। పట్టుదొకందు భూతి
నిడు బంగరపుంగని గాఁగ రాజరా। జట్టులు శిష్యవర్గమున కన్నము విద్యయు
నిచ్చువేలుపుం। జెట్టుల మద్గురూత్తములఁ జెప్పి మటొక్కరి నెట్లు చెప్పెదన్॥

తిరుపతి వేంకటేశ్వరులు.

ఉ॥ వానిది నూరు గాద యలవానిది నాల్గు-యుఁగాద, తోఁచిన
ట్లైనరుఁడే ననత్యములనే నొగడించును, యట్టివాఁడు శ్రీ
జానిస్వనామ మూనినను జందన మూనిన రాసభంబె దూ
రానఁ బరిత్యజింతు రలవ్రాయసకానినుడుల్ బుధాగ్రణుల్. ౫

ఉ॥ ఉన్నది యున్నయట్టులుగ నోపిక మీఱ లిఖింతు మంబరో?
కన్నపుదొంగ వ్రాఁతలప్రకారము నోటికి వచ్చినట్లుగాఁ
బన్నము, బన్న మాగిలుకువ్రాయసకాండ్ర శిరాన నుంచి వి
ద్వన్నుత మైనమార్గమునఁ బంపెడిభారము నీది యీదెసన్. ౬

(త్రిశంకుస్వర్గము)

చ॥ అతనిని రోగి యందు రెవఁ డల్లవసిష్ఠగవీప్రసవంతికై
మతి చెడి పోరి యోడి మతిమత్తముఁడై తప మాచరించి బ్ర
హ్మత యొక కొంత గాంచె నలయూతఁడె గాధిజుఁ డాతఁ డిచ్చె స్వ
ర్గతి నొక రాజసూతికి సురప్రభుఁ డొప్పమి కాగ్రహించుచున్ ౧

ఉ॥ గడ్డము మీసముల్ పెరఁగి గాధిజుఁ జేయవు వేనివేని యా
చెడ్డమునీశ్వరుం డొకని శ్రీవతియన్నను జేర్పఁ బోయి తాఁ
బడ్డ పరిశ్రమంబు భగవంతుఁ డెఱుంగుఁ గృతార్థుఁ డయ్యెనే?
అడ్డఁడె యింద్రుఁడిడాపయిక ఖాంశ మెఱుంగనివారు లేరుగా ౨

(పౌండ్రకవాసుదేవీయము)

ఉ॥ ఉండుర జగమ్మునందు మును పుండినయట్టులె యుంపు వారు పె
క్రుండుర, వృథాభిమానమునఁ గజ్జ మెఱుంగక కొంప తెట్లొ చే
కొండ్రవమానమున్ దమకుఁ గూడనిబల్ బిరుదుల్ ధరించి; యీ
* పౌండ్రకవాసుదేవుల నెవండు గణించు వచింపు మంబరో? ౧

(*హరివంశోత్తరభాగమునుండి.)

క॥...అనిమిషముని యిట్లులనియె నాతనితోడన్,, ఉ॥...నీదువాక్యముల్, మానవనాథ? యన్నియును మానుము కానిది నాకుఁ జూడఁగన్,, క॥ హరియొక్రుడ? నీవెక్రుడ?, హరికిని నీకును విశేషమరయఁగ భూభృ, త్ప్రమాణువుల

(గౌతమీనది—సెలయేఱు)

ఉ॥ కొండలు చీల్చి బండ లొరిగిఁ గొట్టుక పోవుచుఁ దేల గౌతమీ
చండతరప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వ నెన్నఁడో
కొండలనుండి వచ్చి యడఁగున్ సెలయే ళ్లట నూరుఁ బేరు లే
కుండఁగ "దివ్యటీసరస నుండెడిదీపములో" యనం బొరిన్. ౧

ఉ॥ అంతన పుట్టు నంతటనె యాఱుఁ గడున్ రయ మొప్పఁ బాఱు నె
క్కెంత వెడల్పుఁ బొడ్వు గలయే అది యే సెలయేఱు, దానిపై
నెంతయొ మహాప్రవాహముగ నెల్లపుడున్ బ్రవహించుచున్ బవి
త్రాంతరగమై తనర్చెడ మహానది గౌతమియందు శాంకరీ ? ౨

కుఁగలయు 'పరికింపవు' ధారికనీవు ప్రతియోధుఁడవే,,... తే॥గీ॥ వలవదుడుగుము నిన్ను నను వాసుదేవుఁ, డందురే బుద్ధియుతులు సర్వవిహారి, సిద్ధమైవాసుదేవాఖ్య నెల్లైనట్టు, లుర్విలోపలఁ దత్తుల్యుఁ డొరుఁడు గలఁడె,, క॥ నీచక్రము నీశంఖము, నీచాపము నీగదయు నీఖడ్గంబున్, నీచాపోపితములు విను, చూచిన నవ్వుదురు వీని జూచుల ధరణిన్,,... క॥ నవ్వెదు వారల నెఱుఁగవు, క్రొవ్వున నిటు పలికె దేల? గోవిందుని నీ, వెవ్వనిఁగాఁ దలఁచితివి తెఁ, డువ్విళ్లూరెదు భవన్మదోద్ధతి యడఁచన్,,......వ॥... శైనేయుండు(సాత్యకి) అట్టహాసంబు సేసియతని కిట్లనియె ......తే॥ గీ॥ ఆదిదేవుని పేరు చిహ్నములు సాచి। నంతటనె యాతనికిఁ దుల్యుఁ డగ్రడెనిన్ను. సింహకవచంబు దొడిగినఁ జెనఁటి నక్క, గంధ గజగంధము నకును గలదె నిలువ,,...వ॥... పౌండ్రుండు...ఒకదూత నాచైత్యదమను పాలి కింబసిచిన,,...సీ॥... తిరిగి తంతటఁ బోక తేఁకువమాలి నాపేరుఁ జిహ్నములుఁ గిట్టించికొంటి, వాసుదేవుఁడన... నేన కా,... బ్రతుకవలతేని వినుము... చక్రమాదిగ విడిచి మత్స[illegible]డిగి, నటికి దనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ,, వ॥ అనియిట్లు దూతముఖంబున వెడలిన విమలవాక్యంబాకర్ణించి ... కమలలోచనుండు హాసింగనుంగొని సీ॥ నను నట్లు లనుగుదెమ్మనియెఁ గావున నెల్లయడియాలములతోడ నరుగుదెంతు, వినుతచిహ్నమ్ములు వీడుమన్నాఁడు గావునఁ జక్రపూర్వతఁ దనరువాని, దనమీఁద విడిచెదఁ, దనశరణముఁ జొచ్చి మనుమంటగలదుగావునఁ గడంగి, తనశరణంబె పెంపొనరంగఁ జొచ్చి నిర్భయుఁడనై భూరి

(చ్యవనమహాముని)

ఉ॥ కొండలు బండలుం గలిసి గొబ్బగ నెంచి స్వపక్షపాత మా
ఖండలుచేతి కత్తి కిడఁగా గరుడుం డిడెఁ బక్షపాళియై
యుండియు నీకమాత్ర, మదియున్ జ్యవనుం డిడఁ, డాత్మశక్తి యి
ట్లుండు నటంచుఁ దెల్పుటకు నోజగదంబ? తృణీకరించుచున్ ౧

క॥ తనబలము నెదిరిబలమును, గననికతన వజ్రి మట్టిఘన హేతియె కీ
ర్తిని గోలుపోయెఁ గొడవ, ల్లనిమొన నటు లాచరింప నవి యేమగునో. ౨

---

సంపద హరింతు తే॥ గీ॥ ధరణి నెందుఁ బేర్క్రాలవాఁడు గాను నాకు. దాఁటవచ్చు నె తనయాజ్ఞ దడయకింత, వట్టునేఁడు నెల్లిటిలోన నిట్టలముగఁ, జేయఁగలవాఁ డనంతయుఁ జెప్ప మీవు,,... వ॥ ...అద్దేవుఁడు దివ్యగంభీరస్వరంబున నతనికి ట్లనియె,, సీ॥ పౌండ్రభూవర? నీవు భావమ్మునందు మదీయాంకములు మోవఁది విరితేని, నాపాలికేతెంచి నమ్రుఁడవై యేను నీవాఁడ నాకిమ్ము నీదు చిహ్న, ముల నని వేఁడినలలి శాశ్వతంబులై చెల్లునువెట్టివై చెట్ట చేసి. తింకనైన వినీతి నేతెం చి వేఁడుము ... వ॥'' నీవునన్నురమ్మని దూతచేతఁ జెప్పి పుత్తెంచిన నీదెసవచ్చి తగినబుద్ధియుం జెప్పెతి, నిట్లు సేయుము...అనిపలికినఁ బౌండ్రుండతని కిట్లనియె,, మ॥ అవనీనాథులనెల్ల నుద్ధతుల గర్వాంధ్యం బడంగింప నేనవతీర్ణుండ, నైజుంగ వేయకటకే మిథ్యావాసుదేవాహ్వయం, బవినీతిన్ ధరియించి కొండలకు మోహ భ్రాంతి పుట్టించెదీ, యవలేపంబు నెఱింగి కావె నిను దండార్హుండుగాఁ జూ చితిన్,, తే॥ గీ॥ నాకు వెఱచి కైలాస యానంబు పేరఁ, గొంత కాల మమ్మెయిఁ దప్పఁ గ్రుంకిపోయి, తీవు లేకున్నఁ జూవె మహవిభూతి, మెఱయుచుచ్చియు నీయూ రనేలుచున్నైతి,,...క॥ ఖగతుఁడు చక్రము వైచిన, నగధరుఁడు సుదర్శనమున న దితుత్తుమురై, జగతీస్థలిఁ దొరఁగెను న,ట్లుగఁ జేసె సమస్తజగములును ముదమొం దన్,,...వ॥ ఇబ్భంగిఁ బగతు నపగతసమస్త సాధనుంగా నొనర్చి యమ్మహావీ రుండు. తే॥గీ॥ ఏమిరా? వాసుదేవుఁడ నేనయనుచుఁ, జెప్పికొనవచ్చు నేరయిం కఁ జెపుము నాకు,...వ॥...గరుడ చరణ ప్రహరంబులఁ గృత్రిమగరుడలాంఛ నంబగు తదీయ ధ్వజదండంబు ఖండంబులు సేసి...,, (విస్తరముగాఁ గోరు వారు హరివంశోత్తరభాగము ౬వఆశ్వాసము చూడఁదగు)

(కాళింగులు)

ఉ॥ అంగమునిండ భూతి నిడి యల్పపువస్త్రము గట్టి చెంబు చే
లం గొని శుద్ధసద్ద్విజులలాగు నటించుచు నెందుఁ బోవుకా
ళింగులపోల్కి నేఁ డకట? లేరు లనేకు లొకింత నేరువెం
దుం గనకే వధానిబిరుదుం దలఁదాల్తు రదేమి పాపమో? ౧

ఉ॥ వేసము పొట్టకోస మటు వేసిన వేసురు గాక యీరసా
భాసులు నిక్కపుం ద్విజులఁ బట్టుక "మీరును విప్రులె? మిమున్
భూసురు లంట తప్పు మముఁ బోరునఁ గెల్చినఁగాని మీరు మీ
భూసురవాదము మొప్ప" దని మ్రోఁగుదు రేమిటి కంబ? శాంకరీ. ౨

(లూత)

ఉ॥ అంబరమందు *సాలెపురు గాదరు వింతయు లేక ప్రేలుచం
దం బొకయప్పు తోఁచు నది తథ్యమొ? కా దటమున్నె యల్లియుం
చుం బహుతంతుజాల మది చూరున నంటుక యుంచు దాని దా
రంబు మొగంపు దారపుఁ బరంపరతోఁ గలుపున్ దిగంబడున్. ౧

ఉ॥ నేయను గాత లూత యది నేర్చిన నేఁతఁ గఁ బొట్టకోస మా
నాయము; బట్టకోసము జనంబు కువిందుని గోరుఁగాని యా
మాయపుఁబుర్వు నేఁతకయి మానన మెంచునె? యుంచుఁబోవె యెటో
కాయమునందుఁ గప్పికొనఁగా, నది వచ్చునె? మట్టి విచ్చునో. ౨

---

*21 వ సెప్టెంబరు 1912 సం॥ కృష్ణాపత్రికనుండి

ఈఁగపులి

తే॥ కీటకములందు మిక్కిలి కీర్తిఁ గంటి। నీఁగపులి యందు రందఱు నైల
మి నన్నుఁ। గాదెయంచును మది వృథా గర్వపడకు। నరసులదిబిన్న నసుదురు
సాలెపురుగ?, కపటమున నేదొ యొకపన్నుగడను బన్ని, యీఁగలను మోసపుచ్చు
ట నీఁగపులివి। కాని యెదురుగ నిలఁబడి కలనఁ గెలిచి। పేరుపొందిన దేది రూపింప
లూత?। ఎట్టులో యొకరీతి నీకీబిరుదము। కలిగె నామాటలటులుంచు కలిగినంత।
మాత్రమున నూర్ణనాభమాత్రదనిమిత్తులు, తలను దాఁటిన గర్వంబు దాల్పఁదగునె

ఉ॥ అల్లిన దానినే మరల నల్లును, గ్రొత్తవిధాన నల్లఁగాఁ
జెల్లదు సాలెపుర్వునకుఁ జేతయుఁ గా దది యెన్నిసారులే
నల్లినయల్లికే మరల నల్లెడి దానికె నంతసింత మా
యల్లిక యెందుకేని గొఱయైనది గాదుగదా మహేశ్వరీ. 3

(నీరసాశుఘోషానిరసనము)

చ॥ ఎఱిఁగియు గ్రామ్యపుంగయిత కేమును బాల్పఁడబోదు మే మొకొ
ప్పర మొకవేళఁ బోరికి సభాస్థలికిన్ జనుదెంచె నేఁ; శాం
కరి! యది కాదుకూడదని కంకకుమమ్మ! ప్రసక్తి దీరను
త్తరపు క్షణంబునన్ మరల దానిఁ ద్యజించెద మాజ్ఞ యిమ్మికన్. ౧

చ॥ ఎలమిఁదురుష్కు నిందగిలి యేగిన నాతికిఁ బ్రీతిఁ గొల్ప మొ
క్కలుఁడు తురుష్కతాప్తికయి కట్టెఁడిమార్గముఁ బట్టు భంగి వెం
గలులకుఁ బ్రీతిగొల్పఁ గలకాకవితం బురుడింప నెంచి క
శ్మలమగు గ్రామ్యఘాటి కొడిసాచెడి తప్పను సైఁపు మమ్మరో. ౨

ఉ॥ తప్పులఁ దోఁపనీకు మెడఁదంగలశాస్త్రము గప్పివుచ్చు మే
చొప్పన నూదడాబిడగఁ జూప్పశలాకలఁ బోలు పద్దెముల్
గుప్పఁగఁ జేయు మెయ్యెడలఁ గొంకు ఘటింపకు మెట్లొ సూఱులన్
జెప్పినదే మహాపదవి సేయుము సూయుము గ్రామ్యశస్త్రముల్ 3

ఉ॥ కష్టముగా నెటో భవదఖండకృపామహిమమ్ము కల్మి నీ
ముష్టికవిత్వమధ్యమున ముద్దులు మూటలుగట్టఁ జాలు ని

---

నీవరాక్రిమమునకును నీయశముకు। నీదుబిరుదంబునకు లోననీవుమెచ్చ। వలయు
నీజాతివార్మెచ్చ వలయుఁగాక। యింక నెవ్వరుమెత్తురో యోఁగలపులి!, యెన్ని
యో గొప్పకీటము లున్నవి నుమి। వానికేమిఁయు గర్వంబు గాఁవఁబడదు, వెదకి
రవ్వంత యల్లికల్లుదువా లేదా। మేలు నీదు గర్వము పట్టఁజాలకుండెఁ,జాలునింత
టి నంచైన సాలెపురుగ?,బుద్ధి తెచ్చుకొని నయాన బుజములెగర।వైచి కొనుటచా
లించి గర్వంబువిడిచి। భద్రముగనుండు మిఁదియు నీబ్రతుకు తెరువు.

పిప్పగ    సోదరకవులు

దుష్టవుఁ బద్యమున్న నది తొల్లి రచించిన దండుగ్రి, వారి సం
తుష్టికి నట్లు కాదనుచుఁ దోఁపఁగఁ జేయుట యెట్లు శాంకరీ. ౪

ఉ॥ గిరగిరఁ ద్రిప్పమోఁగెడిఁ బకీరుకరమ్మున నొక్కయంత్ర, మా
"కిరకిర, బాలురన్ దనుపఁ గీలొక్కనుభంగియె మాన్యమైన చోఁ
బరపరలాడుచున్ గవితఁ బాడెద డాబిడిగా నటించుఁ బా
మరులు నుతించుచున్నిక యమాన్యతఁ గాంచుఁ గదే మహేశ్వరీ. ౫

మ॥ స్వరవర్జ్యత్వమెఱుంగకే పొరిఁబొరిన్ సంగీతముల్ పాడి యె
వ్వరు మెప్పింతురు! గాయకోత్తములు వహ్వ నాఁగ; నట్లే పర
స్వరసందర్భము శ్రోత్రపేయతయు సౌశబ్ద్యంబు లే కెట్టులో
విరచింపన్ గవితల్ శ్రవోయుగళికిన్ విందుల్ ప్రసాదించునే. ౬

చ॥ "పపనిస, సానిపానిపస, పస్రిసరి, గామగారిసా,
సదగద, నీరిసారి, దరిసా, గరిసా, నిరిసా. రిపా, రిసా,
గదగద, పాదపాద, సపగా, పదగా, నిదగా, దగా, దగా,"
యిది యొకగానమేని యెటిమేసెఁ గవిత్వ మగున్ మహేశ్వరీ. ౭

ఉ॥ "చేసినదోసముల్ బయలుసేయఁగ నెంతువె! దుష్కవిత్వ వి
న్యాసము బైటఁబెట్టుటకునై గమకించెదవేల" యంచు దే
వాసురయుద్ధముల్ గెలిచినట్టిఁడు పండిత రాజుచేత నీ
వీన డిలంగఁ జేసి మము నెందుకు దూర్చెద వింక శాంకరీ. ౮

ఉ॥ ఎంచి పురాదులైన పదునెన్మిది వర్ణ్యములంగుఱించి వ
ర్ణించి కథానుగుణ్యముగ నించి రచించియె యుంచి రంచుఁ బ్ర
శ్నించిన చోఁ సదుత్తరము చెప్పుటకున్ దగనైనయుక్తి దోఁ
పించి యనంతరమ్ము నడిపించుమి యీకృతి కోమహేశ్వరీ. ౯

చ॥ కవివరులెల్ల మేలనఁగ గ్రంథములన్ రచియించి కీర్తిపుం
జముల జగమ్ము నుంచెడి ప్రశంస ఘటించియు నేఁడు కొప్పిపుం
గవులకతమ్మునన్ రసము గన్పడకుండెడి దిక్కుమాలు కా
కవితకు మమ్ముఁ బాలుపడఁగా నొనరించెదె మాలదైవమా. ౧౦

చ॥ గడియకు మూడువందలఁటి గంటకు దెబ్బదివందలంట! త
ప్పడుకవనమ్ము చెప్పుటకుఁ బూనినవారిని బుట్టఁజేసి యొ
ప్పదు నరసాహసత్కవనముల్ బచరించు మదీయవస్త్రముల్
“బడబడ” మ్రోఁగు “తాషమరపా” నొనరించెదవమ్మ యీశ్వరీ. ౧౧

ఉ॥ వృత్తవిశేషముల్ చెడి వివేకము పాకముదప్పి సద్గణా
యత్తతఁ దక్కి శయ్య యొకఁ డంతగఁ బొంతగ సంగ్రహించి యే
పొత్తును రోయకే వలుకుపోకడ నేరిపి మాదుకైత ను
న్మత్తతమైఁ జరించుక నుమాలగఁ జేసెదె మాలదైవమా. ౧౨

చ॥ తొరతొర గ్రామనామములు తొంబదియో శతమో సహస్రమో
వరవర గ్రుక్కత్రిప్పకయె వాగెడి విస్రవినోదివై ఖరిన్
జరచర నూరు జార్పుటది సత్కవిధర్మము గాదటంచు నీ
వెఱిఁగియు దానికై మనము నేటికిఁ గొల్పెదవమ్మ శాంకరీ. ౧౩

ఉ॥ అక్కటి నీరసాకృతిన నందముఁ జందము లేక యొట్టులో
గుర్కలు మ్రింగుచున్ వెడఁగు గొల్లలసుద్దుల నెంతపాడినన్
దక్కునె “కైత” యన్ పదవిదానికి, “గాడిదగంపెఁడూఁకదాఁ
బొక్కిన నేమిలాభ” మను బొంకక తెల్పఁగదమ్మ శాంకరీ. ౧౪

ఉ॥ అబ్బెన మేల సేయవలె నంబరొ? తంబుర, యొంటికంటి త
బ్బిబ్బు మృదంగ,మీద్వయము వేషముపట్టిన లోటు గాని యా
బొబ్బిలిపాటగాంద్రతలఁపుం గొలువంగల పాటకైతముల్
నిబ్బరిగల్గి పండితులచే నుతిగాంచెడి కోర్క యున్నచోన్ ౧౫

చ॥ కవితయుఁగాని సంతతియుఁగాని జనించిన యత్తరక్షణం
బవిసి నశించెనేని ఫలమబ్బునె? గర్భభరమ్ము దక్క, నా
యువు లవమేని లేనిసుతు లొక్క సహస్రము కొప్పపాటులో
శివ! శివ! పుట్టనేమి యగుఁ జెప్పఁగదమ్మ, మదంబ శాంకరీ. ౧౬

ఉ॥ అకుకవిత్వమందు రస మారయ రాదని యప్ప నెప్పె నో
యీశకుటుంబినీ! జననమే లిఖియించిన బంధ్రిసందనే

నాశముఁగూడ వ్రాయుటది నల్వకు సమ్మత మౌనుగాక గ
ర్భాశయమే వసించుటకు నక్కట! దీనికి భేదముండునే, ౧౮

ఉ॥ "మారుని నేరఁజాలు సుకుమారుఁడు, కన్నులు చేరెఁడేసి, బం
గారము మే" నటంచు మృతి గాంచిన బాలున కేడ్చు భంగి వి
స్తారరసమ్ముగల్గుటయు సంభవమందెడుఁగాక నిల్వఁగా
నేరని కొంపపాకుకవి నేరుపులేటికి మాకు శాంకరీ, ౧౯

చ॥ పలుకుల కల్కి నేర్పిన సుభాషితముల్ జతఁజేసి కచ్ఛపిన్
బలుకఁగఁ జేయ దానికి సుపశ్రుతిగా శ్రుతివిందు సేయుచున్
గలకలలాడు కంకణనిక స్వరసుస్వర మట్టులుండు మా
పలుకులొనర్చు దే యనుపబాడిగ బండరవంబు లీశ్వరీ. ౨౦

చ॥ కలుషితమైన నీ ర్దురుసుగాఁ బ్రవహించెదునన్నటు తప్పఁగా
తలు దొరలున్ దడాబిడిగఁ; దజ్జుల కెట్లు రుచింపనౌ, శర
ల్లలితకళావిలాసవిమలమ్ములు సత్క్రమలంబులో, రస
జ్ఞులకు రుచించునట్టిద యగున్ హిత మాశుకవిత్వ మేరికిన్. ౨౧

‡(తలకుఁదగని వ్రాఁతలు)

మ॥ కవితాతత్త్వరహస్యవేత్తృతకునై కష్టించునుత్కృష్టబి
ప్రవివేకుల్ కులగోత్రనిందకులు, వేదాచారపారంపరీ
దవవహ్నుల్, సకలాన్నభోక్తలు, నమస్తస్త్రీకుటుంబుల్, మహా
సువివేకుల్, వితరీత మీ తెలివి విజ్ఞుల్ రోయ కెట్లుందురో రే
కవులివ్వారి గణింతురో వీరిలాకో లోకం బన్న నేఁ డంబికా. ౧

‡(మే 10 వ తేది 1913 వ సం॥ కృష్ణాపత్రిక నుండి)

# చరణాయుధప్రశంస.

ఒక భాషాభిమాని:—

ఈ పోట్లాటకు అంతంలేకుండా ఉన్నది. ఈ కవులు కోర్టునుకూడా మిం చిపోయినారు. తురుష్క-యుద్ధమైనా ముగిసేటట్లున్నది. కాని యీకవుల కల హా మెప్పు డారంభమైనదో దానికి విసుగు విరామము లేకుండా పెన్నది. అంత

ఉ॥ దుర్మతముల్ కదుం బ్రబలి తొందర గొల్పెడువట్లు, ధర్మపు
న్మర్మ మెఱుంగునార్యు లవి మాపినయట్లె కవిత్వతత్త్వవి
త్కూర్మతు లాఁగఁగా వలెఁ గుకావ్యము; తాదృశధర్మకార్య మే
కర్మ మెఱుంగఁ జాలనియకర్మపరుల్ నిరసింప నేమగున్. ౨

ఉ॥ జన్నము లాఁగి పోయెనొ? యశస్వుల సత్రము లాఁగిపోయెనో?
అన్నము మాల మాదిగల దండలకుం బ్రియమై తనర్చెనో?
దున్నల కాలు భార్య లయి తోసము నందెనొ? ప్రోడ శిష్టసం
పన్నగృహస్థపుత్రికరపంకజ మంటెనొ? వీరియార్యులన్. 3

ఉ॥ ఐనది కాదు కాని దగు నంచది దేశము నుద్ధరించు నం
చేనరమాత్రులో గిలుకు నేవపుఁ బ్రాఁతల కూఁతమై యశో
ధీనులఁ బూర్వపండితగతి న్మతిఁ జొన్పెడి జ్ఞానులన్ మహా
ధీనిధులన్ వృథా దెగడు తెల్వ్వలవిల్వల నెంచ నేటికిన్. ౪

---

కంతకు కక్షలు ప్రబలుతున్నాయి. ఇరుపక్షములచుట్టు గ్రామసింహాలు చేరి గర్జనము మొదలు పెట్టినాయి. ఈపోట్లాటల నాపించే ప్రభువెవడుకనపడడు! వీటివిషయమై ఆంధ్రపత్రికలు జాబులు ప్రకటించకూడదని దొరతనము వారొకచట్టం చేస్తే బాగుండును. కవులకే బుద్ధిలేనప్పుడు నావంటివారేమి చేయగలరు?

(మే 15 వ తేదీ 1913 వ సం॥ సుదర్శనీ పత్రికనుండి)

## కవులకలహములు

గతవారపు కృష్ణాపత్రికలో కవుల కలహములను గూర్చి విచిత్ర చిత్రావళిలో నొక చిత్రము ముద్రింపఁబడినది. అందు రెండుతలల కోళ్లు రెండు ముఖాముఖిగా నిలువఁబడి యుద్ధము చేయుచున్నటులను ఇరుప్రక్కలను శునకములు అఱచుచున్నట్లును చిత్రింపఁ బడియున్నది. ఇది చూచుటకు మిగుల నచ్చెరువుగానే కనపట్టుచున్నది. గాని కొంచెము దీర్ఘదృష్టితోఁ జూడఁగా మిక్కిలి జుగుప్సాకరముగఁ బర్యవసించుచున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నారము. ఈ జంటతలల కోళ్లరూపముతో నున్న కవులెవరో యెల్లరును జెప్పకయే తెలిసికొనఁగలరు... ఇంతకాలమునుండి వీరిట్లు వాగ్వివాదములు చేసుకొనుచుండఁగానింత వఱకెవరికేమి యనర్థము కలిగినదో చెప్పఁగలరా? వైదిక నియోగిపక్షములు పెరుఁ

తే॥ గీ॥ జననమరణాలలీస్తు విస్తరమొనర్ప, నవ[illegible]గుదురొక్క-
పండితులటన్నఁ గవులన్నఁ బ్రాజ్ఞులన్నఁ, బత్రికలు వ్రాయు వ్రాతఁలప్పగిదిగాక
తే॥ గీ॥ బుద్ధిలేదఁటె? కవులకు బుద్ధి గల్గు, వారలిఁక నెవ్వరో? కులాచారములకు
నున్నచుట్టైడి మేటిసంపన్నులొక్కొ? వీరలు నిగర్వులష? గద్వలేరు జనని.

చ॥ కవికలహాప్రచారములు కట్టిఁడులన్ గరఁగిఁప లేవు కో
ళ్లవుదురు వారికిన్ సుకవు; లన్యులు కొందఱు కుక్కలౌదు రీ
యవినయమున్ సహింపనిగుణాఢ్యుల కీలిఖియించు ప్రాజ్ఞులే
మవుదురొ? నీ వెఱుంగని రహస్యములుం గలవే మహేశ్వరీ. ౭

గీ॥ కోడిగ్రుడ్డంతయన్నమ్ము గొసరెనెకఁడు, నిమ్మకాయంతగోరెసత్సమ్మతుండు
వేఱొకఁడు; దీనఁగలసువివేక మజ్ఞు, లెఱుఁగ రది విజ్ఞులకుఁగాక యెట్లు తెలియు

---

గుచున్నవందురా? ఆ పాప మిందుమూలముననే పండలేదు. అదియిదిఆకేపం
డి బ్రద్దలయినది ... ఈ తారతమ్యచర్చ ప్రతివిషయములోనను గలుగుచుం
డును..."నిరంకుశాఃకవయః" అనునట్లు వారిలోవారు చర్చచేసుకొనుచుండఁ
గా నడుమవారు వారిని గోళ్ళతోడను గుక్కలతోడను బోల్పఁజూచుట యనా
లోచితము... కోళ్లు, కుక్కలు మొదలగు నీచోపమలచే వారినిబ్రజారంగమునఁ
బడవేయుటకంటెఁ గొదమసింగములఁగానో మదగజములఁగానో ప్రదర్శించిన
చో సత్యమైన యర్హమయిన గౌరవమయిన ప్రదర్శనమయియుండును...మఱి
యు వీరిట్లు నీచోపమలచేఁ జిత్రరూపమునఁబ్రదర్శించుటయేకాక దానివ్యాఖ్యాన
ములో "ఈకవులకు బుద్ధిలేదు. ఇత్యాది పరిమత్సరణీకాఠనీచవాక్యములచేఁగూడ
సంభావించిరి.

(1913 వ సం॥ రం॥ జూన్ నెల 15 వ తేదీ సుదర్శనీపత్రికనుండి)

ఇప్పుడు వివాద పడుచున్న కవియుగ్మములను గూర్చి కృష్ణాపత్రికలోఁగో
ళ్లగను గుక్కలుగను పరమనీచోపమగాఁ జిత్రించఁగా వర్తమాన కవులలో గౌ
రవనీయులయి యున్నవారి నింత నీచపఱుచుట చాలజుగుప్సాకరముగ నున్నదని
మేము వ్రాసినది పురస్కరించుకొని "కవులు కలహించ వలెనఁట" యను వ్యా
సమొకటి సువర్ణలేఖ యొకచదివరి పేరిటఁ బ్రకటించెను...అంత కంటెను అధి
కులు చర్చించు కొనుచుందురేని వారి ప్రశంసయే యెత్తుకొనము. ఎందుచేతనె? వారి

మ॥ ఉపమాకల్పనఁ బట్టి కాల్పనికుసం దూహింపఁగా వచ్చు ని
క్కపుసౌభాగ్యము లెన్నియేని; యది యజ్ఞాగ్రాహ్య మెల్లో? వృథా
కుకవుల్ తోఁచినయట్లు గిల్కుదురు సంకోచింప రల్లంత న
య్యపలాపంబు సదోవిగర్హితముగా నద్దెంతు రజ్ఞత్వముల్, ౯

ఉ॥ అజ్ఞులవ్రాఁతలే ప్రకటనార్హములౌనఁట? త్యాజ్యముల్ మహా
విజ్ఞుల వ్రాఁత లౌనఁట? వివేకులు కోల్లఁట? కుక్కలంట? ధ
ర్మజ్ఞత మేలుమే? లిదియు బ్రహ్మసమాజమతప్రపత్తిస
ర్వజ్ఞతయొక్కొ? యన్యమతవర్తుల కంబరొ? యింత జ్ఞానమే, ౧౦

---

వివాదము తీర్చుటకు మనమెంత మన బ్రతుకెంత యనెడు స్వసామర్థ్య దౌర్బ
ల్యమును బట్టి మనత్రోవను మనము పోవుదుము. టర్కీ బాల్కను రాష్ట్రముల
మహాప్రవిదారణము సంధిచేయ బ్రిటిషు ప్రభుత్వమువంటి వారికే యర్హత గల
దుగాని యెలమంచిలి ప్రొప్రయిటర్లు, ఏమిచేయఁగలరు? ...ప్రస్తావనకవు లేతనా
త్రులుగారు. కలమెట్లు చేతఁబట్టవలెనో తెలియని "పరువరి" ప్రభృత్యస్మదాదృ
శులందఱును వంక దొరకెఁగదా యని యొద్దియేని యనిష్టకారణమున వారిని దోఁ
చినట్లెల్ల నీచపఱచుట కధికారము లేదు....చమత్కారముగా యుక్తిప్రయుక్తిక
ముగా వాదములు చేయుచున్నారు. సొంపు చెడినట్లు మధ్యస్థులకుఁదోఁచుట లేదు
ఇష్టములేనివారు వారివాదములను బ్రకటించక పోవచ్చును....వీరికి నిజముగాఁ
గవులు కలహించి పాడయి పోవుచున్నారన్న పరితాపమూ లేక వారిలో నెవ్వరియం
దేని యనిష్ట కారణమున నేదేని వంకఁబెట్టి యేవో వెఱ్ఱి "రిమార్కు" లు చేసి
తద్ద్వారమున నయినఁ దమయనిష్టమును దీర్చుకొందమను దురుద్దేశముగాని...తొలుత
రామకృష్ణకవులు తమకీశ్వర వేరులన్నమాట వినగానే తిరుపతి వెంకటేశ్వరులు
'గుర్రిద్దువచ్చి పిల్లను వెక్కిరించినట్లుకై" కఁటగించుకొని కొంచెముద్ఘోషణము
చేసిరి. ఇట్లై గుంటూరిశతావధానములోఁ గొప్పరపుకవిగారికిఁ దమ రంగస్థల
ములోఁ దమతో సముఁడన్న సిద్ధాంతము మీఁద నహాసన మీఁయగా నట్లు వలదనిరి.
లోకసామాన్యమర్యాదకై మీగెట్టి యాసన మిచ్చినను మాయభ్యంతరము లేదు గాని
ప్రత్యేకించి మాతో సముఁడన్న సిద్ధాంతము పైయాసన మిచ్చిన మేమంగీకరించమనిరి.

ఇందు దప్పేమి యున్నది? సన్యసించి తపమాచరించుకొను వారికైనను నీవు

సీ॥ అమ్మ యెంతటిధన్యురాలో యీబిడ రజస్వల యయ్యె నింకయదిప్పటికిఁ బెండ్లి,
కితని యోగ్యత నెన్న నెవని శక్యము పెండ్లియాడె నల్వదియేండ్లయాఁడుఁబడుచు
నా పెసంస్కరణపరాయణత్వము మిన్న యాఁ బుత్రవతి పెండ్లియాడె విధవ,
ఆతఁ డిందఱకన్న నధికుఁ డేమనఁ? జందెమును ద్రెంచె బాలుఁడైనను దెగించి
తే॥గీ॥ ఇట్లు ధర్మేతరములనే యొప్పుగను వినుతి, సల్పుపత్రిక లెక్కడఁ? సహజధర్మ
బద్ధ బుద్ధికిఁ గాని కన్పడని సత్య, మనెడిపరమార్థ మెక్కడఁ? యఖిలజనని.

---

కొలఁది వాఁడ వందుమేని యాతఁడనాగకోఁడే! అట్టియెడ మానుషము విడనాడని లౌకిక కవిపాత్రులు సగౌరవ న్యూనతా పరాభవము నెల్లు సహించఁగలరు... కాఁబట్టి సర్వవిధములను ఏవంకనో తమ యభిమానము దీర్చుకొందమను దురుద్దేశమే యీ పరితాపమునకుఁ గారణమని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును... ఈ హృదయ కల్మషముల కొక్క ప్రబల దృష్టాంత మిచ్చుచున్నాము చిత్తగించుఁడు... నిన్నటి సువర్ణ లేఖలో..."ఓర్వలేక తగవులాడు కవులను జుట్టు జుట్టు ముడివెట్టి ఇనుప గాలములు వేసి లాగుచున్నారండో? శ్రీరామరామ" యనునను చిత సందర్భములేని యపలాపమును వ్రాయించినారు..."కవులను" ప్రత్యేకించి నిర్దేశమేల చేయవలెను? కవులనే కాక, యోగ్యులెన్ని గుణను కలయితరుల నెవ్వరిని శిక్షింపరాదేమి?... లెమపటకాధారగారు చెప్పినట్లు కామముదీర్చుకొనుటకు అకృత్య హింస యపయోగమో క్రోధముదీర్చుకొనుటకిదియు నంతియ యుపయోగము. ఈమనుపట వర్ణనము విధాయకమే గనుక ఓర్వలేక తగవులాడు కవుల నెక్కరినే కాక యాగణములోని వారినందఱనుగూడ నాలోకనమునఁ జిత్రవధ చేయుట తప్పనిసరియని తెలియఁ జేయుచున్నాము. కలహించఁ గూడ దను నీతిసిద్ధాంతమే సర్వదా ఆచరణీయ మగునేనియు, నట్టివారినెల్ల నే కోర్టులగనో యెక్కడలుగనో చిత్రించ వలసి యుండునేనియు నిప్పటివరకనేక విషయములలోఁ గలహించుచు వచ్చిన కవులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పండితులు, సంఘసంస్కారకులు, పూర్వాచార పరాయణులు మున్నగు మహామహులనందఱ నీవిధమునఁ గోర్టు, కుర్రలు, పిల్లులు, పందులు, గాడిదెలు, గాఁ గూడ వరుసగాఁ జిత్రించి వారికి బుద్ధిగఱపుచుండవలెననియుఁ దెలియఁజేయుచున్నాము. ముందువిఘ్నేశ్వరపూజగాఁ దొలినాఁటి కలహాకవులయిన దండి కాళిదాసులను జెక్కెను

సీ॥ ఘనుని బట్టుక నీచజనుఁ డేది వ్రాసిన నది శిరమ్మునఁ దాల్పునట్టిఘనులు
నీచునినీచత నిక్కమ్ముగాఁ దెల్పువారి వ్రాఁతలు బుట్ట వైచుఘనులు
సత్యమ్ము నెఱిఁగియు శాంతులపోలిక నొప్పరికించుపరిపాటి నెఱుఁగుఘనులు
ఏదియో పోట్లాట నూఁదినఁ బత్రిక కబ్బ "మేఁట"రటంచు నరయుఘనులు॥

తే॥గీ॥ పత్రికాధిపతిత్వంబుఁ బడసిరేని, దానివలనను గల్గెడుహాని జగతి
కెంత యని చెప్పఁగలము లోకైకజనని, సత్యమనుగంటు నెగడు నసత్యమొందు

---

## కథాప్రారంభము

వ॥ అంబా! దీనికేమి ప్రకృతవృత్తాంతమ్మవధరింపుము,

### (సూర్యోదయము)

మ॥ పరితస్సర్పదపారభాస్వరగవీపారంపరీసన్నతై
మిరభారుండు దివాకరుండు త్రిజగన్మిత్రుండు మందేహ ధి
క్కరణోద్యోగి వెలింగె నార్యులు "కృతఘ్నఘ్నాయ దేవాయ" యం
చెరఁగన్ దన్కరకోటి కాలొకలఁది నెందేఁ బందలై పాఱఁగన్. ౧

చ॥ సరసిరుహప్రపాదములు సారెకు నుప్పరమందు, నెంగఁ గొ
ప్పరపు శిరమ్ములందు నెగిఁ బ్రాఁకి ఘనాలయ పంక్తి మీఁదుగా
ధరణికి డిగ్గి యెల్లెడలఁ దామయి యామెయి వారిశైత్యపున్
భర మఱఁజేయుచున్ నెగడెఁ బండితపామరరంజకమ్ములై. ౨

---

కథకునకును వారికిఁ దగవుదీర్చిన దేవి నొక యాఁడుపందగను జిత్రించి యది మొదలు మొన్నటివఱకుఁ దగవులాడిన శిష్టు కృష్ణమూర్తి, పిండిప్రోలులక్ష్మణకవి, వెంకటరత్నశర్మగారు, వీరేశలింగం పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యగారు, వడ్డాది సుబ్బారాయఁడు గారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు, మున్నగువారి సందఱను వారివారి యర్హతకుఁ దగిన జంతువులతోఁ బోల్చి చిత్రింతురుగాక, అపూర్వోపనిషన్మతము వెలయింత్రుగాక.

(కొప్పరపువారు కాలుద్రవ్వుట)

చ॥ దురుసుగ నుండె నుత్తరపుధోరణి యుత్తరుగత్తరంబలెన్
ద్వరపడి తిట్టి బందుగులదాపునఁ దూలుట స్పష్ట మయ్యె నె
త్తఱి నెటఁ జేయనట్టి *యవధానము నెత్తుట వీర్వలాయన
స్థిరు లని యెంతమూర్ఖునకుఁ జెప్పక చెప్పఁ దొడంగె నంబికా. ౧

క॥ అలనూజివీట ఱాకా, కుళమున మఱికొన్నిచోట్లఁ గోవిదు లెఱుఁగన్
జలిపిన ప్రత్యేకపుసభ, లలవా రెఱుఁగమియు స్పష్టమై కనఁబడెన్ ౨

‡క॥ ససహాయంబుగ నవధా, నసభన్ బొనరించునట్టి నరుఁడె ఘనుఁడో తా
నసహాయుఁడు ఘనుఁడో యది, సుసుమలకుం దెలియునే ఘనులకుం దక్కన్.

‡‡క॥ తెలుఁగఁటని మీసఁబఁటని అది, నిలువన్ వలెనంటని వీరు నేరుతురొక్కొ
తెలుఁ, గౌ రాని తెలుఁగనఁగాఁ, దెలగాణ్యాటాడు పద్మితెలుఁగే యగునో.

తే॥ బళిరనియీవాక్రత తెఱఁగెల్లఁ బాటిమీఁదిపందికొక్కులబల''మన్నపగిదిదోఁచె
వీరికి జవాబొసంగుట విజ్ఞులొప్ప, రయిన సామాన్యలోకు లట్లనరుగాక. ౩

క॥ అని యెంచి వారు పద్దెము, లను గిలుకన్ మేము వానిలక్షణమును నే
రనిపోల్కి స్వవచనమున జా,ఘను బంపితి మంబని వారు పురఁబురఁ బొక్కన్

క॥ పద్దెములు వ్రాసితిమి వి, ద్వద్దశ గూర్చెట్ట మనము పలుదనగా వా
ర్దగ్గెమిటు గొట్టిరని గో, గుద్దుకొనం దొడఁగి రంటని కొప్రపుసాముల్. ౪

---

*బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకు......

సీ॥ ... ... అష్టావధానంబు నాచరించెదరేని యద్దానిమించి సేయంగ లేమొ, శతఘంటకవనంబు, నల్పఁబూనెదరేని యద్దానిమించి సేయంగలేమొ...

‡ గీ॥ అన్యునిసహాయ మించుకైనలేక. పద్యమవధానమందు జెప్పంగ లేని, మీమహాధారణాశక్తి......

$ ......తెలుఁగు మీసంబు నిలుపంగ దివ్వుడింక. (2(-8-11)

---

§ మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బారాయ కవిగారికి. అయ్యా! పద్యమయంబగు తమయుత్తరమందినది, "పెపరువును మాపుమాటకు జవాబు నొసంగిన వాఁడ నమ్మఁడి" అని వ్రాయించినారు. ఏసందర్భమునం దేవిషయమునం

క॥ మనురామకృష్ణులకుఁ జ, క్రనిబద్ధమ్ములను వ్రాసి ఘనత నొసఁగి రి
య్యనువున మనలం జూచిరి, యని లోలో నగచిరంటివి యాత్రిపుంగవుల్,

క॥ అనుకొంటి మేము వీరికి, ననవద్యపుఫక్కి వచన మైనన్ వ్రాయం
జనద, యది గ్రామ్యశైలిం, బనుపడుటే యుక్తమనుచుఁ బదపడి జననీ. ౯

క॥ కాని యటు మొదట యోజన, మానసమునఁ దవులకున్కి మఱి యాధాటిన్
బూని లిఖియింప మైతిమి, దానికె యక్కవుల కెడఁద తబ్బిబ్బయ్యెన్. ౧౦

క॥ తగినంతగూఢ గతి మే, మగుపఱచిన వీరికర్థ మగుటె ట్లటు వ్రా
యఁగ నర్థము తముఁగోరఁగ, నగరాజకుమారి! వీరి నగరాదె విజ్ఞుల్. ౧౧

సీ॥ అవి యనద్వాహమ్ము లన, "మాకు నిత్య మి
య్యకియె కూర" కటన్న దెవరు జననీ?
ఒక్కరొకరి యిద్దరొక్కరికి దేవులను కేలి
"కెద్దు"లంచనుకొన్న దెవరు జననీ?
"లవణం బనిన నేదొ యావలికిఁ జని తెచ్చి
యొలమి వడ్డించిన దెవరు జననీ?
సభ "నథాతో బ్రహ్మ' చదువ "సీతాత" లో
నవుప్రసంగము సేసి రెవరు జననీ?

గీ॥ వారిలో వారు గారొ కొంప్రంపువారు, కాక యుండిన గీత మొక్కతన వృత్తి
మయ్యె వీరికి నీలాటి యశముశుభము, నెఱుఁగని యమాయికులు మిన లెత్త నేల.

క॥ ఇది యిట్టు లుండె మాజా, బది వారికిఁ జేరె మరల నలవాగ్జాలన్
గుదురుచుకొను నీలోపలఁ, బొదలిన వేళాకవిశేషమున్ విను మంబా, ౧౩

(మ॥ రా॥ రా॥ ఏకా రామమూర్త్యపంతులుగారిచట విందు)

ఉ॥ ఇంతకుమున్నె విందనుచు నెల్లబుధుల్ విన రామయార్యఁ దే
నంతసమానియో పిలిచెఁ జట్టన నాఁడె నియోగివైదిక

దేరూపముగా మాచే మాట మీరేపరువును మాపినదో యా విషయము విపులముగా వ్రాయించినంగాని మీకుఁదగిన యుత్తర మిచ్చుటకు వీలులేదు. కావున వెంటనే దయచేసి పై విషయమును వ్రాయింతురుగాత.— 21-8-11.

ఇట్లు, దివాకర్ల తిరుపతిశాస్త్రి.

స్వాంతము లెల్లఁ బాఱఁ గొనసాగని యాసనచర్చకల్మి, ధీ
మంతుఁ డితండు మున్ననినమాటకు దాఁటక వచ్చి చెచ్చెరన్. ౧౪

ఉ॥ నేఁ డరుదెంతు మన్న నుడి నిక్క మొనర్పఁ డటంచుఁ బిల్చి మీ
మోడిన త్రోవ గన్పడఁగ నెయ్యన నయ్యనఘుండు వోయి "బోఁ
గూడదు కూడదు" నంచు నొకకొందఱు దండడిఁ జర్పఁజేసి రా
పాడి గడింప "కేగుటయె బా" గనె వెంకన నిర్విశంకుఁడై. ౧౫

ఉ॥ విం దనుకూలమై జరిగె విందున లోప మొకింత లేద, యెం
దెందులకేని మంచి దని యెంచిరొ యేమొ, మఱొక్కపంక్తి మా
కుం దమవారి కందఱకుఁ గొండొకపంక్తియుఁ గాఁగ నేరుపా
టుం దగఁ జేసి రయ్యది కడున్ సుఖ మిచ్చె ననేకభంగులన్. ౧౬

ఉ॥ పట్టురుమాల్ బుజమ్మువయి బాలరవిప్రభలీనఁ బంక్తికిన్
రాట్టయి యగ్రపీఠమున రాజిలెఁ గొప్రిషు సుబ్బారావు, బల్
దట్టులు మండపాటికులధన్యుఁడు లోనగువార లాతనిం
బట్టి క్రమమ్ముగా నతనిపంక్తి నెసంగి రభంగురస్థితిన్. ౧౭

తే॥ గీ॥ జరిగె నారీతి విందు ప్రశస్తగరిమ, భోజనానంతరమ్మున నోజఁ గొంద
ఱేంగు దెంచిరి వారు కోటీశశర్మ, శాస్త్రిముఖ్యులు పదపటిచర్య వినుము. ౧౮

మ॥ చిఱుమామిళ్లసులుండు యోగ్యుఁ డలలక్ష్మీపూర్వనారాయణుం
డురుకీర్తిస్థవిరుండు వచ్చె నట కుద్యోగిత్వమైత్రిన్, ధురం
ధరులై తక్కినచుట్టలున్ మఱియునుం దక్కంగలా రొప్ప భా
స్వర మయ్యెన్ దగుపాటిగా సభ భవిష్యచ్చర్య సూచించుచున్. ౧౯

శా॥ ఏ కారామయగారితమ్ములఁట? బీ,యే,బీ,యలై ప్లీడరీ
దాఁకన్ వచ్చినమేటియంట? మఱి యా ధన్యుండు తాంబూలముల్
వీఁకన్ గొన్ని ఫలమ్ములుం గొని సభన్ వీక్షించి తాఁ బంచె నా
పోకల్ కొండొక వర్ణనీయము లనం బోలుం జుమీ శాంకరీ. ౨౦

ఉ॥ ముందు భుజంగరాయనృపమూర్తికొ, కొప్రపుటయ్యకో, కలగ
బందఁగఁ జేసి యాపిదప నన్యులు బందుల కిచ్చి మీఁద న

స్పందితకీర్తి కంఘ్రిజనిభాన్వయుఁ డౌనలమేటి కీయ నా
విం దతఁ డందకే కదు వివేకి మనున్ గరసంజ్ఞఁ జూపుచున్. ౨౧

ఉ॥ రామయగారితమ్ముఁ డలరారెడియోగ్యతఁ బొల్చువాఁడు సు
శ్రీమహితుండు లక్ష్మినరసింహసమాఖ్యుఁడు మా కొసంగెఁ ద
ద్ధీమహితత్వమేమి, మఱి తేఁకువయేమి మది న్నుతించుచున్
ప్రేమ ఫలమ్ము వెంకన పరిగ్రహణం బొనరించెఁ గ్రన్ననన్. ౨౨

చ॥ తిరుపతి పుచ్చుకోక యొకతేఁకువ దాని ననాదరింపఁగాఁ
గరము మదిన్ దలంచి యటు కర్జమునన్ గుశలత్వ మూనె, నం
తరమునఁ బత్రదాత యది తా గ్రహియించె నొకింత చర్చయున్
సరసముగా నెసంగె నది సభ్య లెఱింగినదే మహేశ్వరీ. ౨౩

ఉ॥ రామయగారికిన్ మఱియు రామయతమ్ముఁడుగారికిన్ గనన్
ధీమహితత్వమందునను దేఁకువయందును గల్గువారకున్
మామదిఁ జర్చ సల్పుచుఁ గ్రమమ్మగ వచ్చినతోవ నింటి కే
మేమియు చెప్పి కొంచుఁ దగ నేగితి మానిని వోయె నీగతిన్. ౨౪

చ॥ వెలవెలవోయెఁ జుక్కలు వివేకవిహీనులమోములట్లు ని
ర్మలసలిలాశయంబులు ప్రమాద మెఱుంగని వారి మానసం
బులబలెఁ దెల్వి మీఱె ఘనపుణ్యులు వైదికులు న్నియోగులున్
గలిసి యొసంగునర్ఘ్యములు గైకొనుచుండె దివాకరుం డొగిన్. ౨౫

మ॥ అది వర్షర్తువుగాన మేఘపటలం బావంత దన్గప్పఁ గో
విదమాన్యుండు దివాకరుండు తనగో విస్ఫూర్తిచే జ్ఞానిదు
ర్మదముంబోలె నపాకరించి సుదినశ్రీఖ్యాతి యవ్వేళకున్
గదియన్ వెల్గఁదొడంగెఁ గాక వితతుల్ గ్రాసార్థ మఱ్ఱాడఁగన్. ౨౬

క॥ తరువాతఁ దనదు సొమ్మగు "గురుతరలీల" యనుపదముగొని పద్యంబున్
బురపుర లిఖించి మీసము, స్మరియించుచుఁ గొప్పగంపు చతురుఁడు పెలుచన్

ఉ॥ *పత్రిక నంపి యప్పుడును బద్యము వ్రాయక యుత్తరించుచున్
పత్రికఁ జూచి "పీగ్మనకుఁ బద్దెము వ్రాయమిఁ జూడ" నేటి కీ

---

*మహారాజశ్రీ తిరుపతివేంకటేశ్వరకవులకు......చ॥ గురుతరలీలఁ జెప్ప సభ పూర్వఁగ నుంటిమిగాని, భానువా।సరమున దక్క రారెవరు,...ఆశుకవిత్వశతావ

యాత్రము మీరు మాకుఁ గవులేయనితోఁపరు మీరు తిట్టినన్
శత్రుత మాకుఁ బుట్టె దనుచందముగా మదిలోఁ దలంచుచున్. ౧౮

క॥ వదవద*వచనమె వ్రాయుచుఁ, దుదిదనుకం బత్రికలకు దొడఁగెన్ సుకవుల్
వదుగురుగల సభయనన, పైదలో రాయివడి వ్రాఁతలెల్లన్ సురిఁగెన్ ౧౯

క॥ †తటిమితటిమి మనుమాకు, త్తరములు లిఖియించు నతనితత్తరమాపై
విఱిగి సురిఁగి కరిగెనొ? యు, త్తరమే వచ్చుటకు మిగులఁదడవై పోయెన్. ౨౦

---

ధానముల్। విరచన సేయ రాఁగలయు, వెంటనె, మేమవియాచరించి ధీ। వరసభమీ ప్రతిజ్ఞ గెలుపం గలమీసము దీయఁజేతుము ...”

గుంటూరు, 22-8-11. } ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ, శతావధాని.

గుంటూరు, 23-8-11.

*మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి. అయ్యా, ...మీన పుఁ బద్యమున కర్థ మేకారణముననో మీకుఁ దెలియలేదనుకొనియెదను ... తెలియదేని పెద్దల నడుగుఁడు... (4) ఈ ప్రతిజ్ఞ ప్రస్తుతవిషయము కాకపోయినను మీయంతట మీరు పురస్కరించుకొని వివాదమునం దిగుటచే నయ్యది యింతటినుండి మీయెడలఁగూడ నిర్వహించుట కంగీకరింపక తప్పినది కాదు....(9) మీరు మాకుఁ దెలిసిన యంశములలో నేకదేశప్రవిష్టులు మాత్రమేయయినను మీకోరికం బట్టి మీ సభకు రా నుద్యోగింతుమే యనుకొనుఁడు రేపిఁక నొక రాంధ్రభాషైకదేశమగు గ్రామ్యభాషయందుఁగాని నిర్యతిగణప్రాసస్వాశబ్దరసాభాస కవిమార్గమునం గాని యనర్గళముగాని మమ్ము జయింపుఁడని కోలుదవ్వినచో మా గ్రహచారమందుకు నొడఁబడవలసినదేనా! అందులకుఁ బ్రాజ్ఞులు సమ్మతింపవలసినదేనా! మాకుఁగల శక్తులలో నేకైకదేశమునఁ నంతో యింతో యెంతో రుకాఁగిన వారెల్ల మమ్మెదిరింపఁ దగువారేనా! శాంతంపాపం...(12) ఈ వ్రాఁతవలనఁ దెలుఁగునేని మీకువదలితిమని యనుకొనకుఁడు....”

గుంటూరు, 27-8-11.

†మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి, అయ్యా,(1)జరూ

క॥ లలి "బాజానందడి మం, గళ సూత్రము మఱచినట్లు". గా సభకై మున్
గలిగిన రవివాసర మా, పలికిన జని వచ్చె సోమవాసర మంతన్. ౩౧

చ॥ సభయగు నన్న యాదినము నందడిగా జను లేగుదేర రా
సభ మయి పోయె నెయ్యెడల సందుల గొందుల వంటపూటియిం
డ్ల భరముగా జనుల్ విడిసి "డాబులు డాబిరి యేలసేయరో
సభ"యని క్రొవపుంగవుల సారెకుఁ గేరఁ దొడంగి రంబికా. ౩౨

సీ॥ పుట్టదిట్టము లేదు పోని నిల్చుటెట్లు కొప్పరమంచుఁ బలుమాఱు పలుకువారు,
తన్నుఁ గజ్జలబల్మి తనయున్న తినినిల్పు నెంతదనఁ బ్రనటంచు నెంచువారు,

---

రు "అని 25 వ తేదీని మేము వ్రాసిన యుత్తరమునకు 27 వ తేదీ 11 గంటలకు మీ రిచ్చిన జవాబు అందినది... ౧. సభ మున్ముందుమీరే చేయవలెను, ముందుత్తరము వ్రాసి యవధానాశుకవిత్వములకై కాలుద్రవ్విన వారు మీరు కాని మేము కాము, ...౨' మావిషయమై మీరును మీవిషయమై మేమును నవధానపు టేర్పాటులు చేసికోవలసిన దేకాని యయ్యవి సభ్యులేర్పఱుపఁదగినవి కావు, ఉభయులచే నేర్పఱిచి కొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును దారతమ్యములును విచారింపఁదగిన వారు మాత్రమే ౩. ఈవిషయముల కంగీకరించుచు మీరుసభ సమకూర్పుఁడు, లేదా మేము సమకూర్చెదము...౪. జరూరని వ్రాసినను వెనుకటి వలెనే ఆలస్యము చేయక రేపు సూర్యోదయమునకుఁ దప్పక జవాబు పంపవలెను.

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

ఉదయం 8 గంటలకు 28-8-11, గుంటూరు,

ఆయ్యా! ఈదినమున సభ తప్పక జరుగు ననుమీప్రకటనను బురస్కరించుకొని యనేకు లనేకగ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని వృథా శ్రమల నొనరించుట యుచితము కాదు కావున నవధానసభావిషయ మేమయినదియుఁ బ్రకటించి వారిసందియము తీర్పుఁడు మాయుత్తరమునకుఁ బ్రత్యుత్తరము రాకుండఁగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా?

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

తన్నానుబండతే తన్నువంచన సేయు నవసరంబైనప్పు డనెడువారు,
నేల విడిచిసాము లేలాకో? యొకచోట నంతలోనే యుండక నెడివారు ౩౩

తే॥గీ॥ వింధ్యగర్వంబగస్త్యున వంధ్యమహిమ, నుగ్గడించి యిసీ? యనియొఱలువారు
హంసకాకచరిత్ర మిష్టందఱకును, స్మృతికిఁ దగిలె నటంచు వచించువారు.

మ॥ ఒకటే శైలిగ నొక్కటే వడిగ నోహో! యంచుఁ గవ్యగ్రణీ
ప్రకరం బెంచఁగ నంచ యేగె, నటు "రార"మ్మన్న కాకంబు ము
న్నొకటీ, రాపయి నొక్కటీరు, పయి నెన్నో తీరులై డస్సి, నూ
టొకయానమ్ములు చూపి కాదె 'శరణం బొందెన్ మరాళప్రభున్. ౩౪

క॥ అనిపూర్వగాథ లెన్నుచు, మనమునఁ దమపడినశ్రమకు మతిమతి విసువుం
గనుచుఁ దిరిగిపో నెంచుచుఁ. బునఃపునర్యోజనలకు బుద్ధి చొనుపుచున్.

ఆ॥ వె॥ కొండవీటిసామివండ నుండెడిలేడి, కొండతేనికూఁతుగుజ్జుమనకుఁ
దఱుచుభయము చెందిదండంబులిడునొయ, ద్దానితోడఁ బెనఁగుతలఁపు గొనును.

తే॥ గీ॥ సింహగమనంబు నేర్వంగఁ జిన్నిలేడి, కెన్ని జన్మమ్ములెత్తినయేనిగలదె
పాల్యపాలకభావసంబంధ ముడువఁ; దలఁచుటదియెంతయేనియుఁ దప్పిదంబు.

క॥ తనపాదములు మనమ్మన, ననయము మననమ్మి నల్పునప్పటికిన్ దాఁ
గనికరము కరము గని దా, నిని ముర్వగఁ జూడకున్న నేరము హరిదా. ౩౭

క॥ హరికిన్ హరిణమునకు నం, గర మది హాస్యాస్పదంబు గా దనువా రుం
డరు దానికేమి హరిణము, కరి నెదురుటె యంద మెట్లు ఘటియించునటుల్.

ఉ॥ రంకువు శీఘ్రగామియని రాజులు పట్టపుటేన్గు వీడి రా
జ్యాంకము గాఁగఁ గైకొనిరె యక్కటి? యేనుఁగుతోడఁ బోర నా
జింకకు శక్తియున్నదె? ప్రసిద్ధికినై "యెదిరింపు"మంచు నే
కొంతును లేనివారు పురికల్పినమాత్రన యేమిలాభమో. ౪౦

చ॥ అదులకభేద్యమైన చతురంగబలమ్ములు గల్గుతేనితో
గొఱియలగొల్లటోఁ డెదురుకోలు ఘటింపఁగ నెంచి "మీరలున్
గొఱియలతోనె రండనుచుఁ గోరిన "సీ" యని రోసి దానికే
"సరి"యని సిద్ధపడ్డ వెడజాబుహరాబుల దాబు లేటికో. ౪౧

ఉ॥ ఇచ్చి వరమ్ము గైకొనరె యెల్లసురారులకు న్నిలింపు; లా
నచ్చరితుల్ మహామహు లనన్యదహారులత్రోవఁ బట్టి వా
రిచ్చిన మెచ్చు లాగికొను టేమి యపూర్వము? మెచ్చినంతనే
హెచ్చును దగ్గునే? వలవదే? తల దాఁటినపోక లొప్పునే. ౪౨

శా॥ దేవ బ్రాహ్మణవృత్తులన్ విడిచి వర్తింప న్నిరాగించి భూ
దేవుల్ వీడుడు రాలపోతు నది భూదేవాజ్ఞకుం దక్కు దు
ర్భావం బౌతటి నూరకుండరు గదా? పైవచ్చుచో నెవ్వరిం
గావంజూతురె? కావలం బడఁపరే? కాల్ద్రవ్వఁ గా నిత్తురే. ౪౩

ఉ॥ చెక్కిలినొక్కుచున్ జనులు చేఁపఁగ ముద్దిడుకొంచుఁ బేర్మిపై
నక్కునఁ జేర్చికొన్న సమయమ్మున బాలుఁడు పాలు గ్రోలుచున్
ముక్కు "కటుక్కునన్" గొఱుక ము ద్దదియెల్లను మూలఁబట్ట నా
యక్క "ఇదేమిరోరి చెడుగా" యనదో సమె? దానరోసమే. ౪౪

చ॥ వితతతరప్రబంధముల విశ్వజనీనములన్ రచించి కీ
ర్తి జగమెల్ల ముంచుచుఁ జరించెడి తిర్పతి వేంకటేశ్వరుల్
మతిచెడి కొప్రపుంగవుల మాయకవిత్వముతోడఁ బోరికిన్
గుతుకము పూసినా రని జనుల్ విని నవ్వరె మొగమ్మునన్. ౪౫

ఉ॥ అల్లిక కేమి సాలెపురు వల్లదె? 'హు' ప్పని యూఁదుసంతలోఁ
బొల్లగునల్లికల్ సరిగ బుద్బుదముల్ గదె? దీని కేసుదృ
క్తల్లజచిత్తమేనియు యథార్థముగా ముదమందునే? యెటో
యల్లిన దేల కాదనఁగ నంచది మే, లను టొక్కమెచ్చుకో. ౪౬

ఉ॥ మంగలివాని యుద్ధము క్రమమ్మున మున్ను రచించినట్టివే
ముంగలి కిడ్చి పాఠమును బొల్పుగ నప్పఁగఁ జెప్పశిష్యపో
లిక్కంగడు ఘాటిగాఁ జదివి కేవల మెక్కడో యొక్క టొక్క టో
జంగయితంబు నెప్పట యశక్కరమే? సుకవీంద్ర సత్యమే, ౪౭

ఉ॥ విప్రవినోదినంచి నెటు వేఱొక వస్తువులుండు నట్టులే
కొప్పపువారు నంచి నిడుకొందురు వర్ణన లన్ని చేసి, యా

శుపత్రికృతిన్ రచించి రని శుద్ధు లమాయికు లంద్రు మర్మముల్
సుప్రథితుల్ గ్రహింతు రిది చూచిరి పట్టి రనేకు లెల్లెడన్. ౪౮

ఉ॥ గుట్టిది బైటఁ బెట్టుటకుఁ గొందఱు ఱెంగియు సంశయింతు రీ
చెట్ట నడంపకున్న నెటు చేటు దొలంగును? మహాకవిత్వ వి
ద్ధట్టసుధానధామకవితానవతామరసాననావచః
పట్టణవైభవప్రథితబంధురసౌధవిలాసలక్ష్మికిన్. ౪౯

ఉ॥ జీవనమూడె మాకని వచింతురుగా కొకకొంద ఱట్టి వా
రేవగనైన జీవనము నీవయిఁ జేతురుగాక కైత యే
కావలెనే? మఱొక్క గతి గానఁగరాదె, యమాయికాత్ములన్
జీవికకై జగం బవహసించునటుల్ గికురింపఁ జెల్లునే. ౫౦

చ॥ ఇటులొక కొంతమంది కడు నెవ్విదవుం గతి దోఁపనాడ న
ప్పటుమతు లాఁడుపల్కు లలపక్షము వారు సహింప "కేల యీ
కటుఫలుకు? కొప్రపుంగవు లఖండులు వారల శక్తి చూడుఁ, డు
త్కట మది, గోరతం బనెడి కావ్యమునం దగుపట్టు నావుడున్. ౫౧

ఉ॥ అప్పరమేశ్వరీ దయకు నాకరులన్ గదలించి దానిచే
గొప్పను గోరి గర్తమునఁ గూలి యెటో వయి రాఁగడంగి యీ
కప్పలరావముల్ కొలఁయఁ గా వని లోనఁ దపించి పొకుచు మీ
కొప్పరపుంగవీశులకు గోరతమే హితమెన్న భంగులన్. ౫౨

చ॥ అనుటయు వారిపక్షపు జనావళి వారలయోడు పూర్తిగా
మనమునఁ బట్టియుంట మఱుమాట వచింపక యూరకుండ వ
చ్చిన జనసంఘమందలి ప్రసిద్ధులు కొందఱు కొప్పరంపువా
రిని గని కొన్ని మాటలను రేఁగగనేగెవ మంచు నెంచుచున్. ౫౩

క॥ చనుచుండ వారిపక్షమ్మున వా రొకకొందఱాఁగి మొగి నేమేమో
యన మొదలిడ 'మీ రెవ్వరు? చనఁడా, మే మడుగ నటకుఁ జనవలెననుచున్.

శా॥ కాలిం దప్పివతి రూరకుండెద రె? సంసారుల్ జగమ్మందు వే
వేలున్నా రలవారిఁ గోరికొనుఁ డావిద్వాంసు లేతెంచి మీ
మీలో వమ్ముల నేర్పరించెదరు సామ్మెమ్మరి కెవ్వారికిన్
వీలో తెల్పెద రీనుడిన్ వినఁగ నువ్విళ్లూరెడిన్ లోకముల్. ౫౪

క॥ తిరుపతి యెట్టిదియో? కొ, ప్పరపెట్టిదియో కవిత్వభర మెట్టిదో? సం
స్కారం బెట్టిదియో? ధి, క్కారం బెట్టిదియొ? తెల్పఁ గల రవ్వారల్.

చ॥ పరు వెటువంటిదో? పెలుచు బాసయు నెట్టిదో? లేశమేని సం
స్కారము పూజ్య మయ్యు నరిగంగలనాడుట యెట్టిదో? సమ
స్స్ఫురణకు నాననమ్ము నెడఁ బోరెడిధీరత లెట్టివొకో? ప్రవి
స్తరము లానంగు లెట్టిదియొ సత్కవితా వనితా వినోదముల్. ౫౭

ఉ॥ కోరిక యెట్టిదో? యచటఁ గొం కుదయింపమి యెట్టిదో? పరి
ష్కారము లెట్టివొకో? మమకారము లెట్టివో? యంతఁ బోక ధి
క్కారము లెట్టివో? పయివికారము లెట్టివో? బారుబారలం
కారము లెట్టివొకో? యధికారము లెట్టిదో? కారమెట్టిదో. ౫౮

ఉ॥ సారము లెట్టివో? పయి నసారము లెట్టివో? కాలుద్రవ్వు ఝం
కారము లెట్టివో? పయిఁ జకారము లెట్టివో? యంతలో దళ
త్కారము లెట్టివో? పటిమ నికారము లెట్టివో? పిమ్మటం దిర
స్కారము లెట్టివో? పోరిఁ జూత్కారము లెట్టివో? కాలు లెట్టివో. ౫౯

ఉ॥ బీరము లెట్టివో? తిరుగు జేరము లెట్టివా పిమ్మట న్నమ
స్కారము లెట్టివో? పయి బ్రకారము లెట్టివో? యాపయిన్ వష
ట్కారము లెట్టివో? పయి నకారము లెట్టివో? మీదుమీదు నా
కారము లెట్టివొకో? నుడికారము లెట్టివో? వైరమెట్టిదో. ౬౦

ఉ॥ హారము లెట్టివొకో? వ్యవహారము లెట్టివియొకో? యాచమ
త్కారము లెట్టివొకో? యయికారము లెట్టివియొకో? పై బహి
ష్కారము లెట్టివొకో? యుపకారము లెట్టివియొకో? యాయహం
కారము లెట్టివొకో? యపకారము లెట్టివా నేరమెట్టివో? ౬౧

ఉ॥ పాగము లెట్టివొకో? పయివారలశూరత లెట్టివొకో? స్వీ
కారము లెట్టివొకో? గుణకారము లెట్టివో? చుట్టునున్న ప్రా
కారము లెట్టివో? పయి లకారము లెట్టివో? చాటుచాటు స
త్కారము లెట్టివో? తెలుపఁగాఁ గలవారలు పండితుల్ గదా. ౬౨

చ॥ కవి యన నెట్టిఁడో? కవిత గాఁ దగునట్టిది యెట్టిదో? వృథా
రవణము లెట్టివో? కవుల రావము లెట్టివో? సత్క్రియీశ్వరో
త్సవ చరితము లెట్టివో? బుధత్వ మదెట్టిదో? యేరి కేరికిన్
శివ? శివ? సామ్య మెట్టిదియొ? చెప్పఁగలారు బుధోత్తముల్ గదా. ౬౩

చ॥ ఎవరును నేరు నొక్కయెడ నెల్లరు నొక్కఁగఁ గూరుచున్న నొ
వ్వపు నొకో! యేరికిం దగదో? యకట! శక్తులు పట్టి చూచి "వీ
రక్రవు లలవారలో! కవులు గాఁ దగువార" లటంచుఁ దెల్పఁగా
నెవరితరంబు? పండితకవీంద్రులు దక్క జగత్త్రియమ్మునన్. ౬౪

ఉ॥ రా మనిరో క్క! పండితులు, రమ్మని కోరనె లేదో? నద్యశః
కాములు మీరు వారిపయిఁ గా లటు దర్విద్వ యుపేక్ష సేయఁగా
నేమి! వృథాగ లోకమున కింత పరిశ్రమ మేల పెట్టినా
రీమెయి నూరకుంట తగునే! యని కంకెద మంచుఁ బోవుచో. ౬౫

ఉ॥ ఏమిది! యీజనంబునకు నింతటిపక్షము వారియందుఁ, ద
న్నామము వీరి కింతగ మనమ్మున కెక్కఁగ నేల! కొవ్రెపు
న్నామము కోపపాత్రముగ నాటగ నేల! స్వదేశవాసు లన్
ప్రేమనుగూడఁ గన్నడ దరిపత్రికరమ్మును మించి రిప్రిజల్. ౬౬

చ॥ అని మనమందు నెంచుకొని యవ్వలి పక్షపువారు "మీరు వ
చ్చిన పనిచూచిపోవుటకుఁ, జెప్పెడిమాటలు పెద్దమాట, లే
ర్ఘను లయి మీకుఁ గట్టములు గప్పెదరి? రింటెటి కంఠశోషకుం
బని గనుపట్ట" దంచు నుడువన్ "బని లేనిదె వచ్చినారమే. ౬౭

మ॥ కవితావాద మటన్నఁ జూచుటకునై కష్టించి యీసత్ప్రభా
సువిశేషంబుల నాలకించుటకు నచ్చోనుండి యిచ్చోటికిన్
జవసత్త్వమ్ములు వెచ్చఁ బెట్టుకొని రాఁ జన్నే! వృథాహంకృతి
స్థవిరుల్ సించినపత్రికల్ గని యథార్థం బంచు నూహించుచున్. ౬౮

మ॥ అదిగా మారక వ్యాఘ్రముం గదుపులా గంతంత మిట్టెక్కి నె
మ్మదికి న్నెమ్మది దక్కి మినుములపై మాత్సర్యమున్ గ్రక్కి సా

చ॥ అవు దొరకచోట విందునకునై చనియుంటిమి మేము మానిగా
సవదము చూచి వీరలును జాతిరోగో! యని యాడుకొంచు న
ట్టివనియు నుందునే! యనుచు, డీకొని కొట్టెడిసేన పోల్కి న
య్యపరిమితత్రిజానిచయ మయ్యెడకే చనుదెంచె నంతటన్. ౭౬

శా॥ అందుం గొందఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మవా
రెందుం గన్పడి రిందఱున్ గవితకై యేతెంచుటం జేసి యం
దం దించుంచుక గోష్ఠి గల్గు టనుమేయం బయ్యె నూయంబ! మే
మెందు న్మొగ్గనియుండ మిందఱను దాదృగ్శక్తిసంపన్నులన్. ౭౭

ఉ॥ నాలవజాతియందలిజనంబులు తూర్పున నుండ్రు గాని యీ
నాలవజాతివేఱు నయి నాగరికత్వము మాట కేమి వి
ద్యాలయులన్ప్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతముల్ సహస్రముల్. ౭౮

ఉ॥ వారలు నస్యలుం గడు నవారిగ వీథికి రెండువక్కలన్
బారులు గట్టి నిల్పి యిట వచ్చుట, కొత్తవారిఁ జూడఁగాఁ
గోరికతోడ నేగి తమకున్ మఱి వా రగుపట్టమిన్ వృథా
యై రహిఁ గండ్లకున్ మరలు. టాదిగ నొండొరు లాడుకొం చొగిన్. ౭౯

శా॥ అయ్యా! తిరుపతివెంకటేశ్వరులు! మీ రత్యాశతో వేడ్క మీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ల్బ్రిద్వనా రెవ్వ రా
యయ్యల్ మోమును జాటు వెట్టి రిఁక మా యాయాసముల్ వ్యర్థమే
యయ్యెన్, వచ్చినత్రోవఁ బోవుదమొ, లేదా? యుందుమో? తెల్పుఁడీ. ౮౦

చ॥ ఎఱుఁగుదు మేము "కొత్వర' మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపాత్రముల నింపెసలారు "ఫొటోలు" దక్క నేఁ
డరసితి మయ్యె ధన్యము భవాదిక; మూరక పొమ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతురో. ౮౧

చ॥ అనుచు ననేకభంగుల జనావళి మాతయిఁ గల్గుప్రేమమున్
నుప్పఁడగ జేయుచున్, బలుకఁగా వ్రభుదేము వసించుసౌధ మె

య్యన డిగి నాటకాలయమునం దొకమేటినథుఁ బొనర్చి నే
ర్చినగతి వారికిన్ గలుగఁ జేసితి మగ్గల సైనమోదమున్. ౯౨

సీ॥ ''తిరుపతివేంకటేశ్వరులఁ జూచితి'' మంచుఁ బలుమాఱు సంతసంపడెడివారు,
ఉవ్విళ్లూరుచు లేచి యొక్కదండముగ లేచి నమస్కారమ్ము లిడెడివారు,
కొంపఁగొంపులవార లీగొడవఁ దెచ్చుట మేలె యయ్యోఁబోయి యని పేర్కొనాడువారు,
కయ్యంపునటఁ జూడఁగలభాగ్య మింక లేదు వారుపాటిరటంచు దూఱువారు.

గీ॥ పాటి కేమి యొనర్తుగు వారికున్న, సరుకు నెఱుఁగమెయని చర్చసలుపువారు
వినచోఁ గాలు ద్రవ్వనేలనెడివారు, అనుగుమవ్వారి నటకేగుచునెడువారు.

ఉ॥ అన్నిట వీరిదృష్టిని శతాంశము వారలు గారు దడ్డడన్
దున్నకవిత్వమందు వలఁతుల్ మనవారలె యాదు, రంచు; నే
మున్నది దానిలో ననుచు, నుండిన దేదియొ యున్న దంచు, నా
తెన్నొక కష్టమే యను, చుదీర్ణతరమ్ముగ వాదు లాడుచున్. ౯౩

ఉ॥ ఏమియు రానివార లెటు లేది యొనర్చిన మంచి దౌ సుధీ
గ్రామణు లట్లొనర్చునెడ గ్రాంధికు లొప్పరు సాఁగఁ దీటు రిం
తే, మనవారు వోలె నలతిర్పతివేఁకటశండితుల్ వచ
స్తోమము జార్చ లేరె యది బోనముగాఁ దలపోయ కుండుచో. ౯౪

ఉ॥ జార్తురు గాక నో రెటులొ చయ్యన, నెయ్యన నట్లె పద్దెముల్
గూర్తురుగాక వీరు ''చెవి గోసిన మేఁకల'' పోలికఁ జాలసే
పార్తురె! డయ్యరే? యుభయు లంత బలాఢ్యులె దేహదార్ఢ్యమం
దేర్తురు కొప్పరంపుఁ గవు లీకవియుగ్మము సుక్క వ్రేల్మిడిన్. ౯౫

చ॥ అనునెడ దేహదార్ఢ్యమునకా యలవారలు గాలు ద్రవ్వ రి
త్సనియెడ నేను జాలసుకొ? పాండితియున్న భయమ్ము గాని వీ
రని మఱి వారిసిం గలిపిరేనియు నాబుజ మొక్కటే సుఁడీ
పనిఁగొని యాఁపు నం చొకడు బాహుబలాఢ్యుఁడు పల్కె నల్కమై. ౯౬

క॥ అని వారి వారికిన్ దోఁ, చినగతిగాఁ ''బిచ్చ పాటి'' చెప్పికొనుచు భో
జనపుం బసలకుఁ జని మఱి, దినదినమున నటనుండి బయలుదేఱిరి వారల్.

చ॥ నెలవును వ్రాసె సూరెలునకుఁ జెచ్చెర వెంకటశాస్త్రి మున్నె, యీ
కలహము దేలునంతకును గాల్గదలింప నటంచుఁ బంతమున్
గలిగి వసించె నప్పురిని, గయ్యపుసంగతు లాలకించి శి
ష్యులు మఱికొంద ఱయ్యెడకుఁ జూడఁగ వచ్చి తనన్ భజింపఁగన్. ౯౦

చ॥ సరసులు యోగ్యు లౌజనులు సంతతమున్ గవితాదరమ్మునై
నెరఁగుచు విందులన్ దనిపి యెంతయు గౌరవ మాచరింప న
ప్పర మది వాసమై యచటిపూజ్యులకున్ దలలోనినాల్కయై
తిరుపతి యప్పు డప్పు డరుదేరఁగ, వెంకన యుండె నయ్యెడన్. ౯౧

శా॥ "ఆసీమాంత మొనర్చి గాని విడువం డావెంకటేశుం" డటం
చా సీమన్ జనులెల్లఁ జెప్పికొన నిత్యమ్మున్ గవిశ్రేణి కెం
తే సంతోసము గూర్చుచున్ విమతు లంధీభూతచేతస్కులై
యోసున్ జెంది కృశింప మూడునెల లందే యుండె నుద్దండతన్. ౯౨

ఆ॥ వె॥ మొదటఁ గాలు వెట్టినది యల్ల*శిష్టాహ్వ, నామదార్యగేహసీమ యచటి
నింబభూరుహంపునీడ సాక్షాత్కల్ప, పాదపంబునీడ గాఁ దనర్చె. ౯౩

ఉ॥ చాపలు నిండి బల్లలకుఁ జాలి రజఃకణకీలితంబు భూ
మీపద మాక్రమించి పయిమిక్కిలి వీధికిఁ దాఁకి గేహపుం
దాపున నున్నయన్యసదనంబుల పక్కల నిల్చి సారెకున్
శ్రీపతివేంకటేశ్వరులు చేయుప్రసంగము విందు రెల్లరున్. ౯౪

శా॥ అంబా? నింబము నీనివాస మదియా? యభ్రంకషానూనశా
ఖం బచ్చో నెపు డీవు పొల్చు టది సక్రంచే, భవత్సాక్షికం

(గుంటూరినుండి ఇకలు దేఱు సమయమునఁ జెప్పినది.)

*సీ॥ తిరుపతి వెంకటేశ్వరుని కొండను నీకు భేదమే కనఁబట్టలేదు తల్లి, శ్రీ శైలమల్లేశు శిఖరమ్మునకు నీకు భేదమే..., మధురమీనాక్షి వేశ్మస్థలికిని నీకు భేదమే..., కాశికావిశ్వేశగర్భగుడికినీకు భేదమే... తల్లి, తే॥ గీ॥ ఎట్టిసుముహూర్తమందుఁ దాఁగట్టెనొకొ, ఘనుఁడు శిష్టాహ్వనామదాఖ్యాక సుకవి, అడుగు వెట్టిన దాది బ్రహ్మసభఁ జేసి, పంపుచుంటివి నినుబీడ వలసె నేఁడు. (వెం॥ శా)

బుం బూజ్యాశయసాక్షికంబు నగుచుం బొల్పారుతత్తత్ప్రభా
లంబంబౌ కవితాప్రసార మది యేలా నొక్కి వ్రాక్రుచ్చుటల్, ౯౫

మ॥ ఎటు నీభక్తులవాక్ప్రభుద్రవము లందేహారె, శత్రువ్రజం
బటకుక్ వచ్చి మనంబునందు నెటు "ఛీ" లౌవార, లాకొవ్రపుం
గటువాక్యమ్ముల కెట్లు వా రురక దుఃఖం బందువా, రెట్లుగా?
గుటకల్ మ్రింగెడివారొ? నీమది యెఱుంగుక్ జెప్పఁగా నేటికిక్. ౯౬

ఉ॥ ఐనను శాఖ బాధ కయి యాపలికిం జని తప్పుచొప్పులక్
బూని యవాచ్యముల్ గిలికి పుచ్చియు నెమ్మన మాఁగ లేక మా
పై నెనరున్నయట్టులుగ వచ్చి రసం బది గోఁలి పోవు వా
రేని యథార్థముం దెలియు నెల్లరు నీవును డాఁగుదింతురే. ౯౭

చ॥ ఎలమి వచించి తీరవలె నీకపటాత్ములనత్యభాష; మీ
యలఘుల కేమి శత్రువులపై మఱి మావచనంబు లెట్లు వీ
నులకు రసాయనంబు లగునో? యవి జీర్ణము లైన వెంట లే
ఖల కవవాదముల్ గిలుకఁగాఁ గరముల్ దిరుగాడు టెట్టులో. ౯౮

క॥ ఖలజనులవర్తనములకుఁ, దల యని తోఁక యని చెప్పఁ దర మే? యలపా
పుల కేమి నింబకుజభూ, తలనభ లవి యెంత కేని దగు జగదంబా.

చ॥ అరు లగువారి కిట్టు లెదయందలికుంపటివోలె నుండి యా
తిరుపతివెంకటేశ్వరులు "తీర్పరులక్ బిలిపింపుఁడీ, సభన్
జరుపుఁడి మీవముల్ తెలుకఁ జాలినచోఁ బెఱుకుం డ,,టంచుఁ దీ
వరముగఁ దెల్పఁ గొప్పగవువారిబడాయిక్రిమక్రమమ్మగక్. ౧౦౦

ఉ॥ తగ్గి యిదెట్టులేనియును దప్పికొన న్వలె నంచు నంతటక్
బగ్గెలు వ్రాయ మాని తమపక్షము దగ్బల మాట నెట్టులు
న్నెగ్గ దటంచు లో నెఱిఁగి *నెయ్యుఱుకుం గడు గూఢవృత్తిపై
నగ్గతి దాఁచి స్నేహ మగు టర్హ మటంచు లిఖించుచు న్వనక్. ౧౦౧

---

చెన్నపురి; ఫైబ్రరి, గురువారం.

*....నిన్న కొప్పరపుంగవులు నాపేర 8 పేజీల ఉత్తరం వ్రాసినారు, వివాదద

చ॥ పయికిఁ బ్రగల్భవాక్యములె పల్కుచు నప్పరమందె తీరికన్
గయికొని మూరుచుండిరి ప్రకంపిత మైన మనంబు చందమౌ.
ల్లయెడల నెల్లరుం దెలిసి "లావణి" యంచు వచించుచుండు న
ప్రియములు పూర్తిగా వినియు బీరము మానర వారు మాటలన్. ౧౦౨

ఉ॥ అంతట వారిపక్షమున కాదరు వాకులవృద్ధుఁ "డక్కటా!
యంతన తేలిపోవు నని యంపు మటంటిమి పత్ర మల్ల వా
రెంతటిపట్టు పట్టిరో కో! యిప్పరి పీడరు కొప్పరంపువా
రెం తలవారిథాటిఁ కిపు డేమనుకొన్న మ తేమి లాభమా. ౧౦౩

మ॥ పులిపై బెడ్డను వేసి చెట్టుపయికిం బోవన్ వెసన్ దత్కుజ
స్థలమందే యది పీట వెట్టి యెటులో సాధించుఁ గావే పగన్
దొలి నాలోచన చాల దయ్యె నపు డేదో వ్రాయు మన్నార మి
ష్టలఁతిం బో కది "యేకు మే,, కనెడిసామ్యం బయ్యె నెట్లో కదే ౧౦౪

ఉ॥ పాపము! "వారిదాసులము వారలలోన శతాంశమేనిఁ గా
మోపము వారి,, కంచు నతియోగ్యుఁడు కొవ్రివు జ్యేష్ఠుఁ డప్ప తా

---

రితత్రమును వ్రాసినారు. తమదోషము లేశమును లేదనియు వెం॥ శా॥ అన్యాయముగా గర్హించిరనియు, మొదలుగా వ్రాసినారు. దానివైఖరి చూడఁగా వివాదమునుండి తప్పించుకొనుట కిష్టపడుచున్నారని దోఁచుచున్నది. అట్టిప్రయత్నమున్నచో తప్పకమీషను అంగీకరింప వేఁడెదను ఈ వివాదసభలు కార్యకారులు కావు. నడుమ వారికి పండువు, పోరాడువారికయ్యెరకు శ్రేయము కన్పడదు, ఈసభలలో తీర్పుతీర్పువారెవరు? ఎట్లుసాగును? "లోకోభిన్నరుచిః, తథాపి స్వస్వపక్షాభిమానోబలవాన్ బాధతే, వారు "ఛాలెంజి,, ప్రచురించినందుకు, శివరామశాస్త్రి మరల ప్రచురించెను. ఇంతట నాఁగిన బాగుండునని నేను తలంతును నాప్రార్థన మిదియే.,... ,ఏవిధముననైనను తగవుమాపుకొనుట బాగు, నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాల్పకయున్నాను, ఇబాబు వెంటనే వ్రాయించవలెను...."

వే॥ ప్రభాకరుఁడు.

సూచిన యంతవట్టు మిగ మోడక చెప్పె వృథాభిమానపుం
దాపము నాఁడు మామదికిఁ దద్వచనమ్ముల నెక్కె నీ దహో. ౧౦౫

ఉ॥ ఎంతటి ధైర్యముఁ మఱియు నెంతటిశక్తియు లేక యున్న ని
శ్చింతగ నాఁటి సత్సభ "ననేమిర వారల శాసనంబు మా
చెంత ఘటింపఁ గూడ,, దని చెప్పఁగ నేర్పునెరివేయి సీమ య
న్నంతన భీతి పుట్టవలదా? కలదా? యిటువంటిచేవయున్. ౧౦౬

చ॥ ప్రముఖుల కెంతటుంది పని పట్టితి మక్కటా? వారిముందు మా
అ మయితి మింత కెంతటిపరాభవ? మూరక కొప్పరంపువా
రి మోరవ మిక్కుటమ్ముగఁ బోరిం బోరిఁ దగ్గఁగఁ జూచ్చె నేయుపా
యమున నొ వీరిపైఁ బదునపాయముఁ బాయఁగఁ జేయఁగా వలెన్ ౧౦౭

మ॥ * అని యోజించుచు నుండె నంత సుకనాఁ డాయీప్రసంగంబు నె
ల్లను విన్పింప సభం బొనర్చి తగు హేలన్ విన్కి సేయంగ వ
చ్చినవా రెల్లరుఁ బత్రికల్ వినుచు మంచిన్ జెడ్డ యోజించుచుం
డు నెడన్ గొందఱు వచ్చి రయ్యెడకు నెట్లో యానద స్వాఁగఁగన్ ౧౦౮

* నిష్పక్షపాత హృదయులును యథార్థపరిజ్ఞాతలును గుంటూరుపుర వాస్తవ్యులు నగు నార్య సోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞా పూర్వకముగా 27 వ తేదీ ఆదివారమునాఁడు సభకు రావలయునని ముందుగా మాపైఁ గాలుద్రవ్వ పత్రిక వ్రాసి, యందులోని యసందర్భములను దెల్పుచు మే మొత్తగమీయఁగా వానికిఁ దగు సమాధానము వ్రాయక యేవో కొన్ని యుక్తులతోఁ గొన్ని యుత్తరములు వ్రాయుచు సభ ఆదివారము దప్పించి సోమవారమునకు మార్చగ తుద కాదివారమునాఁటిరాత్రి యనేక గ్రామములనుండి విచ్చేసిన మహాజనుల విఫలమనోరథులం జేయుట యుచితము కాదని మే మాదివారమునాఁడు వ్రాసిన యుత్తరములోఁ గొన్ని పండితసమ్మతములైన నిబంధనము లుదాహరించి "యీ ప్రకారము మీరు సభకూర్పుఁడు లేదా మేము కూర్చెదము అంగీకారానంగీకారములు రేపుదయమునకు దెల్పుఁడు లేదా మీరీయుద్యమము మానుకొన్నట్లే ప్రజలు దలంతురుగాక" అని స్పష్టీకరించినను దానికి జవాబు వ్రాయక సభానిశ్చయదినమునందుఁగూడ నుదయము 8 గం॥కు మరల రిమైండరు పంపినను దాని

ఉ॥ పనిగొనియుత్తరాల్ వినుచుపట్టున నాసభ నాఁగుపూనిక్రొ వ
చ్చిన యల శ్రీనివాసగుణశేఖరువైఖరి "కొప్పరంపున
త్తనయులయుత్తరమ్ములవి ప్రాజ్ఞసభానుకూలదుర్వాచః
ఖన్యులని తొల్లవారలకుఁ గన్నను జెప్పక చెప్పె నొప్పగన్. ౧౧౦

---

వినిపించి అనాఁడే 12గంటలు మొదలు మూఁడు గంటలవఱకును గోర్టులోఁ గంసాలు
లనుగూర్చిన వ్యాజ్యములో సాక్ష్యమిచ్చి యుండుటవలని యాయాసము చేఁగా బో
లును పదపడియుత్తరములను దిరుపతిశాస్త్రిగారిని వినిపింపుమనిరి. తిరుపతిశాస్త్రి
గారు వినిపించుచుండఁగాఁ గొందఱు పెద్దమనుష్యులువచ్చి యంతతో బ్రకృతసభ
ముగించుటకై వెంకటశాస్త్రిగారిని గోరిరి గాని తగినంత హేతువును జూపి కోర
నందున వెంకటశాస్త్రిగారందుల కంగీకరింపరైరి. పిదప గంభీరముగాఁ దిరుపతి
శాస్త్రులుగా రాయాయియుత్తరప్రత్యుత్తరముల నుపన్యసించుచుండఁగా వేంకట
శాస్త్రులుగారు దానినాఁపనుంకించువారితో సహేతుకముగా మెల్లఁగానుపన్యసిం
చుచుండిరి పదపడి సభనాఁపుడని కోరినవారు తామేదో మధ్యచెప్పుటకు న
వకాశమిండని కోరిరి అందులకును దుట్టతుదకుఁగాని వీలులేదనియు నప్పుడేని య
గ్రాసనాధిపతుల నడుగఁదగియుండుననియు వెం॥ శా॥ గారు బదులు చెప్పిరి. ప
దపడి యుత్తరములనెల్ల దిరుపతిశాస్త్రిగారు వినిపించిన పిదప నెవరుసమర్థులో, యె
వరు కారో, యెవరియుత్తరములు దురుసుగానున్నవో యెవగిపట్టివికావో? యెవరు
కోరినషరతులు పండితసమ్మతములో యెవరివికావో, యెవరి వెనుకతీఁతవలన సభ
కాలేదో, లోనగు నంశములు సభ్యులకే కాక సభనాఁపవచ్చిన యుత్తమపురుషుల
హృదయములకుఁగూడ స్పష్టపడినవి. ఆ యాయంశములనే శ్రీ అగ్రాసనాధిపతి
గారు తుట్టతుదనుపన్యసించుచు "మీసముల పద్యము నొకట్రొయర్థమునుగూర్చి", తా
ముగూడ నిదివఱకుఁ బొరపాటుగా నే యన్వయించుకొంటిమనియు నిప్పుడది స్పష్ట
ముగాఁ దెలిసినదనియు నుభయభాషలు రానివారు దానిజోలికిఁ బోఁగూడదనియు
సంస్కృతము రాని తెలుఁగు గణనీయము కాదనియు నుపన్యసించుచుండఁగా సభనాఁ
గుపూనికతో విచ్చేసినవారు ప్రకృతమావిషయము నాఁగవలసినదనికోరిరి. దానిమీఁ
దనగ్రాసనాధిపతిగారు "వీరికోరిక ననుసరించి యాపద్యార్థమునిప్పుడు విస్తరింపక
వదలితి" మని చెప్పి యావిషయము మానితమకీయుభయకవులయందును భగవంతుఁడు
న్యాయముగాఁ దోఁపించిన యభిప్రాయమును వెల్లడించిరి. అదివిని సభ్యులెల్ల హా




ఉ॥ ఏమిటి కాఁగఁగా వలెను? యెల్ల రెఱింగినయట్టి
శ్రీమహితుల్ మహామహులు చేరిన సత్సభ విన్కి సేయుచో
నామహితుండు ప్రాజ్ఞుఁ డగునట్టిఁడు గావున వారితప్పుకుం
బూమెలు కంపు గొట్టు నని బుద్ధి గలంగినవాఁడుగానిచో. ౧౧౧

క॥ ఉత్తరముల తత్తఱములు, సత్తములను నేహ్యమైన చందము గలవం
చుత్తముఁడు శ్రీనివాసుఁడె, విత్తములకు సాక్షి యని వివేకు లెఱుఁగుదర్.

క॥ *కుచమర్దనాదిపదముల. రచనం బచరించుకొప్పరపువారి వచో
నిచయము గలపత్రికలకు, నచటం గలసభ్యు లేవమందిరి పెలుచర్, ౧౧౩

క॥ ఆమెయి సాష్టాదశ్వ, స్థామర్ బుగణించుతేజు దశదిశలలమం
గా మాశిష్యుం డలశిన, రామయ చనుదెంచె సభ కరం బలరారర్ ౧౧౪

ఉ॥ శ్రీవచ్చి సభాంతమందుఁ దనవచ్చిన హేతువు, తాను విన్నయా
యచ్చెగువుర్, సభాధిపతి యాజ్ఞను బొంది సభాసదుల్ " బళే?

నందించిరి. పిదప శ్రీ వెంకటశాస్త్రులవారు కవితయన నేమో, కవియన నెవరో, ఆశుకవితయన నేమో, కవికివలసిన సామగ్రి యేమో, తేటతెల్లముగా నుపన్యసించిరి; పదపడి సభనాఁగు పూనికతో నిచ్చేసియున్న వారిలో నొకరగు మ॥ రా॥ రా॥ గోవిందరాజుల శ్రీనివాసరావుపంతులు బి, యే, బి, యల్. గారు సర్వసమ్మతము గు తమ మనోరథమును వెల్లడించిరి. వారిపూనికకు వెంకటశాస్త్రిగారు తమ సమ్మతిని దెల్పిరి.

*(3) "ఇంతనైన మీనవ్వకుచమర్దనములు మానుకొని"...

30-8-11 ఇట్లు,

కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ-శతావధాని.

ఉదయము—9_గంటలు.

§ పదపడి యంతలోక యరగంటకును న్నె రైలుదిగినభావమునకువచ్చి యున్నట్టియు, తిరుపతివెంకటేశ్వరుల శిష్యుఁడైనట్టియు, చిరివాడ గ్రామకాపురస్థులు శ్రీ వేలూరి శివరామశాస్త్రులవారికిఁ దివపద్యములఁ జదివిరి.

ఆ॥ వె॥ రాజశ్రీ భుజంగరావు. చెల్లపిరావుఁ గూర్చి యిటులువ్రాసె గుంటు

వచ్చినశిష్యుఁ డీతఁడె" యనన్ విని నింపగు కంఠమాధురిన్
హెచ్చగు గానపుం బటిమ యేర్పడఁగాఁ జదివెన్ గ్రమమ్ముగన్. ౧౧౫

కII పదపడి సభ్యులు సారెకు నెద శివరామకవి వాణి కెంతయు మెచ్చన్
వాదలఁగఁ గరతాళంపుని, నదములఁ జెలఁరేఁగఁ గ్రన్నన సభ ముగిసెన్.

కII ఆమఱునాఁ డుదయమ్మున శివ, రామయు కోపించుచుఁ గవిని "రారమ్ము సభా
సీమ" కని యుత్తరంబు, వ్రామత లిఖియించె" ననుచుఁ దద్దయు నెమ్మిన్.

ఉII వెంకటశాస్త్రి వల్కె "సిది విన్న బుధుల్ మము సర్వ సన్నుతిన్
శంకగ నిన్న నవ్వగురు శాస్త్రము నేర్చియు సాహితి న్నిరా
తంకతఁ జెప్పియున్ శతవధానిని యై యసమానకక్షగాఁ
జంకెలు వైచదే? "సభకు రం" డని కోపపువారిఁ బిల్చుచున్. ౧౧౮

II † అసమానకక్ష యని మము, రస దూషించువారియు లోనను లిఖిగో నీ
రస మీకయ్యము మాకున్, బొసఁగెం దన యంతఁ బూర్వపుంగర్వమునన్.

---

రిపురి, జరుగుచున్న వైరచర్యయందున (దిర్పతికవి. వెంకటకవి, తెలుపుత వ్వ॥1॥
చII అనవిని యంత నామడలు నామడలుం బడిపోయినట్లు వచ్చిన నది మిన్నయుడుంచుఁ
దెలిసెన్ గవితానదిలేక పోయెఁగా, కనుపుగ భాగ్యబలము వందున నాకు నిత్యమం
దునన్. దనివిగఁ గోపపుంగవుల దారులు చూచుచు చిత్రగ నే ॥2॥ తే॥ గీ॥ నా
నాథబుధేంద్రుఁడు ఘనుఁడు శ్రీని, వాసమూర్తియు నెందఱో వెలయు లైన, కప్పుబుడి
కనిమినమ్ము కాచిపట్టి, పెకనున్నారె కోపించు బిదపకవులు ॥3॥ తే॥గీ॥ కలరు
నేత్రావధానంపు గరిమనొకఁడు. కలరు గర్భావధానంపు గరిమనొకఁడు, కలరు
హస్తావధానంపు గరిమనొకఁడు, వీని పోలఁగ నిఁక నెందేనిఁ గలరె॥4॥ ..."

1. †... యిదివరలో వున్నదే అసమానకక్ష అని అనుకుంటారా ఫుర్సత్ సంగతిలో పులిమీద పుట్రలాగున్న యిదివకటి వచ్చినది దీనిని గు॥ కొన్ని రోజులు వ్యర్థ పుచ్చడమున్నూ శ్రమతీసుకోవడమున్నూ నాకు సుతరాం యిష్టం లేదు...."

తా 22-8-11 రా॥ వెంకటసూర్యరావు.

Masulipatam.

2. బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి శాస్త్రులవారిసన్నిధికి, మీరుకృపారా

చ॥ జ్వరితుఁడ నయ్యు సజ్జనులు సారెకు రమ్మని పిల్వఁగ రానిచో
గరువముగాఁ దలంతు రని కష్టి గణింపక వచ్చినాఁడ ని
ష్ఠురపు నియోగివైదికులపార్టి సుమంతయు నేనెఱుంగ దు
ర్భర మనమానకక్ష యిటు రాఁ దగి యుండఁగ నెట్లెఱింగెదన్.

ఉ॥ ఐనను గాలుద్రవ్వదొనఁ గాదెన నుండుటఁ జేసి యంత మా
పై నెపముండ దీ విపుడు పత్రిక నంపెద వేనిఁ బోరికిం
దానయి పిల్చినట్లయి "తక్కెడ" సామెతగాఁ దనర్చు నీ
మానఁగ దయ్యె నిట్టి యసమానపుఁ గక్షకు దీక్ష యేటికిన్.

ఉ॥ ఎప్పటికేని మాయెదుటనే పడఁగా వలె వార, లప్పు డా
తప్పుమకైత పద్ధతులు తజ్ఞులకున్ విశదంబు గాన లెన్
బిప్పి ప్రసంగముల్ నలువు పెద్దలతోడుత నీకు నేలనే నేఁ
జెప్పిన మాట చొప్పనకుఁ జేతము చొన్పుచు మిన్నకుండుమీ.

చ॥ వెనుఁబడి కాకవుల్ తనదు వీపు జయించి జరణమ్ము లుంచి తా
చిన నది లెక్కగాఁ గొనక చివ్వకుఁ బూనక వైవతేయుఁడే
మనక శరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె? శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చిన లతాందుడుకున్ గణియింప రంతగన్.

---

వుగారి పేరున వ్రాసిన జాబు చేరినది, మా యుభయుల నమస్కారములను అంగీకరింపవేడుచున్నాను, యథార్థవాది యొక్క వ్యాసము యథార్థముగనున్నను లేకున్నను దాని సత్యాసత్యములు మేము గ్రహింపజాలము .........మీరీ లేనిపోని కలహములలో జిక్కుకొని ఆరోగ్యమును, బుద్ధిని చెడగొట్టుకొనుట మా యభిప్రాయము కాదు. వారిని గెల్చినను మీ కీర్తి హెచ్చునా? ఇదివఱకే మీ ఖ్యాతి జగద్విఖ్యాతమైనపుడు మీకీ పోరాటము లెందుకు? ; వారు కుర్చీమీద గూరుచుండిన మన కేమి? ఇంటి కప్పుమీద గూరుచుండిన మన కేమి? మీ బలాబలములు లోకము పూర్తిగ నెరిగియే యున్నది.' ఈ పోరాటములను గుంటూరు పౌరులో' దొక్క వెంటనే బయలుదేరి రావలయునని మా ప్రార్థన..."

ఆ॥ నారాయణరావు.

ఉ॥ ఇంతకు నీవు పత్రికల నెన్నిటి నంపిన నేమి లాభ? మా
వింతకవీశు లెన్నఁటికి విజ్ఞులు తీర్పరు లున్నసత్సభా
భ్యంతరమందు ని న్నెదురువా రనఁ గోకుము వారితండనాల్
గాంతు రెవారు వారికడ గంతులు వేయుచునుం డ్రెలుంగుమీ, ౧౭౪

శా॥ "ఓ కెన్నో మఱివంక" లన్నఁ దెలియన్ యోజింపఁగా లేనిస
ద్ధీకుల్ వారికిఁ దోడు, వారిదియుఁ దాదృగ్ధీవిశేషంబె యీ
యేకాకారులు సత్సభార్హులికిఁ దా రేమంచు నేనెంతు? నీ
వీకార్యమ్మనకుం గడంగకుము మేమే యుంటి మన్నింటికిన్. ౧౭౫

చ॥ అనుటయు నాతఁ డప్పటికి నన్నము చెప్పక మిన్నకుండె నె
మ్మనమున బాల్యచాపలము మానని చందము తోఁచుచుండె, నా
తని కొకకొంత తిర్పతి స్వతంత్రత నిచ్చె ననంతరంబు వెం
కనఁ గికురించి యిర్వురును గ్రక్కున నేగిరి "ప్రస్సు" ప్రక్కకున్. ౧౭౬

ఉ॥ * పద్దెము లచ్చు వేసి యవి పంపి నభోమణి రెండుయామముల్
ప్రొద్దును దాఁటునప్పటికిఁ బూర్తి యొనర్చిన మేటికార్యమున్
దద్దయు మెచ్చుకొంచు బసదగ్గఱకున్ జనుదెంచి చెప్పి రిం
కెద్దియుఁ జేయ రామి సహియించెను వెంకన కొంతసొప్పులో. ౧౭౭

మ॥ రా॥ రా॥ శ్రీ కొప్పరపు వెంకట సుబ్బరాయశర్మగారికి.

* చ॥ తిరుపతి వేంకటేశులకుఁ దెంపరినై సరివైఖరిం గవీశ్వరుఁడగువాఁడు నొటనుడువన్ గడు సిగ్గిలునాశుధారకున్, బురికొలుపం దలంచితె 'నమోనమ' యంచు వచింపకేటి య, ల్లరియిది సింగ పొద్గుపలలంబు భుజింపక పూరిమేయునే. మ॥ అనిమిత్తంబుగఁ గాలుద్రవ్వెద త్వదీయాహంత నాఁపుందలం, పున నీనీగసనిర్గుణాశుకవనంబున్ జెప్పి నిగ్గెల్వనెం, చిన యస్మద్గురువర్యులన్ సుకవితాశ్రీధుర్యులన్ మానిపిం, చి నినున్ గెల్వఁగ వచ్చినా నిదె సభం జేయించుమో వత్తునో. ఉ॥ గంటలు గట్టికొంటివట "గంటకువందలు వేలుపద్యముల్, గెంటుదునంచు' నేఁడు పరికించెద గెంటుటయెట్టిదో? నినుం, గెంటెద నే వధానమున గెల్చెద నీరసధారయందు నీ, ఘంటికలూడఁ గొట్టెదను గాచుకొనం గమకింపుమిత్తఱిన్. సీ॥ గురుపాదసేవఁ జేకూరిన వ్యాకృతిపాండిత్యగరిమ యటుండనిచ్చి, ఉభయభాషాకావ్య విభవాభిరామమౌ పాండిత్యగరిమ యటుండని

శా॥ * రామస్వామి యనంతరమ్ము కదుధీరత్వమ్ము చెన్నార నే
మేమో పద్దెము లల్లి తెచ్చి యవి మమ్మాక్షేపింపుఁ డన్నన్ క్షణం
బేమిం జెప్పక పిమ్మటం జదివి" మేని యీపద్దెముల్ వారిదౌ
సామర్థ్యమ్ముఁ గదుఁగ యథార్థముగ నిచ్చల్ వచ్చి వాక్రుచ్చెడిన్ ౧౨౮

---

చ్చి, రసవత్ప్రబంధనిర్మాణధీచాతురీపాండిత్యగరిమయటుండనిచ్చి, సురుచిరలక్షణభరితాశుకవికృత్యపాండిత్యగరిమ యటుండనిచ్చి॥ గీ॥ ఆశుతరసంబటుంచుఁ గొండాడఁదగిన, తావకాశుకవిత్వంపుఁ జేవగూడఁ, దావకశతావధానవిధంబుఁ గూడఁ, జూడఁదలఁచితి వేంకటసుబ్బారాయ! చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీవర శిష్యుఁడ నాదు పేరు వేలూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాఢ్యమైన వ్యాకరణము జీవనమ్ము నధికారము కావ్యపురాణనాటకాకరములఁ; జేయుఁజాలుదు నఖండము నాఁగ శతావధానమున్॥

గుంటూరు
31-8-11

ఇట్లు వినీతవశంవదుఁడు,
వేలూరి శివరామశాస్త్రి,
శతావధాని.

*మహారాజశ్రీ కొప్పరపు సుబ్బరాయశర్మగారికి—సీ॥ అఱవదేశంబున నవధానమొనరించు, టో కాదని యిదియు గుంటూరుసీమ, పల్నాటిసీమలోఁ బద్యంబులను జెప్ప, టో కాద! యిదియు గుంటూరుసీమ. ఆయూర నాయూర నాశుకవిత నెప్ప - టో కాద! యిదియు గుంటూరుసీమ, గుడివాడసీమలోఁ గొన్నియూళ్ల నుజెప్ప - టో కాద! యిదియు గుంటూరుసీమ, గీ॥ యెల్లుదకిర్రుంచు కొందరో యిపుడుమీరు, నిందుకొల్పున పొకునన్ దండిబిరుదు, లూరకేపోదు పూజ్యులఁ గాఉలఅవ, నాశుకవిసింహ కుండిన హంసలార. ఉ॥ బట్టులరీతిఁ బద్యములఁ బల్క్రుటె కాని శతావధానమె, వ్వట్టుల నేదిచేసితిరి. పండితులెల్లరు మెచ్చినారలో, గుట్టుగఁ బోవకీగతిని, గొంటెతనంబును జేయఁజూతురే, "పెట్టలు క్రొవ్విపంజులయి, బీరముఁ జూపిన" లాగుఁదోఁచదో. గీ॥ జగతి వైదికులొట మీసాలఁదీసి, కొన్న నెవ్వరునవ్వరు; నిన్ను నవ్వ, కుందురే కన్నవారు నియోగివయ్యుఁ, మీసములఁగాచుకోలేక మిడుకుచుండ. క॥ గంటలఁ గట్టెదరే! ము, క్కంటిచురగములకు హలికవితానంబీ, గంటలు మఱియే కార్యము, పొంటె వచింపుండు కొ

ఉ॥ వారలకన్నఁ దెల్గునెడ వారక సంస్కృతమందుఁగూడ నీ
వారయఁ బెద్దపండితుఁడ వైనను వారలు బ్రాహ్మణుల్ మహా
శూరులు మేల్నియోగులును "శూద్రుఁడ వీ" వని యీసడింతు ర
వేరమునందుఁ గాలిడక వేగమ యేగుమ యంగలూరికిన్.

తే॥ గీ॥ వారితప్పదుఘారను వడిగఁ బోయి,సభ్యులగరంప నీకు నసాధ్య మెవ్వ
దేని పనిపడ్డచో మేమె యేగ వలయుఁ, బిదపనిదితప్పటంచు నొప్పింపవలయు.

చ॥ అనుటయుఁ బిన్ననవ్వ నగి యాతఁడు "చిత్త" మటంచు నేగి యే
మని మది నెంచెనో? తుదకు నాతనిపద్దెము లచ్చులోనికిన్
జనుటయ కాక, కొప్పరపుసన్నిధికిం జనె వీని నెల్ల మే
మనిపిన వే యటంచును యథార్థ మెఱుంగనివారు దూఱఁగన్,

ఉ॥ ఇన్నయథార్థ మియ్యది మహాత్మము లొప్పదు రంచు మేము సం
పన్నగృహస్థులం దనుప వ్రాసితి మింకొకకుట్రశిష్యుఁడున్

---

ప్రపుంగవులారా. సీ॥ శతఘంటకవనంబుసల్పెదు మన్న మీ- శక్తియడంపనేఁ జాలనొక్కొ, అష్టావధానంబు నాచరింతుమనమీ - శక్తియడంపనేఁ జాలనొక్కొ, ఆశుకవిత్వంబు నాచరింతుమనమీ - శక్తియడంపనేఁ జాలనొక్కొ, సద్గ్రంథరచనంబు జరపుదుమన్నమీ - శక్తియడంపనేఁ జాలనొక్కొ, గీ॥ ఇంగిలీషున వత్తురో యెఱిఁగియడఁపఁ - గరము నేఁజాలనొక్కొ నూగురువులేల, రండు వేగమీబిరుదులు దెండు పెట్టి - పొండు నిండుసభను గొప్పపుఁగవులార. గీ॥ ఓడినారని తలపోయువాఁడమీరు - నాకుఁ బ్రత్యుత్తరంబును నీకమాన, ముద్రవహింయింతు రేని నీమచ్చటెఱిఁగి - ముందుపనిఁ జూతుఁడీ కొప్రపుఁగవులార. క॥ శివరామ కవికిఁబోలెన్ । జవాబునొసఁగకయె వ్యర్థగజంపునఁ బిపిసన్, వ్యవసాయముకలదు నుఁడీ । వ్యవధింగయికొనక యుండు ప్రత్యుత్తరమున్,

అంగలూరు,
3-9-1913.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,
త్రిపురనేని రామస్వామి.

గ్రన్ననఁ *గొన్ని పద్దెములు గానుక కొప్పరపువారి కంపె నా
చిన్నతఁ డొక్క సాహసము చేసె వచింతుము తత్స్వరూపముల్. ౧౩౨

ఉ॥ బందరునుండి పద్దెములు వారికిఁ బోస్టును బంపి మీఁద మా
కందఁగఁ జేసె దానిప్రతి; యక్కట? యాఁగుట యెట్టు? లిటులే

బందరు.

మద్గురవే నమః.

(ఇయ్యది కొప్పరపువారికి వ్రాసినయుత్తరమునకు సరియైన నకలు.)

*1. చ॥ ఉరుకరుణాయుతుండు, సమయోచిత ధీమహితుండు, భక్తులం, దఱికిని గల్పకద్రుమవిధంబుననుండెడువాఁడు నట్టియా, తిరుపతివెంకటేశ్వరుఁడు తిన్నని చూపుల మిమ్ముఁ జూచి యె, ల్లరును ముదంబు నొందునటులన్ దయ, మీకు జయమ్ము గూర్చుతన్. 2. చ॥ ఉరుతరధీవిశేష మహిమోన్నతులార! గుణాఢ్యులార! కొ, ప్పరపుకవీంద్రులార! వినవచ్చెను మీదుప్రతిజ్ఞ; యెంతో నం, బరము వహించి నాఁడను, రమాపతి మీకు జయంబు నిచ్చు, నా, తిరుపతివేంకటేశుల నెదిర్చి గ్రహింపుఁడు వారిమీసముల్. చ॥ ధనము గడించి యుంటి రవధానములం బొనరించి మీరలిం, దనుక శతావధాను లనునామముతో; నిఁకమీఁద నట్లు కా, దనుచు శతావధానములనక్కడనక్కడఁ జేసిపండితుల్, వినుతియొనర్ప మీసములఁ బీఁకుఁడునూతననామధారులై. 4. గీ॥ తెలుఁగు తిర్పతివెంకటేశులకుఁ గూడ, వచ్చుఁ గావున నోడింప భారమగును, గాని వారికి నేత్రావధానమందుఁ, బ్రజ్ఞలే దండు మీరు గెల్వంగలారు. 5. క॥ నేత్రావధానమది న; క్షత్రజయంబిచ్చు మీకు, వదలక దానిన్, మాత్రము వెట్టిన నప్పుడు, శత్రులనోడింప మీ కసాధ్యంబగునే. 6. చ॥ వినుతగుణాఢ్యులార! యొకవిన్నపముల్ వినుఁడయ్య "గ్రుడ్డు పి, ల్లను గని వెక్కిరించి నటులన్" గనుపట్టెను వీరియత్న" మం,చు నిట జనుల్ వచించి రది నుంతయు నామది నమ్మఁబోవనే, మనిన నియోగినాటఁ దగవారి యది నమ్మిమిముందర్జించుటల్. 7. మ॥ "సభమీరెప్పటిఁ జేయువార" లని ప్రశ్నల్ వేసిరవ్వారు, మీరుభయుల్ మాపురికేగుదెంచియిట సభ్యుల్ మిమ్ముఁ గీర్తింపఁగా, సభ సేయింపుఁడు, తోఁచినంత సహాయమ్ముల్ జేతు నా. కభిమానంబది మీయెడంగలదు రం డామోదముం బొందుచున్. 8. ఉ॥ "ఆరయ నీవు చేసెడిసహాయ మదెట్టిది? పిల్లవాఁడ" వం, చూరక నెంచఁబోకుఁడు మహోదధివారినిబంధనంబు చేఁ, కూడఁగ

కొందఱు *సూర్యులు శిష్యు లౌకకొన్నిటి నంపిరి, మే మెఱింగిన
ట్లందఱు గాక యున్న జను లందరు గొందఱు మాన్ప నేర్తుమే ౧౩౩

చ॥ "తిరుపతివెంకటేశులకుఁ దీవ్రముగా సభ కేగుదెం డటం
చలిమిటి వ్రాసి కొప్పరపుటాయన దా సభ కేగుదెంచెనే?
"వరవర" వ్రాసి రమ్మనినఁ, బోయిన మం చలసూర్యులుఁగుఱ్ఱ లెం
చిరి యని తోఁచుఁ జర్చఁ దగఁ జేసిన యోగ్యులకెల్ల నిప్పుడుల్. ౧౩౪

---

రాముఁడయ్యడవిఁ గోతులసాయముగోరలేదె? గను, శ్రీగహించ మీరు దయచేసి జయంబు వహించుఁడో బుధుల్. 9. క॥ తప్పక దయచేయుఁడు మీ. రిప్పరికి జవాబుదీని కిడుఁడు సరగునఁ జా। మెప్పుగనుఁ డయ్య వైశమా? కొప్పరపు కవీంద్రులార! గుణమణులారా!

ఇట్లు
సుకవిపాదరేణువు,
వడ్లమన్నాటి నరసింహశర్మ.
VIth Form C. Division,
Noble College,
Masulipatam.

శ్రీమత్పరదేవతాయై నమః.

11-9-11 బందరు.

*గురువర్యా! చ॥ మనమున భక్తి నిల్పి దను మాధవపాద సరోజ యుగ్మచింతనపరిలబ్ధదివ్యకవితా ఘనితా మహితప్రభావ సం। జనితలసద్యశః కుసుమ-జాలవినిర్మితహార ధారులై। తనరెడు వేంకటేశ్వరబుధాగ్రణి! మీ యుగపాద కంజముల్ ఉ॥ ఇందులనుంచు పద్యముల నేనెరచించియు నచ్చువేయఁగా, నంది యమోఁదుగల్గితమ సన్నిధి కంపితి వానిఁ జూచి నా,కుందయ వ్రాయవేఁడెదను గొంకక యెట్టులు సేయుదుందురో? యందులనుండు దోషములనన్నియు దిద్దుచు నంపవేఁడెదన్ మ॥ తమసందర్శనమెప్పుడబ్బునని చింతాక్రాంతచిత్తుండనై,కుముదంబుల్ శశిఁగోరుభంగిఁ దమవాక్పానామృతాస్వాదసం,భ్రమమేపారనెసంగువాఁడనిటఁధీ

క॥ ఎటు దోఁచిన సరియే పో, మిట లేశమైనంగ నెఱిఁగియే యెవ్వరి నాఁ
గుటకు యత్నించితిరో? వి, స్ఫుటముగ ఁగనుమన్న దానిఁ జూపితిమిక దా.

చ॥ చరితము గాన వ్రాయఁ దగుసంగతి వ్రాసితి మంతె కాని యే
పొఱుఁగరు మేము క్రొవ్వమున తిట్టులు శిష్యుల రేఁపి పంపుసం
బరమున కొప్పవారమె? స్వబాహుబలమ్మునఁ బోవువారమో?
యరులు నిజం బెఱింగియును నాడఁగఁ జొచ్చిరి వేఱురీతిగన్, ౧౩౬

చ॥ ఎఱిఁగిన దేకదా? జగతి యెల్లఁ గుశిష్యుల రామకృష్ణులన్
మతి యలయిర్వురందు నొక మానిసి కన్న బహుశ్రుతుఁడు కొ
ప్పరమున వారి కంపె నొకపత్రిక *“నేత్రవధానమందు వ
త్తురె„ యని రామకృష్ణు లటుదూఁకఁగఁ జేసి రనంగఁ జెల్లునే॥ ౧౩౭

---

రాగ్రేసర స్తుత్యని,త్యము లేఖార్థము చూచునాఁడఁగృపతో నంపంగఁ బ్రార్థించెదన్
చిత్తగించవలెను ఇట్లు తమశిష్యుఁడు
కోకా రాజారావు, హైస్కూలు, బందరు.

మ॥ రా॥ రా॥ శ్రీ. కొప్పరపు సుబ్బారాయశర్మగారికి...మ॥ ధరణీచక్రము గూలఁగా వలదె! సప్తాంభోధి భాస్వద్వసుం,ధరభారంబు వహించి మించున లమాతంగంబులున్ వీడి; కొప్పరపుంబండితమానులార? తమకున్ భాషాద్వయీ కావ్యసం,భరితుల్ తిర్పతివేంకటేశ్వరులతో వాదంబు శ్రేయంబొకో,,మ॥కరిశార్దూలమృగేంద్రసత్త్వములు గంగాభంగకల్లోలలీ, లవిజృంభించిపెనంగుచుండఁ గవిమార్జాలాదిసంపూజ్య లీ,రవధానంబు రచింపఁబూనితిరహా? హాస్యంబె యార్యోక్తియున్ “శివుఁడుం దాండవమాడనాడ వెపిశాచీభూతభేతాళముల్...ఉ॥ చెప్పిన మాట చెప్పకయె చెప్పఁగ నేర్తుఁగవిత్వధారగా, నొప్పిదమౌనిధంబున బుధోత్తములందఱు మెచ్చనీరమున్,దప్పిక ద్రావుభంగివచనంబున గెల్వఁగరందు నన్నహో?,కొప్పరపుంబీశ్వరులకుందగదే మెూ? నా ప్రతిజ్ఞయున్.......”

---

*విద్యాచర్చాపత్రిక.

“అయ్యా? తమకును బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరమహాకవులకును, ఒక మాసమునుండి జరుగుచున్న కవితా కలహంబును పత్రికాముఖంబున వింటిని

చ॥ వనిగొని రామకృష్ణులు "సెబాసురె బళిరె యని" కొప్పరంపువా
రౌనరుచుతప్పు లన్నిటిని నొవ్వులు గాఁ దలపోయుచేరెఱుం
గనిరె దలవారిబంధు వను కారణ మొక్కఁడె చూచి యట్లనన్
జనునె? యశక్తి దుర్జనత సర్వ విగర్హిత మెన్ని భంగులన్॥ ౧౩౮

క॥ ఇది యిట్టులుండె మమ్మున్ బదిబది, యాసీమ నున్న ప్రాజ్ఞులు పూజా
స్పదులుగ నవధానాదులఁ, బొదలించుచునుండి రరులు పురపురఁ బొక్కన్.

శా॥ ఆపైఁ గొప్పరపువారిపక్షమున వా రాలోచనల్ సేసి రిం
కీపై నెయ్యది కార్యమే మీపురమునందే వారికిన్ సారెకున్
బ్రాపై గౌరవ మిట్టు లౌనె? యిది యెప్పాటన్ సహింపంగ నౌఁ
గోపం బూనుటయే యనుగ్రహముగాఁ గూర్చుండి రవ్వారిటన్. ౧౩౯

సీ॥ చుట్టుపట్టులనుండి చూడ వచ్చెడివారిసంఖ్య వందలకన్నఁ జాల హెచ్చు
వచ్చి "మాయూరికి విచ్చేయుఁ" డను వారిసంఖ్య యేఁబదికన్నఁ జాల హెచ్చు
"రాఁజాల" మన్న "దిగదు రాక" యను వారిసంఖ్య యిర్వదికన్నఁ జాల హెచ్చు
ఏమాట వినిచిన నింపునై వినువారిసంఖ్య రూకె వేలకుఁ జాల హెచ్చు
తే॥ గీ॥ పద్ధతినిరోగకులం దేరొ పట్టుదలకుఁ, నేగకున్నను నెల్లవారేగి వారి
చుట్టునుం గూరుచుం డ్రిది చూచు టెట్లు, త్రిమతములు వారిపక్షమై తిరిగిపోయె

శా॥ * ద్వైతాద్వైత మొకండు దక్క నఖిలద్వైతంబు నద్వైతమున్
శైవంబున్ మఱి వైష్ణవంబు నొకటై ఛత్రంబుగా వారలన్

---

...సర్వసాధారణమైన యాశుకవితకేమి? తమకు నేత్రావధానంబున నెన్ని బి
రుదులున్నవో... వానిని మీకంటె నతిశయించి కాఁకరపర్తి విద్వత్సభలో ది 20
సెప్టెంబరు 1911సం॥ రం తేదీని తత్తదంశంబుల నెఱవేర్చియూడఁ బెఱుకుచున్నా
ను గనుక నీనోటీసు అందిన వెంటనే మీప్రజ్ఞా విశేషంబును గనుపఱుప నారో
జునకుఁ గాఁకరపఱ్ఱుమీరు రాఁగోరెదను "లేనిచో మీతో విద్యాచర్చలకు రాఁజా
లను" అని నాకొక జాబైనను వ్రాయఁగోరెదను....

ది 14—9—1911 సామవేదుల సూర్యనారాయణావధాని
నేత్రావధాని, అండప్తావధాని, మకాం కాఁకరపఱ్ఱు అగ్రహారం, తణుకుతాలూకా

*ద్వైతాద్వైతము.

☞ వరా:—అనఁగా నిది యొక నవీన మతము, దీనికే పద్ధతినిరూ

బూతులుంబంతులపోల్కిఁ జూచెదరు· రేపు మ్మాపు నవ్వారితోఁ
బ్రోవై యుండుఁ బురంబు వారివచనంబుల్ వేదముల్ వీరికిన్. ౧౪౨

చ॥ ఇతరులమాట కేమి? మది నించుక కోపము కల్గి యున్ననా
డుతుకముగూడ వారనినఁ గొండొకపర్వులు వాఱు వారివా
క్ప్రతతి వినం గుతూహల మపారము గల్గియుఁ బోను వారిపెం
కెతనము నాకు నచ్చమిదె కేవలమింతకు మూల మెన్నఁగన్. ౧౪౩

ఉ॥ "పెంకెలు గారు సాధువులు పేర్మికి నిక్కలు గర్వదూరు" లం
చంకిలి లేక చెప్పికొనునట్టియనుం గల రల్లవారి; ని
శ్శంకగ వారు వారి కటు చల్లఁగఁ దోఁచుటయు న్నిజంబె యే
పంకెమె యన్మదాదులకు వారు రుచింపరు వేయునేటికిన్. ౧౪౪

ఉ॥ పాండితి లేని యీమనము పాండితివట్టున వారి గెల్వ లే
మొండొక త్రోవఁ జూడవలె "హుమ్మను" వారిది మావఁగా వలెన్
గండతనం బడంచుటకుఁగాఁ గబురంపితిఁగాని బెల్లపుం
గొండకవిందుఁ డేమిటికిఁ గొంకెనొ? "రా" నని యుత్తరం బిడెన్, ౧౪౫

తే॥ గీ॥ తీరి కూర్చుండి పెట్టి రీవైర మనుచు, నతఁడుకొండొకనిరసించినట్లువినికి
యితరులకు నట్లైతోఁచుఁగాకిదియునట్టి, దెట్టులగు? నానసమునీయ రేమిమనకు.

ఉ॥ పండితపామరుల్ గలిసి వారలకే హితు లైరి వారలన్
గండడఁగించు టెట్లు? మనకక్ష జయించుట యెట్లు? తోఁచ దా
కొండు నుపాయ మంచుఁ దనగాదిలివద్దతివారితోడఁ గొ
ల్వుండి విచారణల్ సలుప నొండొకనేర్పరి వచ్చె నీగతిన్. ౧౪౬

---

గమనియుం బేరు, ఇది నదుద్దేశమాతోడనే శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితు
లవారు పుట్టించిరి, వైదికు లసురులనియుఁ దాము దేవతలమనియు; వారిసిద్ధాంత
ము, ఆయీయంశము, ద్వైతాద్వైత పదమే తెల్పెడిని, సుప్రసిద్ధాద్వైతము వీరికి
నసురాద్వైతము, విస్తరము వారివిశ్వపత్యసురవిజయము లోనగు గ్రంథము
లవలన నెఱుఁగఁదగు. వ్రికృతకలహామునకుఁ గారకు లేతన్మతావలంబులలో
స్వల్పసంఖ్యాకు లని చదువరు లరయుదురుగాక.

చ॥ అవమానం బది యెంత గావలయునో యాసర్వ మవ్వారికిం
జవిఁ జూపెన్ మనకొప్పరంపుఁగవి "మీసాల్మ్రాట సామాన్యమే?
యెవ రెచ్చో నలవారి నిట్లనఁ గలారే? యంతియే చాలు న
న్యవిచారం బిఁక నేలని? నా కొకయుపాయం బిందుఁ గన్పట్టెడిన్. ౧౪౭

మ॥ అవివేకంబో వివేకమో జరిగె నేలా "సంధి మిచ్ఛంతి సా
ధవ,, యన్ వాక్యముఁ బట్టి పోవుదము విద్వత్తాకవిత్వాభిజా
త్య విశేషమ్ములఁ జేసి యిందులకు వా రంగీకృతిం జూప గం
చు విచారింపకుఁ డట్లు కావుటకె యూచో పూర్వాహ్వా మెబ్భంగులన్. ౧౪౮

క॥ కొలుకంగ రానికొయ్యలు, తిరుపతివెంకటకవు లని తెల్లము సేయన్
బరికించితి నదుపాయము, గర మాలోచించి దీని గ్రహియింపుఁ డనన్. ౧౪౯

తే॥ గీ॥ వృద్ధుఁడిట్లను "బాగు నీవెఱవు; దీనఁ, గలదు కష్ట మొకండు లోకమునఁ
గొప్ప,రంపువారలసారులు గ్రామ్యకవులు, వారనేతాదృశు లటంచుఁ బేరుగలదు

తే॥ గీ॥ అట్టిచో సంధియనుటకు నర్థమేమి, యగునుగొ పరికింపుఁ డనియసమర్థతకును
నపరపర్యాయమగు 'ననత'ఁడువలెగ్రా,'నగునుమీరన్న నుడియు నేనరసినాఁడ.

గీ॥ కానియిపుడింతకన్నఁ జక్కగ్రానియుపాయ, మొండుగన రాదుసభ సేయకుండ వారి
నిశ్వరమునుండి పంపుటకింక నొక్కగ్రా,సాధనం బేది? యానతి నవ్వుఁడనుడు

తే॥ గీ॥ కొంత యోజించి యావృద్ధుకొసకుసమ్మ,తించి రాజీకిఁదగునట్టి మంచిమాట
లెల్ల వ్రాయించి వ్రాళ్లు చేయించుటకును, పెద్దలగు వారిచొద్దికఁ బించుటయును.

ఆ॥ వె॥ ఈసడించువార "లిహిహీ" యనెడువారు, పెదవి విఱుచువారు "మొదలలేని
శాంతి యిప్పుడేల చాల్చాలుఁ బొందు పోం" డనెడువారునైన మనసునిదెగి

క॥ చనికడచినవృత్తాంత, మ్మును వృద్ధునితోడఁ జెప్ప నాగ మించుకనై
వనటం బడి తెప్పిలితి యే. మిసి వోఁ దగ యుండె నపరిమితరోజనతో.

తే॥ గీ॥ "నే నిడుదఁ గంటిలో వ్రేలు నీవునాడు, నోట వేలిడు" మన్నట్టు "లేటికట్టి
సంధి" యని యెల్లరాదునాచందమేను, మొదటఁ దెలిసియుఁ బంపితిమోసపోతి.

క॥ అని కొంతసేపు తనచే, సిన యపలౌకికపుఁ బనికిఁ జేతమ్ముననై
కిర్తన సిగ్గుకల్మిఁ జింతం, గొనుచు నుపాయాంతరములకుం గడఁగునెడన్.

చ॥ మఱియొకఁ డిట్లుపలుకు "మఱుమాట వచింపకుఁ డింతకన్న నెం
డరయఁగ రాదుపాయ మొకఁడైదుగురేనియుఁ జాలు బ్రోళ్లకం
దఱు నొనరించినంత విలువై చెలువారెడు నంతవాగగా
దొరక వలెన్ సరాసరిగఁ దూఁగెడువారుగ నుండఁగా వలెన్. ౧౪౮

తే॥ గీ॥ శాఖ కొకొక్క కర్తయుండు గాఁ జక్క చేసి, యేర్పాళ్లు చేయించితిమేనిఁ జాలు
సంధి కన్నప్పుడేమని సమ్మతింప, రరయరే? "సంధిమిచ్ఛంతి" యన్న నుడువు.

సీ॥ ద్వైతులకెల్ల నాశనిచేతఁ జేయింత మద్వైతులకు నెల్ల నతనిచేత
నతనిచేఁ జేయింత మలవిశిష్టాద్వైతశాఖకెల్ల నతండు చాలువాఁడు
ఇంక ద్వైతాద్వైత మింకఁ జేసెడివార లెందఱేనియుఁ గల రెందు నేల
ఋగ్యజుశ్శాఖ ముఖులకెల్ల నయ్యనఘుచేఁ జేయింత మతఁడె చాలు

గీ॥ తప్పవరిదేనియగుఁగాక తగు మనుష్యు, లిరువురకుసంధిగూర్చుచో నేమిదోసఁగు
పైకినటియింతమిట్లు చేర్వాళ్ళదొరకు, వఱకుఁ బిమ్మటమన యిచ్చనుఱుక వచ్చు,

ఆ॥ వె॥ సంధి కొప్పిరేని "చాల లే" కందము, సమ్మతింపరేని "శాంతిదూరు
లంద మవల; దీనియట్టియుపాయిన్ముం, మనకుఁ గానరాదు మఱియొకండు

క॥ చెఱియొకటిగఁ బంపినఁ గొ, ప్పరమునకున్ లాఘవంబు పైఁ బడ దెవరో
యొఱఁగినవా రెట్లాడిన, నగయురుదూగగులు యోగ్యు లందఱు మనలన్।

తే॥ గీ॥ ఒకరొకరికి నెప్పట్లు నోపువారు, కారు తుల్యులకయ్యమ్ము గలిగినప్ప
డేరి నేరు జయింపురో? యింతలోన, సంధి చేసిరి పైవారు శాంతి గోరి, ౧౪౦

క॥ అనుప్రథ గన్గిన మనకున్, ఘనతయె మనకవుల కింతకన్నను గొప్పం
గొని తేఁగలమే? మును పా, సన మేనియుఁ గోరు టయశమ్ము నకె కదా.

తే॥ గీ॥ అసనం బిడ నందుల కల్లవారి, మీసములు పీఁకుదు మటన్న బాస చాలు
నిపుడు మన వన్న గడఫలియించెనేని, "కోటలోఁ బాగ వేయుఁ బో?" కొప్పరంబు

క॥ అనునతనిమాట చొప్పన, ఘనుఁ డావ్యథుండు సలువఁగా నెంచియు వా
ళ్లనుకూలింపమిఁ గొండొక, దనుకన్ మాఁడకుఁ గాగితను రా దయ్యెన్

గీ॥ అంత బ్రాహ్మణకోడూరియగ్రజన్ము, లెల్లమమ్మునాహ్వానించి యెలమినుక్క
సభను గావించి మేటియుత్సవ మొనర్చి, గౌరవించిరి వైరులు కళవళింప,

---

# బ్రాహ్మణకోడూరు శతావధానము.

సుగుణకలితకవితావనితానేతలును సురుచిరాలంకారవిధాతలును విలసితపాకస్రోతలు నఖిలార్థదాతలు నగు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల యవధానవిధానంబులం బరికించి యానందించి యీజంట సత్కరింపవలయు ననుతలంపున గుంటూరుమండలమందలి బాపట్లతాలూకాలోని బ్రాహ్మణకోడూరు నివాసులంద ఱేకగ్రీవముగ నిర్ణయించికొని తద్గ్రామంబునకు వారలఁబిలువనంపిరి. కడచిన శనివారము 9-9-11 న వారలను, శ్రీమ న్మధ్వశాస్త్రసంపన్నులును బాలసరస్వతీ బిరుదాంచితులును, లలితగతి శతావధానధురీణులు నుభయభాషాకవితాధురంధరులు నయిన శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారినిఁ దద్గ్రామంబున కాపురజనులు రావించి గ్రామోపకంఠంబుననే యీత్రిమూర్తులశిబికాసుఖాసీనులం గావించి నానావిధ హృద్యవాద్యంబుగ నూరేగించి బ్రహ్మశ్రీ పెరవలి పార్వతీశ్వర శాస్త్రులవారి భవనంబున విడియించి యుచిత సత్కారంబులు సలిపి సగౌరవంబుగ నాఁటికి వీడ్కొనిరి. అయ్యెడ నీక్రిందిపద్యముల నొక బాలుఁడు చదివెను.

ఉ॥ స్వాగతమయ్య! మీకు విలసత్కమనీయ యశస్సుధారస
శ్రీగురుతావిభూషిత విశేషనభోంతరరమ్యదీధితుల్
సాగరకన్యకాఘనకుచస్థలచందనచర్చితప్రభా
భ్యాగమరమ్యదేహు లగునార్యులు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య సత్కవిహృదంతరదంతురిత ప్రభావసం
ధ్యాగమతర్పితాఖిలజనాహ్వచకోరులు దర్పవద్విరో
ధ్యాగతహుంకృతిస్ఫురదహంయులు నిస్తులితోరుశక్తి సం
ధాగరిమావధానకృతిదాతలు తిర్పతి వేంకటేశ్వరుల్.

ఉ॥ స్వాగతమయ్య మీకు రచనాతిశయాన్వితకావ్య సద్యశో
భాగ విశేషవేష్టితవిధాన్వరలోకులు గౌరవ ప్రభా
సాగరమజ్జదుత్తమవిశాలయశస్సరిత్ప్రభావృ లం
బాగరిమ ప్రగాఢసమహోయుత తిర్పతివేంకటేశ్వరుల్

ఇట్టియుత్సవంబునకు సుగుణ సంపత్తి గలపౌరులయుత్సాహము నైకమత్యమునుగాగణములు, అచ్చట కాపులుఁ గరణాలు'' వీరగ్రజన్ములు వీరలితరులంచు భేదభావంబుంచికొనక యెల్లరు సోదరుల భంగిఁ జెలంగి మెలంగుటఁ జూడ నేరికేని వింత పుట్టింపకమానదుఆహా! యైకమత్యమన్ననిదియకదా! యైకమత్యము, ఇట్టియైకమత్యముకదా భరత ఖండవాసుల నుద్ధరింపఁ గలదు మఱియు నీవర పౌరులు నలుగడలనుండియుఁ దత్ప్రజ్ఞాదర్శనంబునకై గౌరవనీయులగు మఱికొందఱఁ బెద్దలరావించి వారల నుచితవిధుల మన్నించిరి. వీరల సౌజన్యము శక్తి, సామర్థ్యము, నిష్కల్మషహృదయతయు, నెంతయు శ్లాఘనీయములు.

మఱునాడు 10-9-11ఆదివారంబున నవధానసభ సేయ నిశ్చయింపఁబడియె, ఆనాఁడు భోజనానంతరము రెండుగంటలకు శ్రీనాగమల్లేశ్వరాలయపురోభాగంబున స్థాపింపఁబడిన నారికేళస్తంభవిలసితంబై పచ్చతోరణంబులరాజిల్లు తాళదళంపుఁ బందిట సభకూర్పంబడియె, అందు నానాగ్రామ సమాగతవిబుధవరులును గూడియుండిరి. నాఁటిసభ కగ్రాసనాధిపత్యము వహింప శ్రీకాశీకృష్ణాచార్యులవారు ప్రార్థింపఁబడిరి పిమ్మట వారియాధిపత్యము క్రింద నాసభ సుముఖంబుగఁ బ్రారంభమయినది. అవధానంబును ముగిసె అంతటఁ దద్గ్రామవాసులు నితరులును జక్కని మృదుమధురశైలిఁ గొన్నిపద్దెంబుల, శ్లోకంబుల,రచించి యవధానుల కర్పించిరి. తదనంతరము సభ చాలింపంబడియె.

ఉ॥ రంగారావు, బి, ఏ., డిస్ట్రిక్టుకోర్టు వకీలు.

(అవధానప్రారంభపద్యములు.)

చ॥ "వయసు గణించు చున్నదిఁక వల్లదవధానము,,లంచు మేము త
ద్దయు బతిమాలి యేటికి వధానములన్ సమకూర్చె దన్న "నా
దయ కొకఁడున్నె వార్థకము తాత!,, యటంచు వచించెదేమొ య
ట్లయిన "తథాస్తు" నీయభిమతార్థమె తీర్చెదమమ్మ శాంకరీ॥ తి॥శా॥

శా॥ ఊరేగించుటె కాక మాయెడల మీయూరెల్లఁ జూపించు వి
స్తారోదారపుగౌరవమ్మునకు నేచాయన్ బ్రతీకారమొ
ప్పారన్ జేయఁగ నేర్తుమేము;రసవద్వ్యాహారముల్ గొన్ని శ్రీ
వారిం గొల్చి గడించుకొన్న వెటులో వాక్రుత్తు మాలింపుఁడీ॥ వెం॥శా॥

(అవధాన పద్యములనుండి 2 మాత్రము)

(బ్రాహ్మణకోడూరు)

మ॥ గణనీయుల్ ద్విజు లల్లరాజులు యశస్సాంద్రముల్ కిరాటుల్ లస
ద్గుణగంభీరులు కమ్మవారు తనరన్ దోరమ్ముగా ధాన్యపుం
గణముల్ గోట్లుగఁ బుట్లు పండఁగల భాగ్యంబెందుఁ బెంపారు బ్రా
హ్మణకోడూరుపురంబు చెన్నలరు లక్ష్మ్యావాసమై వాసియై. 5

ఆంగ్లేయులప్రభుత్వము.

శా॥ పాలింజొచ్చె నృశంసవర్గములు, దైవారంగ నీరెల్లచోఁ
గాలింజొచ్చె సమస్తమానవులకున్ బల్ సౌఖ్యసంపత్తి పెం
పారన్ జొచ్చె నిరాన్యరాజ్యమున "నాహా! యిట్టి రాజుల్ ముదం
బారన్ వర్ధిలఁగావలెన్ మనకు విద్యాసంపదల్ గావలెన్. 23॥

అవధానాంతమున నితరులు చెప్పిన పద్యములనుండి కొన్ని.

మ॥ సకలాంధ్రావనిపాలకోత్తమ సభాస్థానమ్ములన్ సత్క్రియా
వక్రకరమ్ముల్ దలయూఁచి మెచ్చఁగఁ గవిత్వస్ఫూర్తినైశావధా
నకళోద్భూతజయేందిరా ప్రథితసన్మానమ్ములన్ గాంచుచున్
"సుకవీశేంద్రమృగేంద్ర",,లన్ యశముఁ గైకొన్నారు వీరిర్వురున్. 3॥

శిష్టా హనుమచ్ఛాస్త్రి.

మ॥ కవితాకన్యకుఁ బెండ్లియాడియు సుహాసకళ్యాణముల్ పొందియున్
వివిధోపాయపుధారణావనితనుం బెండ్లాడి తర్వాత నా
సవతుల్ గూడి యనన్యచిత్త లగుచున్ సంసక్తిసేవింప నా
రవితారం బగుకీర్తిఁ జెందుకవి సమ్రాట్తల్లజుల్ మీరగా.

మొదలి నాగభూషణము.

సీ॥ ఎదిరిగాడగుఁ గన్న నీసడించెడిసాము లెవరికి ఛత్రమ్ము నెత్తువారొ
యొకరుగ జంటెక్క నూర్వరేని మహీంద్రు లిభము పైనిడి యూరేగింపుగాంత్రొ

కలనైన న్బరుల చామరలఁ జూడ మనుదారలవీవన లెవరికి వేయువారొ
పైరాజొకైనఁ గప్పంబిడు టొక్కని యును లెవ్వరికిఁ గానుక లిడెడివారొ
తే॥ గీ॥ అమ్మహాత్ములు భారతీ హావభావ, విలసనము లెల్లయెడఁ జల్లి వెలయువారు
వీరె కనరయ్య! తిరుపతి వేంకటేశ, కవులు కమలాంగనాఖర్వగర్వహరులు.

ఇట్లు సజ్జనవిధేయుఁడు    తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి.

---

సీ॥ భువిలోఁ బ్రసిద్ధమౌ భూసురాన్వయమందు నరుదారఁగా జన్మమందినారు
శైశవంబున నె శ్రీదేశికసేవచే మించు విద్యల గ్రహియించినారు
శతవధానప్రవీణత రాజసభలందుఁ బలుమాఱు జయములఁ బడసినారు
వాణిగృహీతాది భాసురగ్రంథముల్ చేసి సత్కీర్తిని జెందినారు
తే॥ గీ॥ ఇట్టి సుగుణంబులను గల్గునట్టిమీరు, భవ్యతరకీర్తి నెన్నంగవశమె మాకు
గీర్తికాంతాసమాసక్త మూర్తులార: సరస తిరుపతి వెంకటేశకవులార.

తెలికపల్లి వీరరాఘవశాస్త్రి.

---

సీ॥ ప్రతివాదిజనభయప్రదమైన యస్మ్ముఖం బంతేవసత్త్వాలి కమృతమొసఁగు
సభ్యులకడ లిడఁజాలెడుయద్వాణి కబ్బంబులందు సౌఖ్యము ఘటించు
తథ్యాంశమున్న స్వతంత్రించు యద్ధాటి మిథ్యాంశమన్నఁ దామిన్నకుండు
త్రైలోక్యరంగనర్తకియైన యత్కీర్తి విబుధమనోగోష్ఠి విడువకుండు
గీ॥ నట్టిరుకవీశితలును శతావధాన, ధారణాధోరణీ చిత్రితప్రముఖులు
నస్మదీయ గురూత్తములవని నాయు, వునుయశంబును గనుచుంటిపొనరఁగాఁ
సీ॥ ఆంధ్రదేశావస్థితాశేషభూమిభృత్కోటీరమణిఘృణిఁ గూడియాడి
కవితాకృతానేకగణనీయ పూర్వపుణ్యాతిశయంబులఁ జోతలంది
గోదావరీతీరకూలంకషామోఘపాండితీప్రథకు జీవంబు వోని
కమనీయరచనాప్రకారకారణయశస్సీమంతినీలాస్యశేష మరని
తే॥ సరసరసపుష్టి భావకసత్ప్రబంధ, బంధబంధురతత్కవిత్వప్రభావ
భావగంగాప్రవాహానువృత్తరంగ, రంగకలనయఖండచిత్రంబునొసఁగె
సరసతిరుపతి వెంకటేశకవులార.
సీ॥ అన్యాదృశంబైనయశమును గర్హించుదోషజ్ఞబృందంబుఁ దూలనాడి
విషమపరీక్షావివేచనాప్రౌఢులౌ సంస్థానపతుల సంశయము దిద్ది
భిన్నభిన్నరుచిత్రభేదముల్ గల్గులోకుల నెల్ల నొకపేమున విగించి

అష్టావధానశతావధానాపురభాషితపాండితీబలము నొసఁగి

గీ॥ అఖిలదిక్కులజయవైజయంతికాలి, జృంభణము మీకుముందుఁగై సేసియుంచు
తమపురాకృతపుణ్యంబు దరమె పొగడ, సరస తిరుపతివేంకటేశగురులార!॥

అవ్వారి, సుబ్రహ్మణ్యశాస్త్రి

సీ॥ పట్టుమంచొక గీతపద్యమ్ము వ్రాయరాదా! యేమి నోరు లేదాయొఁ గాని
ఆశుధారయటన్న ననలెమాచేతఁగాదా! యేమి ధారలేదాయొఁగాని
అవధానతంత్రంబు లందు మాబుద్ధిపోదా! యేమి మేధ లేదాయొఁగాని
వాఙ్ముఖమ్మున మాదువక్రమించుక సాగదా! యేమి మాటరాదాయొఁగాని

గీ॥ మాకు ననుకొనుపండితుల్మహిని నెఁద, లోకలరు గాని యీమేలు పోకలుట్టి
పడఁగ నవధాన మొనరించు వారుగలరె, ధరణిఁ దిరుపతి వేంకటేశ్వరులు దక్క.

కాశీ, కృష్ణాచార్యులు, శతావధాని.

సీ॥ కన్నబిడ్డలవలెఁ గాపాడి విద్యల శిష్యాళి కెప్పుడు చెప్పుచుండ్రు
సాహితీగ్రంథముల్ చక్కఁగ బోధించి పండితులను జేసి ప్రబలుచుండ్రు
సారకవిత్వంపు సరణిని నేరిపి సద్గ్రంథములఁ జేయ సాకుచుంద్రు
ఆశుకవితధార నలవడఁగాఁ జేసి ఛాత్రులఁ గనుఁగొని సంతసింత్రు

గీ॥ పుడమి వీరికి సరియగు పురుషు లెవరు, నరుఁడు నారాయణుండును జరపుకృపను
వరుసఁ దిరుపతి వేంకటేశ్వరులె యగుచు, జగతి జన్మించినారలు సత్యమిదియ.

నోరి, హనుమచ్ఛాస్త్రి.

---

క॥ నిక్కానసీల్గినఁ దమకిపు, డెక్కడి వారేని సామ్య మెనయరు నిక్కం
బిక్కరణి నేసు వ్రాయఁగ, నక్కఱయే లేదు జగతి యంతయుఁ బలుకున్.

వలివేటి, వెంకటనరసింహము.

---

☞ దిఙ్మాత్రముదాహరించితిమి, తక్కినవి యచ్చయియున్న పుస్తకమునఁ జూడఁదగు దాని వెల రు0—2—0 అణాలు మాత్రము.

---

క॥ పిదపఁ బినపాడు లోనొక, సదస్సుటులె జరిగె నంత ఛాత్రుఁడొకఁడుగో
విదపుయ మగు కాలేజీ, సదస్సులో శతవధాన చతురిమ నెఱపెన్. ౧౬౮

# శ్రీ పినపాటి శతావధానము

ఆర్యులారా! జగత్ప్రసిద్ధులగు బ్ర॥ శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు గుం
టూరు పురవాసులచే ప్రార్థితులయి అచ్చట బ్ర॥ శ్రీ, కాశీ కృష్ణాచార్యుల వారి
అగ్రాసనాధిపత్యమున అవధాన సభజరిపి స్వకవితా సుధాసారముచే తద్గ్రా
మవాస్తవ్యులను సంతసపఱిచిరి, పిమ్మటవారినమావేశమును జేసికొనదలంచి మేము
అతికుతూహలాయత్తచిత్తులమయి మాగ్రామమునకు దయచేయుఁడని వారిని(ముప్ప
రను) ప్రార్థింపవల్లెయనిరి 21-9-11 తేదీని సాయంసమయమున వారుదయచేసి మా
చేనొనర్పఁబడిన వాహనాదియుత్సవముతోఁ గూడపురజనులు జయధ్వనులొనర్చు
చుండ మాగ్రామము నలంకరించి భోజనానంతరమున కొంతతమకవితామృతము
చే మమ్ములనానందింపఁజేసి నాఁటిరేయి సుఖముగఁబుచ్చిరి, మరునాఁడు అనగా
22-11-9పగలు మ॥ శ్రీ॥ కాశీకృష్ణాచార్యులుగారి యగ్రాసనాధిపత్యముక్రింద
పగలు3ఘంటలకు అవధాన సభప్రారంభింపఁబడియెనాఁటిదినంబున తెనాలిమున్న
గుగ్రామములలౌకికవైదికవిద్వద్గణ్యులువిచ్చేసినసభనలంకరించిరి, మరునాడుసభబ
హుజనపూరితంబగుటంజేసి సమ్మర్దమెక్కుడు గలిగినందున 5ఘంటలకుమాత్రము31
మందికి ఏకైకపాదక్రమంబున జెప్పి ఆమరునాడు సాయంసమయమున తక్కినది
పూర్తిచేసి సభికులను శ్రవణానందము నొందచేసిరి. అవధానము సంపూర్తిచే
యుటకు పట్టిన కాలము మొత్తము 8 ఘంటలలోపు అయియున్నది.

ఇట్లు విన్నవించువిధేయులు,

తెనాలితాలూకా పినపాటిపురవాస్తవ్యులు.

(అవధానప్రారంభపద్యములు.)

ఉ॥ ఒక్కొకచోట నొక్కగతి నొప్పఁగదంబ! భవద్విలాస మ
న్నక్కఁ ఘటించు వస్తుచయమంతయు శక్తిమయంబు దానికిం
దక్కినవార లెందులకుఁ దా రసమర్థులటం చెఱింగి నే
నిక్కృతికిన్ గడంగెద నిహీ? యనిపింపకుమమ్మ శాంకరీ. 1

ఉ॥ మానియుఁ జేయఁబూనిరని మాపయిఁ గోప మదేల నీకు, మా
పై నెన రూను పేరకులపై ననురాగ మదేల? యొట్టులో

ఘూనితి మిష్టు పామ్మనినఁ బోఁడువె? "ఓటశిరమ్ముఁ గ్రుక్కిజం
హూనఁ బనేమి రోఁకలి, కెటో నటియింపు శతావధానమా॥ 2॥ వెం॥ శా॥

మ॥ స్మయమేపారశతావధానకవితాసామ్రాజ్యమేలించి త
చ్ఛయశోమూలము గాఁగ, నీపగటివేషా లెన్ని నాళ్లింక, మా
పయికేరే నరుదేర వారల నదల్పం జాలుధీశక్తి యి
చ్చి యెటోమన్నుట నీక భారమగు నీచిత్తంబు కామేశ్వరీ॥ 1॥ తి॥ శా॥

## అవధానపద్యములనుండికొన్ని.

### వైదికనియోగులకు సఖ్యము నుగూర్చి.

ఉ॥ ఎవ్వరు వైదికుల్? మఱియు నేరు నియోగులు? సుకవిప్రులే
చివ్వకు డీకొనన్ గలుఁగు చేటిఁక; దక్షిణజాతివారికిన్
నవ్వఁగ నందుగాదె! యటు నవ్వఁగఁ జేయుట ప్రాజ్ఞధర్మమే?
యెవ్వగనైన వీరిరువు రేకముగాఁ జరియించు టొప్పదే॥ 7॥

### బాసుగారిచట్టము.

మ॥ కలికిన్ గంటికిఁ బ్రీతిగొల్పునెడ వేడ్కన్ దేని నేనిన్ నరుం
డెలమిన్ గైకొనవచ్చు దాసియయి నెంచేఁ జేర్మి వో నప్పుడ
క్కలికిన్ వీడఁగవచ్చు నొండొకట భాగ్యంబున్న విశ్వస్తతోఁ
గలియన్ వచ్చును "బాసు" చట్ట మురరీకారంబు గావించుచో॥ 15॥

### ఇప్పటివారి కవితా సంస్కారము.

శా॥ చారుశ్రీకములౌ నలంకృతులకున్ సన్మార్జనము ల్గల్గె శృం
గారంబెల్లను గారమయ్యె గుణముల్ ఖండంబులై పోయె సం
స్కారమ్మెల్ల నశించె భాషలకు దౌర్గత్యంబు ప్రాప్తించె సం
స్కారమ్ము ల్పొనరించువారి కతనన్ సర్వంబు మాసెంజుఁడీ॥ 27॥

### పృచ్ఛకుఁ డిచ్చినవిషయము.

సీ॥ శాలివాహనుని దౌశకమునఁ బదుమూఁడువందలయేండ్లపైఁ బార్థివాఖ్య
వత్సరంబున మాఘబహుళచతుర్దశి శివరాత్రితిథి రాజశేఖరుండు
వీరనారాయణాభిఖ్య గల్గిన రెడ్డి శంకరమునికకలంక దాన

మపుర(గాన(గహారము గాఁగ నొసఁగె నీ పినపాటిగ్రామంబు సుమ్ము; నేఁడు
కారణంబెద్దియో గల్గి నేఁడీ యమ్మెయ్యైనను బంట లత్యధికముగను
తే॥గీ॥బండఁ జేసెడిసూణుల ప్రాభవమున, సిరియు సంపదయు సగల్గి చెలఁగుచుండె
నెల్ల కాలమ్ము నీరీతి నెసక మెసఁగ, వృద్ధిఁగాంచుత మీపినపాటియూరు ॥41॥

సభ జరిగినచోటు.

సీ॥ ఎద్దానితూర్పున నెసకంబెసఁగుచుండు లీలమై మదరాసు రైలురోడ్డు
ఎద్దానివైశాల్య మెంచి కొల్పింతుమే నాలువందల గజాలై చెలంగు
ఎద్దానిదేహ మెంతే నొప్పఁ జేకు దూలములతోఁ జేకువాసములతోఁడ
ఎద్దానియంతరం బింపారు సత్ర-విపటలిచే సద్గవిపటలిచేత
తే॥ గీ॥ పేరుగోష్ఠంబు గాని యేయూరనైన, మతియుఁ బట్టణములనైన వఱల దిట్టి
"హాలు,, నాఁ జనునిద్దాని నాలకొఱకు, కొట్టుకోటామకట్టించెఁ కునుకమెసఁగ

సమస్యాపూర్తి.

శా॥ కుంచాలన్ గొలిపించి యిచ్చితిని గాకుగ్గిళ్లకై యుల్వలన్
గంచాలం దిడఁబోకు మన్న మిపుడెక్కన్ బోదు సంసారి "పా
వంచాలం డిగి దప్పిగొన్న విరసుబ్బా! నీకు వేవేగదె,,
(మ్మంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా! బిందియన్ దేగదే?)॥ 62॥

సమస్యాపూర్తిః.

శ్లో॥ నహి సంతతిస్తు నరకార్ణవాపహా, త్వితిదుఃఖమాత్మపితరం నిరీక్ష్య సా
తనయా దదౌ స్వతనయం తతస్స్వహో! (అనుజో బభూవ తనుజోఽపి మాతులః)

అవధాన మొనరింపఁ జేసినవారు.

సీ॥ తూములూరిసుధాబ్ధిసోముండు విద్వద్విధేయుండు కోటయ ధీరుఁ డొకఁడు
పినపాటి వంశాబ్ధివిధుఁడు (శ్రీనీకంఠద)యకవిత్వరసప్రధానుఁ డొకఁడు
భళ్లమూడ్యన్వయవారాశిచంద్రుఁడౌ శ్రీ రామనామకసూరి యొకఁడు
తూములూర్యన్వయేందుండు శ్రీసూర్యనారాయణాభిధకవినేయుఁ డొకఁడు
తే॥గీ॥ లక్ష్మీకాంత యొకండు సులక్షితుఁడయి, వఱలు నన్నము భొట్లసువంశజుండు
ధీరుఘటియించి రవధానమారఁగఁ బిన, పాటిసాంబశివాభిఖ్య భవ్యుఁ డొకఁడు

### అవధానాంతమున నితరులు చదివినపద్యములనుండి కొన్ని.

మ॥ తమ సన్మానముఁ జేయ శక్తియు నసుమంతన్ లేదు మీశక్తియు
త్త మటంచున్ గ్రహియింపలేము నరనాథ ప్రార్థ్యులై యొప్ప కా
ర్యము చేయన్ నడుకట్టినార మిట లోపాలోపముల్ దిద్దుమా
ర్గము మీదేయని వేఁడుకొందుము నమస్కారంబు గావించుచున్.

చంపకమాలిక.

తరతమభావముల్ ఫణితి దజ్ఞులు పండితు లెల్లవారు గొ
ప్పరవు కవిద్వయంబునకుఁ బండితులై యలరారు మీకు నీ
వరుసఁ గ్రహించినార లది బాగుగ లోకమువారు గూడ నె
ల్లరును గ్రహింపఁగా మనముల న్బొడగట్టిన కోరికన్ పేర్మి చే
కులఁగను వారికిన్ దమకుఁగూడను గన్నులిఖించినాఁడఁ గొ
ప్పరమిట కేగుదేర దల వారికిఁ గార్యభరంబు పొందొకో?
............దీనికిని సాటిగఁ గొండొకఁ జెప్పఁబోవఁగా
వారకొనవచ్చునే! తొంచటఁ దోయజమిత్రుని ముందు దీపము
ద్ధురమగునే? స్నేహముండటను దోమను బోల్పఁగవచ్చునే? ధురం
ధరమయి యెల్లమానవులఁ దానయి పూతులఁ జేయు గోవు ముం
దర ఖరముల్ మహేశ్వరుని దాపున రాక్షసవర్గ మెందు నుం
తురె! యనిప్రేక్షకుల్ తమమదుల్ బయిపెట్టఁగ నొప్పనట్టి శ్రీ
తిరుపతివేంకటేశ్వరుల దివ్య కవిత్వ మహత్వ మిప్ప డా
దరమునఁ జూడఁగల్గె ఫలితంబుగనయ్యెను జన్మ మిత్తరిన్.

తూ॥ కోటయ్య

---

ఉత్పలమాలిక.

నీతులు వల్కవచ్చుఁ బరనింద లొనర్పఁగవచ్చు నిట్టు లా
సేతు హిమాచలంబును బ్రసిద్ధి వహించు నృపుల్ సెబా సనన్
ధీరులు తోసిఁబట్టి తల వెనక్కుఁ ద్రిప్పుచు జాఱుచుండఁగన్
జాతవిరోధులే పలుకు సాగక యుక్కడ మూల్గుచుండఁగన్

మూతులు విప్పి మొత్తువడి మూర్ఖులు కొందఱు తారుమాఱుగా
ఖ్యాతిఁ దలిర్ప పండితులయారె! భళీ; యపురా! యన..."

తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి. చఁదవోలు.

సీ॥ చక్రశంఖాది లాంఛన విరాజితుఁడైన విష్ణుఁడే యీ కాశి కృష్ణుఁడంచు
కవితాసరస్వతి ఘనత నాడించుగీష్పతి దివాకర్లతిరుపతి యటంచు
కుకవిత్రిపుర దైత్యకుంభిహర్యక్షుఁడౌ నీశుఁడే యీ వెంకటేశుఁ డంచు
ద్రష్టలు లోన భేదము లేక గనుఁగొన్న మూఁడుమూర్తులు నొక్కమూర్తి యంచు
గీ॥ మానవోత్తము లేమహామహులనెప్డు, పలుకుచుండెద రాకవిబ్రహ్మలను మ
దీయ హృత్పద్మమున వినుతించుచుండు, నెలమిఁ దిరుపతివెంకటకృష్ణకవుల.

ఇట్లు విధేయుఁడు, దెందుకూరి సోమనాథశాస్త్రి.

సీ॥ శేషాద్రిగాక యశేషదేశీయుల నిత్యోత్సవములచే నెగడినారు
వడ్డికాసులుగాక యడ్డులేక జనాళి లిడ్డకాసుల సంగ్రహించినారు
వగగూఢపదభోగవసతిగాక యగూఢపదభోగవంతులై పరఁగినారు
ఈశ్వరబిరుదు గ్రహించుటగాక కవీశ్వరబిరుదు గ్రహించినారు
గీ॥ కొండశిఖిమాత్రనే మహానందనిధుట, గాక యండజ కానందఘటకులైరి
యిప్డు దాతిరుపతివెంకటేశు మించి, రిలను నీతిరుపతి వేంకటేశకవులు.

చ॥ గురుతరలీల నీసభను గూర్చిన బుద్ధిమదగ్రకోటికిన్
సరసశతావధానుల కెసంగు సభాపతికిన్ సభాస్థలాం
తరసకలప్రజాళికిని ద్రష్టల కీ పినపాటివారికిన్
నిరతసుఖంబు నీప్సితము నీశగణుం డిడఁ బ్రోచుఁగావుతన్.

ములుకుట్ల, వెంకటకృష్ణశాస్త్రి, శతావధాని.

శ్లో॥ ఉద్గచ్ఛన్తు శతా త్వరేచ కవయో జల్పన్తు నిస్సంకటం
మాత్సర్యాత్ కవితాప్రశస్తివిషయే నత్కల్పనా చాతురీ

ధీమత్పణ్డితమణ్డలీహృదయసంతోషప్రదా సద్గుణా
నైవాన్యం సముపైతి కిన్తు భవతో జిహ్వాం విహాయ క్షణం
వేమూరి, శివస్వామిశాస్త్రి.

సీ॥ మీధారణాశక్తి మితిలేనిదనుటకు డంబౌ శతావధానంబె సాక్షి
సాహిత్యసామ్రాజ్యచక్రేశు లనుటకుఁ దమరుకూర్చిన పుస్తకములె సాక్షి
శాకవిశ్వంభరమత్కరిహారు లనుటకుఁ గొప్పపుంగవుల నేకులటమె సాక్షి
అఖిలరాజన్యపూజ్యత నొంది రనుటకు బిరుదులున్నవి వేనవేలు సాక్షి
గీ॥ ఎలమిమిముఁ బోలుసుకవీశ్వరులు ధరిత్రిఁ గలరె కనుటకు మాయువలయునియె సాక్షి
విమలమతులార! తిర్పతి వేంకటేశ, సుకవిమణులార! బహుత రాశుకవులార ॥3॥
గూడ, కృష్ణయ్య, పెరవలి.



## గుంటూరు కాలేజీ శతావధానము.

చ॥ ఎఱుఁగదు పిల్లకాయ యొటులే నొనరించు శతావధానమున్
సరసులు మీర లెల్లరును సభ్యులు పేర్మి ననుగ్రహింపుఁ డా
దరమునఁ దప్పులన్ విడిచి తద్దయు నొప్పులు చూచి మెచ్చుఁడీ
తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యుని వృద్ధి కానువీన్ ॥ (వెం॥శా॥)

☞ అవధానపద్యములన్నియు వదలఁబడినవి.

.......................................

శా॥ నీకున్ శ్రీయును ధీయుఁ గల్గుత మఱి నీ కంఠసౌగన్ధ్య మ
స్తోకంబై యలరారుఁగావుత నినుం దూలింపఁగా లే గు
ర్థీమల్ గాంభీర్యశతావధాను లిఁక [illegible]
కేశాకారమశంబు నైకొనఁగదోయూ! ఛాత్రమా [illegible]. ॥3॥

మ॥ కుతుకంబొప్ప సరస్వతిం గొలిచి నేఁ గొంతార్జనం జేసితి
న్మతిమన్ముఖ్యుని బ్రహ్మఁ గొల్చి మఱికొంత న్నేర్చితిన్ విద్దె ని
చ్చితి నీకు న్మతిఁ గొంతమందికి యశశ్శీ నిచ్చితి వారిక
న్నుతనామా! శివరామ! నీవు నొనరింతున్ దీవనల్ హెచ్చుగన్. ॥4॥

మ॥ ఎదిరిం దమ్ము నెఱుంగకే యెవరొ మహాత్ముండేని నిందించునా
యదన న్వచ్చితి వద్దు చొచ్చితివి నిన్నవ్వారు లక్షింపరై
రది లోకం బెటులో యెఱింగె నభగణ్యత్వంబు నీ కిచ్చి ర
య్యాని దేనల్ నండె భవద్యశంబు శివరామా! ఛాత్రచూడామణీ!॥ 5॥

సీ॥ నీతండ్రి వేదవిద్యాతత్పరుం డట యున్నచో నెట్లు నిన్నోము నెకొ
నీతల్లి లోకవిఖ్యాతదివ్యచరిత్ర యంది గన్నం దా నెంత ముదముగనునొ
నీయన్న విద్యావినీతితత్పరుఁ డట నిపుడున్న నెంతటియెలమి గనునొ
నీతమ్ముఁ డవధాననిపుణుఁ డీకృతి గన్న నెంతయామోదమ్ము నెనయునొకొ
గీ॥ ఇది మహాత్మ్యంభవంబు సీయెల్లబంధు; వులును బొందెడిమోదమ్ము గలిసియొక్క
నన్ను నేపొంపెభరముఘనంబు మోయు, టెట్లుశివరామ! చెప్పుమోయూ! కుమార!.

మ॥ కలవిద్వాం బలుమంది కిచ్చితని వీఁకం గొంద ఱెట్లెట్టులో
యెలమిం గూర్చిరి పంగనామ మిడి యెల్లెఁ గొంద ఱానందముం
గొలుపం బూనిరి నీకతమ్మున నఁ దగ్గుంగాక యాయెగ్గుఁ ద
గ్గులు; నేనే శివరామశాస్త్రి! మది పొంగుంగాక నాకుద్ధతిన్. 7.
శా॥ "సంతానం బది లేదు నా" కనుమనశ్శల్యంబు నీవైదుషీ
కాంతుల్ ద్రోచెఁగదోయి! తండ్రి! నిను వాకాంతుండుఁ దద్భార్యయున్
స్వాంతం బుంచి యనుగ్రహించి బహుధా సంతుష్టునిం జేయుచున్
మంతు గ్గాంత సమస్తలోకమును సమ్మానించుఁగాత న్నినున్॥8॥

చ॥ "అయుతదినేడు లాయు,,వని యందురుగా కలిలోన, నల్వ దీ
వఱకె గతించె నిప్పటికి వ్యాఘ్రము మనన్ జర నోరువిప్పి మ
మ్మరయుచునుండె మాభరమునంతయు నీతలఁ దాల్చి చేయు మే
ర్పఱచినత్రోవ నోయి శివరామక వీ! బహుశావధానముల్॥ 9॥

క॥ "య,,న్ననుచుఁ గొందఱనఁగా, "బ,,న్ననుచుం గొందఱనఁగ బాలుఁడవయ్యున్
నిస్సీమ యశముగొంటి మ హాస్సాగర! వృద్ధినందుమా! శివరామా!॥ 10॥

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని.

మ॥ జగతీనాథులు పెక్కు మంది ముదితస్వాంతంబునం గాన్క లం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శతద్వావింశతిం జేర్చి హ

చ్చఁగ మా యేలినయీయవధానకవితాసామ్రాజ్యభారంబు మో
యఁగఁ బూనంగదవయ్య తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై॥ 1॥

మ॥ రిపులే తెంచిన రూపడంచుచు ధరిత్రీనాథు లర్పించు న
య్యుపదల్ గైకొనుచుం బ్రమత్తుఁడవు గా కుద్యన్నవేందుండవై
విపరీతం బగు త్రోవఁబోక కవితావీరుండవై వర్ణనీ
యవరాకాంతి వహింపుమయ్య శివరామయ్యా! చిరంజీవివై॥ 2

శా॥ బాల్యోద్రేకముచే నెదిర్చితివి కొప్రంపుంగవిం గ్రంథసా
కల్యంబుం బొనరింతో లేదో యని నీకై కొంతు నస్మన్మన
శ్శల్యం బిప్పటి కూడఁదీసితివి వత్సా! సత్ప్రభాశోభివై
కల్యాణంబులఁ బొందుమయ్య! యిఁకవీఁకన్ శిష్యచూడామణీ. ॥3॥

మ॥ అవనీదేవులు నిన్నుమానకవితావ్యాపార వారాశినం
భవపీయూషరసాభిలిప్తలలితవ్యాహారసీహారులై
యవలోకింప శతావధానమున మాకానందముంగూర్చి గౌ
రవము న్నిల్పితివయ్య మాఋణము తీఱెన్ శిష్యచూడామణీ. ॥4॥

శా॥ స్వర్గీలావతులెల్ల రద్భుతపదవ్యాపార మేపార మా
చర్లబ్రహ్మసుధీగురూత్తమునివాచాపూర్తిఁ గీర్తింపఁగా
గీర్లాభంబునుఁ గోరిమాదరికి భక్తిన్ శిష్యులే తేరఁగాఁ
దర్లంజేసితి వస్మదీయగురువిద్యావంశచూడామణీ. ॥5॥

దివాకర్ల, తిరుపతిశాస్త్రి, శతావధాని.

సీ॥ శతవధానవిధానసందర్భములనెల్ల నేర్చి దిక్కులఁ గీర్తిఁ దార్చినావు
అవధానమునఁ బెట్టినట్టి చిక్కులనెల్ల నూర్చి నీపని నీవ తీర్చినావు
నడుమ త్రుంగఁగ వ్రాయు నడిమివారలకష్టమార్చి గెలిచి వారిఁ దేర్చినావు
పున్నామనరకంబు పోఁగ నాకియనుచింత దీర్చి నోజ్జకుఁ దుష్టిఁ గూర్చినావు
గీ॥ మేలు, శివరామశాస్త్రి! నీసొబ్గి గురుని, కనుపమయశంబు ఘటియించునట్టి శిష్యుఁ
డరిది, గురువులతోఁ గ్రుద్దులాడ రెపుడు, గురుయశంబుల నార్జించి కొనఁగవయ్య.

కాశీకృష్ణః, శతావధాని.

... ... ... ... ... ...



క॥ కలనిజమెల్ల నిటులె యీ, కలహమ్మున( దెలిసికొనిన( గాక తెలియ దే
వలుగో పేర్మార్చి యెదో. గిలికెడి నిజ మెట్లు తెలియు( గృతబుద్ధులకున్.
ఉ॥ ఇయ్యెడ భిన్నభిన్నతను వేటికి నెత్తిరో? వృత్తి పాటికా
మయ్యయు, రామకృష్ణులును, నందఱు చా(టెడి శాస్త్రసూరినా

---

తు గడునంతసిల్లుచున్నారము యిదివరకీగ్రామంబున జరిగిన సభలలో నేదియు
నింత జయప్రదముగా జరిగి యుండలేదు,

ఇట్లు, యథార్థవాది.

(ఆన 1911 వ సం॥ అక్టోబరు 4 వ తేది ఆంధ్రపత్రిక నుండి.)

## గుంటూరు సమాచారము.

గతనెల 18 వ తేదీని గుంటూరుతాలూకా "విశదల" గ్రామమున కొప్పరపు సోదరకవిశ్రేష్ఠు(డగు బ్రహ్మశ్రీ వెంకటసుబ్బరాయ శర్మ కవిగారిచే శతావధానము జరిపింప(బడినది. నాటిసభకు బ్రహ్మశ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. నాటి శతావధానమునకు గుంటూరు నుంచి యుద్యోగస్థులు, విద్యార్థులు, న్యాయవాదులు, పండితులు, కవులు సుమారు 150 మంది వచ్చియుండిరి. వారికందఱికి పిండివంటలతో సహా భోజన సదుపాయములు జేయబడినవి. వీరిధారణాశక్తియును, సమయోచిత యుక్తి శక్తులును, కవితాపటుత్వమును మేధాశక్తియును, శ్లాఘనీయములు. సభానంతరము కొందఱు పండితులు, కవులు తమయుత్సాహములను దెలుపుచు గొన్నిపద్యములను జదివిరి.

ఒకపృచ్ఛకు(డు.

☞ ఇట్టివ్రాతలు పెక్కులు, లోపల నిజమెఱిగియు( గప్పిపుచ్చి శ్లాఘాభిమానమును వెల్లడించునీవ్రాతలో(గూడ( జక్క(గ( బరికించువారికి "విశదల"లో నవధానముకన్న భోజనమే కొండొకమెఱు గనుతత్త్వార్థము దొరకకపోదు. అది యటులుండె, ఈరసాభాసావధానము మాయవధానముకన్న వేయిరెట్లధికముగ నున్నదని వ్రాసిన యతనివ్రాతను పూర్వరంగము 46 వ పుటలో( జూడ(గోరెదను.

రయ్యయుఁ జట్టిసింగయయు నట్టిరి నాఁ దగుపోషిపోత లీ
యయ్యలు పూర్వజన్మమునయం దొకరే యని తోఁచు నంబికా. ౧౭౭

క॥ అవధానం బారీతిగఁ, జవుటం బడువిత్తులట్లు నమయుడు శాఖా
యువతీమనోహరులు తమ, సువివేకము నెల్లఁ దెలుపఁ జొచ్చిరి పెలువన్.

ఉ॥ వెంకటరామకృష్ణులను వీరికిఁ దోడుగఁ దెచ్చి తిర్పతిన్
వెంకన నోడఁ బుత్త మిది వీ లని కొందఱు వారికోనమై
పంకలు గొట్టికొంచుఁ జని సారము గన్గొని "సీ" యటంచు ని
ష్టంకుల నింకినట్లు జను లెంచఁగ వింటిమి సుమ్మి శాంకరీ. ౧౭౯

చ॥ "తునికిన బోనిన క్రొవయిఁ గొండొక తాటిఫలమ్ము పడ్డ" య
య్యనువున రామకృష్ణు లిది యారసి యుండవలెన్ దెగించి యి
ప్పని పయిఁ బెట్టికొన్నఁ దమపాండితి బైటికి రాదె సారపుం
జనులు సమీపగుల్ బలె స్వశక్తిమహత్త్వ మెఱింగి నవ్వరే. ౧౮౦

తే॥గీ॥ "ఎడమచేయియుఁ బుట్టచేయియు" నటన్న, సాహితియె వీరికవధానపర్వపట్లు
తక్కుసామగ్రిలోన భేదంబు బోలెఁ, దెనుఁగుఁ గొప్పంబునకు రామకృష్ణులకును,

ఉ॥ వచ్చిన రాకయున్నఁ దమవాక్కులఁ, దోడుగ నంపుటేనియున్
మెచ్చు ఘటించుఁ గాని యనుచు మేటులు పేటులు "శృంగభంగముల్"
వచ్చిక మోఁపులుంబలెనె పంపిరి పాపము! రామకృష్ణు లే
మిచ్చఁ దలంచిరో? నిజ మెటే బయ లౌ నని తా రెఱుంగమిన్. ౧౮౨

ఉ॥ వెంకటరామకృష్ణులవివేకవిశాలపు 'శృంగభంగముల్'
జంకల నూని జన్మదివసమ్మున నే యనధీనతాప్తి ని
త్రికులు గొన్ 'శతఘ్ని'ఁ, బఠియించుచుఁ గొవ్విపువారి బందుగుల్
పంకపుఁద్రోవలం బడి స్వపద్ధతి వెళ్లఁగఁ బెట్టి రంతటన్. ౧౮౩

తే॥గీ॥ బందుగులటన్న దగ్గఱవారు కారు, ఏకశాఖీయులని యె నీ వెఱుఁగుమంబ!
వారు లోలోనఁ గొప్పవంపువారినత్తు, నెఱుఁగ రనుకోకు మెఱిఁగియు నిట్టులైరి

తే॥గీ॥ ఒకరొకరి దుర్వరోతక్రనీరాగులందు, గొప్పరపుధారయున నొప్పుకొననివారి
కాని యానసపర్వాభిమానమూన, మూనసాంతరులై మేను మఱచిచెడిరి. ౧౮౫

క॥ ఇదియిటులుండఁగ రాజీ, కుదిరింపఁగఁ బత్రమది యొకొండు మునుపె యా
పదములు వ్రాసియుంచిరి, కదా! తచ్చరితమ్ము వినిక గావింతు మిఁకన్.
క॥ ఇరువదినాలుగు దినములు, పరిపరి యోజించి తుదకుఁ బత్రిక మా కి
చ్చిరి తెచ్చి *గౌరవస్థులు, మఱిమూఁగురు; దానిఁ గాంచి మదిముద మొదవన్.

ఉ॥ అంతకుమున్నె "పత్రి కిటులా గతమా," యని విన్న నాఁడె వా
క్కాంత యనుగ్రహమ్మున నొకానొక కల్పన దోఁచఁగా,, యశః
కాంత వివాహమున్,, గుఱిచి కట్టియు యుంచిన పద్యసప్తకం
బింతయుఁ జేర్చి యారు విని హెచ్చిన మోదము గాంచి రయ్యెడన్. ౧౯౬

*(1911 సం, అక్టోబరు 20, తేదీ కృష్ణాపత్రికనుండి.)

బ్రహ్మశ్రీ తిరుపతివేంకట కవీశ్వరుల సముఖమునకు. ఈదిగువ సంతకముచేసిన వారు నమస్కరించి వ్రాయువిజ్ఞాపన:—

ఈపురమున నీమధ్య శతావధానసభ జరిగినది మొదలు దమకును గొప్పరపు సోదర కవులకును వైషమ్యము లేర్పడి ఉత్తర ప్రత్యుత్తరములు నడచినవి. మాగ్రామములో తమ తమ మధ్యవైషమ్యము లేర్పడుట మాకు మిక్కిలి శోచనీయముగానున్నది. తమరును కొప్పరపు కవీశ్వరులును మాకు గౌరవార్హులేయగుట మాగ్రామమునుండి వాగలను మిమ్ములను నైక్యపరచి పంపుట మాకు యుక్తమనియు గౌరవమనియు దోచుచున్నది. కావున మాయుద్దేశ్యమును మీరును అంగీకరించి మీరాసభ మొదలింతవరకు నొండొరులంగూర్చి వచించినవియు లిఖించినవియు మరల్చుకొనుచు నొకరినొకరు లిఖితరూపముగ తెల్పుకొని యెప్పటి స్నేహభావ మవలంబించిన మేము మిక్కిలి సంతసించెదము. మావిజ్ఞాపన నాదరించి మీవైషమ్యకారణములను మరచి మాకు సంతసము కూర్పుదురని నమ్ముచున్నాము.

గుంటూరు. }
4—9—11 }

చిత్తగించవలెను.
ఇట్లు తమ విధేయులు.

యేకా రామయ్య, జి. రామనాథయ్య. వంకిపురం కృష్ణమాచార్యులు. న్యాపతి హనుమంతరావు. కొండ వెంకటప్పయ్య.

## యశఃకన్యకాపరిణయము.

సీ॥ తారతమ్య మెఱింగి తరలి వచ్చెడియూరు కొప్పరంబం జెఱుంగుదురు మీరు
తప్పెటల్ మ్రోఁగంగఁ దరలి వచ్చెడియూరు కొప్పరంబం జెఱుంగుదురు మీరు
తరుణశాఖరముగాఁ దగలి వచ్చెడియూరు కొప్పరంబం జెఱుంగుదురు మీరు
తగుబాంధవులతోడఁ దరలివచ్చెడియూరు కొప్పరంబం జెఱుంగుదురు మీరు
తే॥ గీ॥ తిరుపతియొ? కన్యకాదాత తెరువు వదలి, వచ్చుచో నింతయాతిథ్యమిచ్చు రాక
యున్నచో నప్పుడే పెండ్లి యున్నయయ్యె, నుకరువారింవనేటికో యోగ్యులార. 1

సీ॥ కలదాక్ష్యఁ దూఁగుదురు కలిగెఁ బెండిలి కాకమున్నె వడుగు గాక మున్నె మాకు
నాంధ్రగీర్వాణభాషాంగనాతిలకమ్ము లిరువు రక్కున్నయ నెత్తి పెంచి
రీడేటి నెందఱో యీకన్నెఁ బెండ్లాడఁగా నెంచి యత్నించి కడకు దీని
చే నీసడింపుల నూనిపోయిరి తల నరయంగఁ దఱియయ్యెఁ బరిణయంబు.
తే॥ గీ॥ లేకయే పోయె ననుకొనుపాక మెఱిఁగి, కొప్పరపువారు తరలి రాఁగోరి రంత
వంతసించితి మంతనే జాఱఁదాడఁగి, రూగకుంటిమి తప్పేమి యోగ్యులార. 2

సీ॥ 'తల నరసిన నాతిఁ గలయుట కామశాస్త్ర విరోధ' మని మదిఁ దలఁచిరొక్కొ?
'ఉభయభాషలు నేర్చు నువిదఁ బెండ్లాడఁగాఁ దగ' మంచు లోలోనఁ దలఁచిరొక్కొ
'పెక్కుమాటలు నేర్చు పెంకెపిల్లను గొన్న మాటదక్కు' దటంచు మానిరొక్కొ
'ఎందఱో వంకిన యొమ్మెలాఁడినిఁ గొన్నఁ బరువు దక్కు'టంచుఁ బఱచిరొక్కొ
తే॥ గీ॥ 'కట్నమే చాల' దనుకొని కనలిరొక్కొ, వారు గోరిన దిచ్చు మానేరమేమి
ఎట్టులో పెండ్లి పొసఁగించితిమి మైన. దన్యమునఁ బండితులఁ దన్పఁ గలుగుపుఁడయ్య. 3

సీ॥ వియ్యమ్మునకు వారె విందుల నంపింపఁ దుల లే దనుచు మున్నె పలికినాము
"కాదు కూడ,,దటంచుఁ గాల్పెకల్పు కరాగ "మంచిదే" యని సమ్మతించినాము
ఒకమీసమే కట్న మొలిపైఁ గోరఁ దక్కిన మీసమును గూడ నునిచినాము
కన్యావరణదాఁకఁ గార్యంబొనర్చితి మంతలో సుముహూర్త మగునటంచు
గీ॥ దలఁచుచుండఁ బురోహితుల్ దగినవారు, కావలసి వచ్చి రంతటఁ గాలివాన
వచ్చి కథయాఁగె విందలి పొచ్చె మెఱిఁగి, యేలనెవరెట్టెదరు మమ్మహీసులార. 4

సీ॥ "ఎంత మీనమ్మైన నివి వెండిప్రికలె,,యంచు నీసడించిన రోసమేమి మాకు
"వైదికకన్యక వలదు వైకొను,,టంచు నీసడించిన రోసమేమి మాకు

"శాస్త్రంబు చదివిన సతియేల మా కంచు నీసడించిన రోసమేమి మాకు
"ప్రాచ్యవంగడపు మీయింతి మాకేల,,యం చీసడించిన రోసమేమి మాకు
గీ॥ మొదటఁగోరిరి పిమ్మటఁ జదువు నందె, లెతిఁగిరో? యేమొ వెనుదీసి రెండుకేని
నమ్మతించితి మింక మీరెన్నిమ్మిగూర్పఁ; బూనుటది పునరుక్త మోజ్ఞానులార 5
సీ॥ రుద్రాక్షపూస లటుతఁ దాల్పువారికి బంగారు వారి కేబాంధవంబు?
పెలిబూది దాల్పువారలకుఁ దిర్మణి తిరుచూర్ణాలవారి కేచుట్టఱికము?
"ఇత్యర్థలితిభావ,, లెవేళఁ బలుకు వారలకుఁ దెల్గులతోడ రాజియేల?
గురుపాదసేవఁ జేకొనినవిద్దియకు బాజారు విద్దియతోడ సఖ్యమేల?
గీ॥ ఏడ 'తిరుపతి, 'కొప్పరం,బేడ సహాహా, ఆహావమె కానిమఱి వివాహంబె కాని
స్నేహమే కాని మాకెల్లుచెల్లుఁ జెపుఁడ,నరసులార, గుంటూరువాస్తవ్యులార 6
సీ॥ గోదావరీనదీ కూలమ్మునకుఁ గొండవీటి కూవమ్ముతో నేర మేమి?
ఆమ్రాదితరుజాల మలరుతోఁటలకు గోఁగాకుభూములమీఁదఁ గాఁక యేల?
ఎచటఁజూచిన నిత్తులే వాల్చుపొలముల కేలయ్య? జొన్నపొలాల చెలిమి
తిరుపతివేంకటేశ్వరున కంకాలమ్మ జాతరమీఁది విశ్వాస మేమి?
గీ॥ ఇంతకును గాలుద్రవ్విన దెవ్వరో యొ,ఱుంగుదురు మీ;రలెవరిన్వరూపమెట్టి
దో యెఱుంగుదు రరక యేకోవిధమున, మమ్ము నెపపెట్టనేల? యోమాన్యులార.7

చ॥ పదపడి కొన్ని పద్దెములు పత్రికలోఁ *బ్రకటించి సంశయా
స్పదులగు లోకులం దనిపి ప్రాజ్ఞుల సంధికిఁ గొల్పు రాగ్యులన్

---

(*1911 సం, అక్టోబరు 20, 28తేదీ కృష్ణాపత్రికనుండి.)

పైసంతకము లొనర్చినవారికి నమస్కారపూర్వకముగా మా యొనర్చుకొను వినయపూర్వక పద్యమయ విజ్ఞాపనము:—

ఆర్యులారా! 4-9-11 తేదీగల తమ పత్రిక 28-9-11 వ తేదీ సాయంకాలము సుమారు 5½ గంటలవేళ మ॥ రా॥ రా॥ కొండ వెంకటప్పయ్య పంతులుగారు బి. ఏ; బి. బిల్; గొల్లపూడి రామనాథయ్యగారు బి. ఏ; బి. యల్; గోవిందరాజు శ్రీనివాసరావు పంతులుగారు బి. ఏ; బి యల్; అను నీపెద్దమనుష్యులవలన మాకు నంది యపారానందము నొసర్చినది. దానిపైఁ గొన్ని పద్యములు భగవతి తోఁచింపఁగా సయ్యవి యన్నియును దమసన్నిధి కంపికొన దఁలచితిమి గాని

ముదమున నుంచి యచ్చటనె మోదమొలర్పఁ గవిత్వ గోష్ఠి నెం
పొదవఁగనుంటి మాతయిక థోదయముల్ వినుఁడు పేర్మిమై ౧౯౭

(అప్పుడుప్రకటితమైనపద్యములు)

సీ॥ అనవసరమ్ముగా నాననమ్మును గోరి యవధానవిఘ్నమ్ము నాచరింప
"మది యయుక్త,, మటంచు నగ్రాసనాధిపుఁడనిన విమ్మటఁగూడఁ బెనఁగబోము
పెనఁగియుఁ బద కది గొనలేక సభవీడి యవలి కేగి యసూయనందఁబోము
అందియు నాటకాభ్యంతరమ్మున నుండు నప్పుడు పద్యమ్ము లంపఁ బోము.

గీ॥ ఎఱుఁగరే మిమ్ములఁబట్టి యెట్లొ ప్రేలఁ, బడము దుందుడుకందము పలికినట్టి
పలుకుమాఁదులోకమ్ములనిలిపికొనఁగఁ, జాలుదుముపండితులయొద్ద సరసులార!

సీ॥ ఒకని పెండిలిలో మఱొకఁడు దానల్లకీ నిఱుక నుంకించు టెంతేనిఁ దప్పు
ఎఱుఁగక యర్థించిరే యంద మాపైనిఁ దెలిసియుఁ బెనఁగు టెంతేనిఁ దప్పు
అధ్యక్షుఁ "డిది తప్పు,,దంచుఁ జెప్పినమీఁద నేని యాగమి మటెంతేనిఁ దప్పు
అక్షరతత్వంబు నరయ కాపై భీతి దీటి కాల్ద్రవ్వు టెంతేనిఁ దప్పు

తే॥గీ॥ "మీనముల,,పద్యతాత్పర్యవాసనయిను,మంత తెలియక ప్రేలాడు టెంతయేని
దప్పు "తప్పని,,నేఁ జెప్పటొప్పగాదు, పండితులచేతఁ జెప్పింపవలయుఁ గొండు

సీ॥ తిరుపతి వేంకటేశ్వరులకుఁ బయ్యను గొప్పరంబునవారి గొప్పఁదనము
ఆంధ్రగీర్వాణభాషా ఽవరత్వము గ్రామ్యభాషాపథూటిప్రభావగరిమ
సనియమాశుకవిత్వమునఁగల్గు శోషం బనియమాశుకవననిర్ణిద్రమహిమ
అవ్యాజరచనాతపోన్యత్వమును బూర్వసంచితపతనవ్రిశస్తతయును॥

గీ॥ సభయొనర్పనమైఁగదా! సహృదయహృద,యాపగతముగుఁ, గాల్ద్రవ్వుటలఁ తి
వారు,సేయఁదగు కార్యమా!యెంత చేపయేని,నుండియేతీరవలెఁ గొండిరూగ్యులార!

---

గ్రంథవిస్తరభీతియును విలువగలతమ కాలమునకు లేనిపోని పని గల్పించినవార మగుదుమేమో యను సందియమును వెనుకంజ వేయించుటచే నందలిదశాంశమును మాత్రముఁ బంపికొనుచున్నారము. ప్రాని పంపినచోఁ దమకుమాత్రమే యుండ లి మంచిచెడ్డలు బోధపడును గాని యావదాంధ్రలోకమునకును బోధపడవని పత్రికాముఖమునఁ బ్రకటించికొంటిమి. ఇందుఁగలతప్పులనుమన్నింప వేఁడుకొనుచున్నారము. (తిరుపతివేంకటేశ్వరులు)

సీ॥ ఊరూర నూరేగు నుత్తరప్రత్యుత్తరముల కేలాగు నాశము ఘటిల్లు,
నొప్పు తప్పుగఁ దప్పు నొప్పుగా లిఖియించు "సత్యవాదుల" వ్రాఁతసమయు టెట్లు
ఇహాపరమ్ము లెఱుంగకే ప్రవర్తించు "యథార్థవాదుల" థార్ష్ట్యమడఁగు టెట్లు
తిరుపతికన్నఁ గొప్పరమెక్కుడనెడియీ పాటిబండలగోల దాఁటు టెట్లు?
తే॥ గీ॥ ఊరకే స్నేహమునుగూర్పఁ గోరినారు, మీరమాయికు, లివియన్ని యెరికతనఁ,
గల్గెనో యింత యోజింపఁగా భవద్ధ్య, నత్వము సహింతు మింక విజ్ఞానులార॥౮॥
సీ॥ అక్కటా! కవులకు నపయశంబబ్బెఁగా! యనెడి మీహృదయంబు నరసినాము
అది యాసనప్రసంగాధీనమనెడిమీయాశయం బాసాంత మరసినాము,
ఆప్రశంసను దెచ్చు నమలాత్ములెవ్వరో ఆమూలముగ మున్నె యరసినాము
ఈ సఖ్యమొనఁగూర్చు యిందుమూలమున వారనఘాత్ము లగుపూన్కి నరసినాము
గీ॥ ఆవులించినఁ బేవుల నరయఁగలరు, కవులు, రవి యెఱుఁగనిచోట్లు గాంచఁగలరు
కొప్పరపుసోదరులె యెఱుంగుదురు సకల, మక్కటా! యాసనంబెంత చిక్కుదెచ్చె
సీ॥ "ఒడ లెఱుంగనిసిరి మున్నదే" యెందేని మాశక్తి నెఱుఁగమే మాన్యులార?
ఈఁతమ మించులోఁ దెంచేఁ గలదె? కా నిండయ్య యొకసారి నిండుసభను
వైదికత్వమున కేవం బేటి కెట్లొ మీసాలు దీయుంపుఁడీ నరసులార
విద్వద్ద్విసూదనుల్ విసుటగ్రామమున కేమపయశమ్ము నుగూర్ప వరయుఁ డనఘు
తే॥ గీ॥ లార! సత్యవాదులును, యథార్థవాదు లిప్పరమ్మునఁ బుట్టు టెంతేనిఁ దప్పు
గాని విద్యలలో నేరుఘను లౌనియెఱుఁగు। పూనికలు తప్పగావయ్య పూజ్యులార!
సీ॥ "కాశీకృష్ణబుధుంపు కరమందు లిఖియించినన్నఁ జేసిన', దెంతసత్యమయ్య!
"అభిమానమున మమ్ము నర్పించిరే కాని "శుద్ధమూర్ఖులె" యంట నూనృతంబె?
"రామకృష్ణులఁ బట్టె రహిఁ దిట్టినా' రన్న వ్రాఁతయెంతటి సత్యవంత మయ్య!
"సలుబది మందికే సలిపి రివ్వా" రని వెక్కిరించుట యేటిఘక్కి యయ్య!
తే॥ గీ॥ తమరెఱుంగని దింక లేశమును లేదు। ఆసనమె తెచ్చిపెట్టె నీయనృతములను।
నిజముదెల్పి యశమ్ముచే నెగడరయ్య! వలదు జంపింక గుంటూరు వాసులార
సీ॥ "కృష్ణలో" వ్రాఁత నిష్ఠేని మీరొకసారి పరికింపుఁడీ హితవాదులార।
"దేశమాత"యొసఁగు దివ్యోపదేశమ్ము లరయుఁడీ యొకసారి యార్యులార।
"ఆంధ్రకేసరి" లోని యంశమ్ము లొకపరి చూడుఁడీ యిష్టేని శుద్ధులార
తక్కుపత్రికల యథార్థంపు వ్రాఁత లింకేనిఁ జూడుఁడి మహాజ్ఞానులార॥

గీ॥ సభను జరిగినయట్టి వాస్తవమదెట్టిది, దెట్లువ్రాయుచున్నారొ, యెఱింగి శాంతి
చేయఁ డీవ్రాఁతప్రోలికిఁ జెడ్డయశము, గూర్చు నిజ మెట్లొ పైకి రానేర్చునేని.

సీ॥ వేనవేల్ సత్యవిజ్ఞాను లుండియుఁ జెడ్డకీర్తిఁ గొనునె గుంటూరుపురము
సభ నున్న మీవంటిసరసులకన్న నాకాశంపు సూర్యుఁడా? కర్మసాక్షి
పంచభూతముల మాపాండిత్యతత్త్వంబుఁ జెప్పఁగా నవ్వించెదరె పౌరు
లెవ్వరో యొకరిద్దఱే హేతువై పురమ్మున కప్రతిష్ఠ రాఁబోలునయ్య.

గీ॥ 'రజకువాక్యమ్ములనువిను రాము'లౌట, యుచితమయ్యమీవంటియోగ్యులకు సకల
మెఱిఁగినందుకు ఫలమేమి? యిట్టిపట్టు, నందు దాసీనులగు టెంత యర్హమయ్య

సీ॥ "ఆసనం బొప్పలే"దని కోపగింతురా? అది గోరుటే పెద్ద యనుచితంబు
"అనుచితం"బనుట కేయాధారమందురా! కొంపంపుకని దాఁచికొనుటెసుండు
"అనుచితంబగుకోర్కె ఘను"లెట్లుకోరువా రందురా! అది ప్రమాదాతిశయము
మఱిప్రాజ్ఞులకును బ్రమాదమాయందురా! $ "వారికే",యంచునిర్ధారణంబు.

గీ॥ చేసి వ్రాసిరి వ్యాఖ్యాతృశేఖరులు, పద. వాదములు విశ్వసింపమిమాకుఁ దప్పొ
యంతమాత్ర తానగంతులకనుమతింత్రె, సోదరులు చెప్పుఁడయ్య! యోసుమతులార.

సీ॥ ఉచితమో యనుచితంబో చేయుపండితుఁ డగయుఁ గావలె భవిష్యత్ప్రశంస
అని * భర్తృహరిచెప్పుటైనఁ జూడక యేరిపేరణమ్మునను దుర్వారులగుచు
గాల్ద్రవ్వి యెన్నియోగాఱులు ప్రకటించి తలకుఁదగని ప్రయత్నము లొనర్చి
"పండితసభ"యన్నపైఁ గొంత శాంతించి పద్యంబుకొకింత వ్రాఁతయందుఁ

గీ॥ జూపి, ప్రాజ్ఞులసమ్మతి పాపకార్య, మనుచు మము వెక్కిరించిన యట్టివారి
సఖ్య మది మాకు లేకున్నఁ జచ్చిపోము, వృథగ నెపవెట్టకుండు సుప్రథితులార.

సీ॥ 'ఓంశాంతి'యనెడుమీయోగ్యత వేనోళ్ళ శ్లాఘింపవలెఁ జుండు సగసులార
ఈయూహ మీకప్పుడే పుట్టెనేని మీసములమీఁదికి వారు చనరుసుండు
అంతకొక్కింతపైనైనఁ బుట్టినవాఁడు "కుచమర్దనములు" పేర్కొనరుసుండు
సకలమ్ము జరుగుపై శాంతిఁ జెప్పుటకన్న నన్యాయ ముండునయ్యా! మహాత్ము

---

$ శ్లో॥ ప్రమాదో ధీమతాము" పీత్యత్ర, అపిశబ్ద ఏవకారార్థక ఇత్యభియుక్తాః.

* శ్లో॥ ఉచితమనుచితం వా కుర్వతా కార్యజాలం, పరిణతిరవధార్యా యత్నతః
పండితేన. (భర్తృహరిమా)

గీ॥ లార! విద్వత్తులోఁ దప్ప నన్యవిషయ, మందుఁ గొప్పింపువారిసఖ్యంబు మాకు
సమ్మతము, దానిలోఁ గూడ సమ్మతింతు, మేలి భారతి మమ్మింక నీసడించు.

సీ॥ చౌరవమైన నెదిరించి సొంతకాయకోఁతలు కోసినారు కటార్లు దూసినారు
అవధానమందు మిమ్మతిశయించెద మంచు వ్రాసినారు సవాళ్లు చేసినారు
మీఁది మీఁదికివచ్చి మీసాలపైఁ జేయివేసినా రైదుగుడుల్ గూసినారు
మసిపూసి యెట్టులో మారేడుగాయఁ గాఁ జేసినా ర్కత్తి స్మైడఁ బాసినారు

గీ॥ పెనఁగి మామీసమింతేని వీఁకఁ గుండ, నెదిరియవధానమున నమ్మఁగదుముకుండ
నేటి సఖ్యంబు మాకు? మీ కేటి భరము, సభను సమహూస్వుఁడయ్య! యశస్వి గార.

సీ॥ బందరేమయ్యనో? "పత్రిక" లేమయ్యెనో? పుస్తకా లేమయి పోయెనొకొ
అచ్చేమి యయ్యెనో. ఆస్తి యేమయ్యెనో? వర్తకం బేమి కావలసెనొకొ
"సూక్ష్మ" లేమి యయ్యెనో? బాకులేమయిరొకో? యుద్యోగమేమూల నుండెనొకొ
ఇల్లేమి యయ్యెనో! యితరమేమయ్యెనో? మిత్రవర్గంబు లేమి యయిరొకొ

గీ॥ వచ్చినదె రాశి యయ్యె నీపాటికేము. నెలవు సైకొనుచున్నాము స్నేహభావ
ముఁ చి పంపింపుఁడయ్య! యేముండె! "నడ్ల, గింజలో బియ్యపుంగిఁజ" గేస్తులార.

సీ॥ శ్రావణమాసానఁ జనుదెంచితిమి భాద్రపదమాశ్వయుజము నిప్పట్టణమునఁ
బూర్తిగాఁ గడచె నిప్పుడు కార్తికమువచ్చె నిప్పటికేని మాకింటి కేగు
నిచ్ఛ పుట్టుట లేద, యిదియెల్ల నీసీమవారియాదృతియు నుదారమైన
మీస్నైతియు నమాదు § మీసాల మహిమయుఁ గొప్పింపువారి మిక్కుటపుఁ జేర్మి

---

☞ ఈక్రింద నుదాహరింపఁబడు పద్యములు, ప్రకృతము మద్రాసులో బి, యే (B, A. Honours) చదువుచున్న శ్రీ వారణాసి శ్రీనివాసరావుగారు తత్కాలమం దంపిన 200పద్యములనుండి సంగ్రహించి కైకొనఁబడినవి, గ్రంథవిస్తరభీతిచేఁ గొంచెముమాత్రమే యుదాహరించిన సమ్మ్వారు మన్నింతురుగాక.

§మ॥ తొలుదొల్తన్ గలనూఁగు లేఁ జెమటనెంతో కాంతులన్ గుప్పఁగ్రై, తలఁ జెప్పించితి ధారుణీపతుల హృత్పద్మంబులొప్పార ని, శ్చలవాగ్ధోరణిమారుతిక్రమము సాష్టాంగంబుగా వ్రాలఁగా. బళిరా! మీనమనీతు నీవసరి దిప్పన్ జెల్లురా ని

గీ॥ యనుజుండీ! లేకయున్న మేమొకటనింత, కాలముండుటెప్పట్లునఁగల్గుటెట్లు
తక్కిన ప్రసంగములకేమి దైవకల్పి, తమ్ము లాజ్ఞ యొసంగుఁడీ ధన్యులార.

సీ॥ ప్లీడర్లమా? కాము, బీ.యేలమా! కాము, ధనికులమా? కాము ధన్యులార!
అర్థులమా! కాము, వ్యర్థులమా! కాము, ప్రభువులమా! కాము, ప్రథితులార!
దీనులమా! కాము, మానులమా! కాము, హీనులమా? కాము, మాన్యులార!
శుద్ధులమా! కాము, బద్ధులమా కాము, వృద్ధులమా? కాము, వేత్తలార!

నిన్నుఁ గన్. మ॥ కలరుర్విన్ గడుసుక్రువుల్ మదవశుల్ గర్వాంధులవ్వారుబూ, తులనేనీతులటంచు రోఁతలను నెందున్ గైతలేయంచు ని, శ్చలదంభవ్రతవిక్రమో త్సుకతమై సంచారమున్ జేతురా, బళిరా! యెల్లెడ,వారిఁగాంచినినుఁ ద్రిప్పన్ జెల్లురా, మీనమా? మ॥ తలమీఁదన్ దలపోసియీసుగొనిగర్వాలాత్మకూరార్థివేంద్రు లసంస్థానములందుఁ బండితులునిన్నున్ దీయయత్నింపను, జ్వలవాగ్వాహినిగొట్టి వేసి తివిప్రాంచత్ప్రాంతితీవైఖరిన్, బళిరా! మీనమ? నీకునీవసరి త్రిప్పన్ జెల్లురా నిన్నుఁ గన్. సీ॥ నీనూఁగు నీవూడ్చనే యూడ్చ వప్పుడే గురుకీర్తి కాపాడికొంటివయ్య, నృపసభాపత్రికరసాన్నిధ్యంబునన్ జైత్రపత్రికలను దెచ్చి ప్రబలితయ్య, ఆశుధారాకవిత్వాశనెల్లెడనేగి యలరారుబిరుదంబులందితయ్య, వాగ్విలాసము దేల పలుకావ్యములువ్రాసి కవికేసరిఖ్యాతి గాంచితయ్య, గీ॥ నిన్నుఁ జెనయఁగ నెవ్వారు నేర్తురనఘ, చాల రటుగాన వెంచంగఁజాలు దీవ, త్రిప్పఁద్రిప్పంగ మఱిత్రిప్పఁ ద్రిప్పఁ ద్రిప్పఁ, ద్రిప్పఁ ద్రిప్పంగ నినుఁ జెప్పి చెప్పవలయు॥ సీ॥ ఏన్గుల నెక్కించి పృథ్వీపతులు గొల్వ నిక్కింపఁ జేసితి నీవ కావె, వాదింపఁగా వచ్చువారి వాదంబుల నీఱుగావించితి నీవ కావె, వర్ణాశనస్థితిఁ బడయ గా దగురాచనెమ్మి నుద్రేకింతు నీవ కావె, మాన్యంబు లిప్పించు మార్గంబుచూపించి నేస్తంబుఁ జాటుదు నీవ కావ, తే॥ గీ॥ మీనమా? గాథ గౌరవావాసమైతి, వెంతఁ జేసితి ముక్కు ముందిఁ కెంతఁ జేయఁ, జాలవెప్పుడుఁగడుఁ బెంచఁజాలియుంను. త్రిప్పఁద్రిప్పంగ నినుఁ జెప్పి చెప్పవలయు. క॥ నినుఁ దీయుపనుగలక, త్తిని జూడను ‘స్పెషలుపేకు, తిరున నేమో, యని కొంకుదు ధరణికిఁది క్కనవచ్చినఁ గాదె? కొంతగాఁడగు శత్రూ? క॥ కానర కూనర నుడి నఁ, తోసిల్లఁగ నానుకయితతో సాగెడిసీ, తీనపు వైనరులేనరి, మీనమ? నినుఁ దీయఁ గలుగు మేధాగతికిన్. చ॥ మన మెటుచాలియుం

గీ॥ కవుల, మిప్పటి 'రూల్సు' కుఁ గట్టఁబడము, ఘనులు * పండితరాయాదికవులు చూపు
త్రోవలం బట్టి పోదుము దేవునైన, లక్ష్య పెట్టము † మాకు వల్లభులు లేరు.
సీ॥ తిరుపతి వేంకటేశ్వరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పునాసనపుఁ జర్చ
అల్లకొప్పరపు సోదరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ

---

దు మని మంచియుఁ జెడ్డయు నెంచకుండఁ బైఁ, జని మనపైకిఁదెచ్చి కొని సర్వవి
ధంబులఁ జింత సేయ నె, య్యనువునఁ బాయని వేనితిమి! యుద్గ్రోకఁ డంత నజాతియుం
టిమం, చున దలపోయుచుండి రిఁకఁ జూడుము కోపము మానిమీనమా. చ॥ కలరు
కవిత్వపార్థులును గల్గుదు రీకవితాభిమన్యులున్, గలరు కవిత్వ భీములును గల్గు
దు రీకవిమాద్రిపుత్రులున్ గలదు కవిత్వధర్మమిఁకఁ గల్గునమస్తము గల్గకుండినన్,
గలుగవె నీవు కృష్ణుఁ డనఁగాఁ దగి దుష్టుల నొంచ మీనమా. చ॥ దుడుకుదనంపు
పోకలకు దోసపుచేఁతల కాలవాలముల్, కడు నెగురంగ నంతకు సుఖంబుగ డి
గ్గెదు వారిపీఁచ మౌ, ప్పడఁపఁగ ఫాలలోచనము వచ్చిన వెంటనె నీవు వత్తు వి, ప్పుడు
దయఁ బూను మాని యలుకఁ బూనక మానుమి నీవు మీనమా, సీ॥ అలబృహద్రిపుశక్తి
దరియనప్పుడ నీళ్లు మిఁగిన విద్యచ్చుమీన మెంత, దుర్యోధనుని గూల్పఁ దోడుగాఁ
కృష్ణుండు మిణిక్రొనవలలాంకు మీన మెంత, వాలినివధియించ వంచనావృత్తిపై మొప్పె
యనిన రాము మీన మెంత, ఇంద్రజిత్తునికీలు నెఱిఁగి తుత్రించుచుదూడ నేసిన సౌమిత్రిమీన
మెంత, గీ॥ నీవ మీనంబ వీమహి నీవ 'కుంతి, తంబు, నాఁగలపలుక నెత్తటినెఱుం
గ, చెప్ప డనయాన విక్రమం శేవహించి జయము గొఁటివి జగతి మీనంపుఱేఁడ,
చ॥ అలఘుకవిత్వకీర్తిఁ గొనఁ నందఱకున్ దరమా నెని మించునె, తులగమకింపనం
దఱకుఁదోఁచునె? తోఁచిన 'జీలుగెత్తు'గా, వెలయదె? మేకుమాటమఱిపించదె పెం
చదె గీరతంబు; నీ, వలుగకు సంస్కృతాంధ్రకవితైకమహాత్త్వమని చాలు మీనమా,
మ॥ సుమనిర్యన్మకరందగంధకవితాశుద్ధాంతభృంగీరవో, పమభక్తప్రతిపత్తితో
వెలయుచున్ బాండిత్యగంధానిలం, బమలంబై తెమలంగ లోకజనసమ్మాన్యక్రియం
బొల్తు వో, కమనీయప్రతిభావిలాసమని నమస్కారం బిదే మీనమా. (13)...

---

* శ్లో॥ మనస్వీ మ్రియతేవాఽపిస్వోత్కర్షం నైవ ముంచతి।
అపి నిర్వాణమాయాతి నాఽనలో యాతి శీతతామ్॥

‡ నిరంకుశాః కవయః

విద్వత్కవీంద్ర సంవిద్విలాసము మీకు జ్ఞప్తిలో నిల్ప నాసనవుఁ జర్చ
కేవల కవుల యకించనత్వము మీకు జ్ఞప్తిలో నిల్ప నాసనవుఁ జర్చ
గీ॥ మేటి యాసన చర్చకు,మీకు సత్య,వాదులకు, మాకును, "యథార్థవాదుల"కును
మఱియు మామీసములకుఁ గొప్పరపుసోద, రులకు,దీర్ఘాయువిడినల్వ పోషించుఁగాక.

---

(పరిశిష్టపద్యములలోఁ గొన్నిమాత్రము.)

సీ॥ కాళిదాసుని మార్గ గరిమంబు నెఱిఁగినవారంచు మిమ్మెంతు ధీరులార
భవభూతి యనుమహాకవి మార్గ మెఱిఁగిన వారంచు మిమ్మెంతు ధీరులార
పండితరాయల దండితన మెఱుంగువారంచు మిమ్మెంతు ధీరులార
ఆంధ్రకవీంద్రని రాఘూటత నెఱుంగువారంచు మిమ్మెంతు ధీరులార
తే॥ గీ॥ పలుకనే పలుకఁ జెప్పట్లఁ బండితులము,పలికినా నిల్పనే గాని భయముఁ గొనఁడు
ఇదియె విద్వత్కవీంద్రుల కింపు పెంపు, మార్గమనిమీ రెఱుంగరే మహితులార.
సీ॥ మాకపకీర్తి సంపాదింపఁగా నెంచి దేశమాతకు మాఱు దెచ్చినారు
మాకప్రతిష్ఠ సంపాదింపనెంచి కృష్ణను నప్రతిష్ఠచే నడపినారు
మాకు దుష్కీర్తి సంపాదింప నెంచి కేసరిని దుష్కీర్తిపాల్పఱచినారు
మాకు దుర్యశము సంపాదింప నెంచి యాంధ్రపుఁ బత్రికకు నపకరించినారు
గీ॥ ఎందఱో "యథార్థవాదు' లిం కెందఱేని, సత్యవాదులిప్పగిదిన జనన మంది
నారు శివరామశాస్త్రి యొనాఁటికిశివ, రాముఁడయ్యె మాకేలకొంపముఁ జెప్పుఁడు.
సీ॥ సఖ్యపఱచి మమ్ము సాగనంపుటకు మీ చేయు యత్నము గడు శ్రేష్ఠ మయ్య
సాగనంపక మున్నె చనువాగమే కాని చుట్టపట్టుల నుండు సూరివరులు
సభలు చేయుటఁ జేసి చనకిందు నిల్చితి మంతియే కాని సభాంతరమున
కింకను సోదరు లేతెంతు రపి కాను గాయత్రి సాక్షి నిక్క మ్మెఱుఁగుఁడు
తే॥ వారి నేమంబు గోరినవారు గాన, సంశయించుచు నున్నారు సకల మెఱిఁగి
నట్టిమాకడ డాఁచ నేలయ్య! వారి, వదలి చిరకాలమయ్యె సహృదయులార.
సీ॥ వ్రాసి యుండంటి రేని వారితోఁ బోరాట మాని కొంటి మటంచు మాన్యులార
వ్రాఁత వ్రాసిన యంత నే తప్పిపోవు నే! కాల్ద్రొక్కు వారి బింకంపుఁ గంపు
కాల్ద్రొక్కి పెట్టిపో నసఁ గొన్నపైఁ గాసి నిదురఁ బట్టదు మాకు నిక్కమయ్య
యీయనూరఁ గాకున్న నేయూరనైన మీసమ్ముఁ బీకుట చూచి సఖ్య మంతఁ

శాస్త్రీయమైనట్టి సరసాత్మ కవిత ధిక్కృతయయ్యెగెలుపోదు లెఱుఁగుఁడయ్య
పదియాఱుకళల యవ్వానితో రిక్కల నెనఁజేయుపూనికల్ గొనకుఁడయ్య
గీ॥ కీర్తికాములరై కవితార్తిఁ బాపి, పక్షపాతుల వ్రాఁతల వలనఁ గలుగు
దేశఘోషంబు నడిపి యుదీర్ణగరిమ। వఱలఁజేలువారుఁడయ్య ధీవరులు మెచ్చ

సీ॥ లేదు శాస్త్రజ్ఞత లేదు కావ్యజ్ఞత సంస్కృతజ్ఞానలేశమును లేద
శబ్దమంజరిఁ గూడఁ జదువంగ లేదయ్యె నదియట్టులుంచుఁ డింకాంధ్రమందు
లేదు వ్యాకరణంబు లేదు పాండిత్యంబు లేదు సారజ్ఞత లేదు శిష్య
లకు భారతాదుల నొకపద్యమేని పాఠముఁ జెప్ప శక్తి నిక్కముగ నేరి
గీ॥ కట్టియయ్యలు మహాంధ్రమందు నెట్టి। మీసములుపీఁకుటకు నెట్లు మీసముల్ మ
హాత్ము లొప్పుదురో? తెలియంగవలయు, సభను సమకూర్చుఁడయ్య యశస్స్వులార

సీ॥ తాఁ జెప్పినట్టి పద్యమునకే నర్థమ్ము చక్కఁగాఁ జెప్పఁ జాలుఁజుండు
తా నుచ్చరించు పదములకే నర్థంబు చక్కఁగాఁ జెప్పనఁ జాలుఁ జుండు
కవనం బనఁగ నేమొ కవు లున్న సభలోనఁ జక్కఁగా జెప్పఁ జాలుఁజాఁడు
పద్యమ్ములటులుంచి గద్యమేయనుకొండు చక్కఁగాఁ జెప్పనఁ జాలుఁజుండు
గీ॥ ఆంధ్రమంతయు వల్వదచ్చాంధ్రమైనఁ, జక్కఁగనుపన్యసించినఁ జాలుఁజుండు
మేమువదలెద మూరకే మీసముల మ। టంచు మీసముఁ దలపెట్టు టర్హమగునె.

సీ॥ మచ్చిష్యుల నటుంచి తచ్ఛిష్యులకుఁ గూడ శుశ్రూష జేసి నేర్చుకొనఁదగిన
పాటిపాండితి లేనివారు మామీఁదికి వచ్చి కాఱులు వ్రాసి హెచ్చుతగ్గు
లెఱుఁగక మీసాల నెత్తి పీఁకెద మన్న మాట కేమర్థంబు మాన్యులార
శాఖాభిమాన పిశాచంబు వైదుష్య మీనేర్చునయ్య యహీనులార
గీ॥ తగినమందులు పక్షవాతమ్మునకు ల। భించుఁ బక్షపాతమునకు లభింపఁ బోవు
“కాలిఁబెట్టినెత్తి నిగోఁకికొనియు, నిప్పు। డేటి రాజీలు మావారి కెఱుఁగఁ జెప్పుఁడి

సీ॥ ఆంధ్రమ్మునందేని యష్టావధానంపు నామ మెత్తఁగ వీరి కేమిహక్కు?
శతవధాన మ్మనుశబ్దంబు నెత్తంగ వీరిదే యూరయ్య వేత్తలార?
నేత్రావధానమ్ము నిగమజ్ఞులదికదా! దానిపే ర్వీరలెత్తఁ దగునయ్య?
నిజమైన శక్తి యుండినఁ “బండితులుగల్గు సభ”యన్న యంత నే జాఱుటేటి
గీ॥ కయ్య! వారుమెచ్చాదరించు టాశుకవిత। యంచ యుక్త మామాత్రమేదైన మేము
విశ్వసింపకయున్నను విశ్వమెల్ల! నమ్మతించుట కొంతేని సంభవించు.

సీ॥ "ఆశుకవిత్వమ్మనందేని మీ రేల విశ్వసింప" రటంచు వేయఁ బ్రశ్న
కుత్తరమ్మాలింపుఁ డూరకే యెల్లెట్లొ "బడబడ" వాఁగు నప్పట్టునందు
నేరేనిఁ జాలుదు రేమానవులొ దాని మెచ్చిన నా మెచ్చు మెచ్చు గాదు
పండితులగువారు "పకపక" నవ్వుదు రవ్వారు నవ్విన నాశుకవిత

గీ॥ అందు వేరొక్క నామంబు నట్టిదాని, కెవ్వఁడీకొను "నిహిహిహీ! యిహిహి, యిహిహి
యిహిహి, యనిపండితులు నవ్వ నిట్టి పూన్కి గొనరు విద్వత్ప్రభులు గనుంగొనుఁడు మఱియు

సీ॥ కట్టుఁబాటులు గల్గు గానంబె గానమో? కట్టువీడినదియే గానమొక్కొ?
కట్టుఁబాటులు గల్గు కాంతయే కాంతయో? కట్టుదప్పినదియే కాంతయొక్కొ?
కట్టుఁబాటులు గల్గు? కాయమే కాయమో? కట్టువాసినదియే కాయమొక్కొ?
కట్టుఁబాటులు గల్గు కవనమే కవనమో? కట్టూడ్చికొన్నదే కవనమొక్కొ?

గీ॥ మీమనంబునం గదే? మేరమీఱి మంచి, చెడ్డలరయక యెన్నరో చెట్టలఱచు
వారి నేరంబు సైఁచుట పాడిగాదు, కూకలిడుఁడయ్య సత్కీర్తిఁ గోరుఁడయ్య.

సీ॥ సంస్కృతగ్రంథవాసనయె లేకున్నచోఁ దెలుఁగుగాదది పెద్దతెగులుగాని
ఆంధ్రరహస్యవైయాత్యమే లేనిచోఁ దెలుఁగు గాదది యొక్క యెలుఁగు గాని
శబ్దశాస్త్రప్రవేశము సుంత లేనిచోఁ దెలుఁగు గాదది మేనినలుఁగుగాని
నాటకాలంకారనైపుణుల్ లేనిచోఁ దెలుఁగుగాదది చెడ్డపలుగు గాని

తే॥ గీ॥ ఈరహస్యంబు నెఱుఁగని వారె మీరు, తెల్గులో నేని వీర లెదిర్చి యేమి
సేతు రనుకొంటిరో? సుంత చెప్పుఁడయ్య, సంధిసంగతి కేమి రూపసరసులార.

సీ॥ ఏపండితుఁడు వచ్చి యివ్వారితో మమ్ముఁ గులఁదూఁచి తనకీర్తి నిలిపికొనెను?
ఏకవీంద్రుఁడు వచ్చి యివ్వారితో మమ్ము సరిఁజేసి సద్యశశ్శాలి యాగునె?
ఏజమీందారు వచ్చి యివ్వారితో మమ్ము నెనఁజేసి తా వన్నెకెక్కఁగలఁడొ?
ఏదైవతము వచ్చి యివ్వారితో మమ్ముఁ బురుడించి దీప్తినిల్పుకొనఁగలఁడొ?

గీ॥ చూచియే తీరుదుము మీఁదఁ జూడవచ్చు, సంధిసంగతు; లెల్లైని సభ యొనర్పఁ
గడఁగుఁడయ్య! వేఱొక గతి గాంచఁబోకుఁడయ్య? వేత్తలరప్పింపుఁడయ్య! యయ్య

సీ॥ చెప్పింపుఁడయ్య! దేశకునొక్కరుని బిల్చి చదువు సందెలు మన శిష్యు కింక
చేయింపుఁడయ్య! యీప్రాయమందు నె శుశ్రూష కావ్యజ్ఞు నిచ్చోట నిల్పి
మాన్పింపుఁడయ్య! "డమాడమాడముడమల్" "పాప్రిజ్ఞు లీపోకలొప్ప" యని చెప్పి
బోధింపుఁడయ్య "యీబుడబుడక్కల" "కాశుకవితాప్రశస్తి దక్క దని నొక్కి

గీ॥ మీకు యశ మబ్బు వారికి మేలుగల్గు, మమ్మెదిర్చినపనికి లాభమ్ము వెంట
నే కనంబడు మాకెంతయేని మోద, మబ్బు సంధియు నామీఁద ననుఘటించు.

సీ॥ వైదికలౌకిక వైషమ్య మెవ్వారు తెచ్చిపెట్టిరొ? సుంత తెలియుఁడయ్య
ఆత్మగౌరవమునకై పాడుపడువారె దీనిఁ బెట్టుదురు సందేహ మేల
తగుగౌరవంబు విద్వత్తకుండును గాని యన్యమ్మునకు నుండ దనుట ధ్రువము
గానఁ "దదన్య లీకక్షకుఁ గారకు" లని యెవ్వరేనియు నవకమాన

గీ॥ రకట? విప్రులు, దేవాంగులట్ల పశ్య, తో హరులయట్ల వెలివెట్టితో ప్రవఁబోవఁ
గావలెనె? దీని మానుపఁగ డఁగుఁడయ్య, సంధి గోరుమీ కియ్యది చనుఁగదయ్య.

సీ॥ ఆంధ్రభారతకర్త యైనతిక్కనసోమయాజిజన్మ స్థానమైనకతన
శ్రీనాథకవిరాజశేఖరు నేలినకొండవీటికిఁ బ్రక్క నుండుకతన
వాక్కృతంపుఁగవుల సంభావించుగద్వాల రాజ్యంపుఁ దోఁపలోఁ గ్రాలుకతన
వెనుకకాలమునందు వినుతింపఁ దగుపెద్ద విద్వత్కవులు దీన వెలయుకతన

గీ॥ నింతకవితాదరంబు మీకిచ్చె మెచ్చ, వలదె గుంటూరిపురిసి విద్వత్కవీంద్ర
జనని, కేవలకవితరసక్రరిణి, దీని, మహిమ మెంతేని శ్లాఘ్యంబు మాన్యులార.

సీ॥ నిందింపనేమయ్యె? నిజమైనసత్కీర్తి గణియించు "సత్యవాదులు" గలారు
గర్హింపనేమయ్యె? గణుతి నర్పించుయోగ్యులుగుయథార్థ వాదులు గలారు
కయ్యాల కేమి? సత్కవికదంబములపై ప్రేమలయింపఁగలనియోగులు గలారు
అభిమానమున కేమి? యాత్మీయుకతన శత్రులఁ గూడ మన్పుమాన్యులు గలారు

గీ॥ ఏరిచే మెచ్చుగొనదు గుంటూరిపురము, సగసతకుఁ దాఁపు బలువన్నెసిరుల ప్రోవు
మాకుమీప్రోలికిని మేరమీఱుసిరుల, నిచ్చు భగవంతుఁ డింకమ మ్మేగ నిండు.

సీ॥ ప్రేమించితిమి మున్నె పెద్దఱికము నిల్పుకొన్నచో వారి కేకొఱఁత రాదు
వారి నేమముఁగోరువారె "యాదవకుల మునకు ముసలము" నాసనపుఁ జర్చ
కల్పించి రదిపూర్వకవిసమ్మతము గామి మాకు నంగీకృతి లేక పోయె
దీని నామీఁద వైదికనియోగపుఁగక్ష గాఁ బొల్పె రెవ్వరో ఘనులు వారి

గీ॥ నెఱుఁగుఁడయ్య! 'యనవసరమిట్టి కక్ష, లింపుగాఁబో'వను చుమందలింపుఁడయ్య
యేరు వైదికులు? నియోగు లెవ్వరి? రొక్క, విప్రులే గారటయ్య! యో వేత్తలార.

సీ॥ ఘనుఁడు వయోవృద్ధఖండపాండిత్యభూషణుఁడు సీతారామశాస్త్రి కన్న
నుభయభాషాకవిత్వోపాయశాలి శిష్ట్లాహనూమచ్ఛాస్త్రికన్న
కృతి యభినవసరస్వతి నేత పట్టాభిశబ్దపూర్వక రామశాస్త్రికన్న
ములుకుట్లకులుఁడు నిస్తులుఁ డాశుకవి గుణశాలి వెంకటకృష్ణశాస్త్రికన్న
గీ॥ మఱియునుంగలశాస్త్రవిద్వాంసులకన్న, మొలచిన వేకొమ్ములితరుల మోములందు?
నవసరము లేనియాసనం బడుగనేల?, చర్చ పెంచఁగ నేల? యశస్వులార.
సీ॥ వేదవేదాంగాదివేత్త చేబ్రోలి వెంకటశాస్త్రుల కెన యన్యుఁ డగునె?
రామమునుగుకులుండు ధీమన్మణియు రామకృష్ణశాస్త్రులఁ బోల నెవని వశము?
కంఠపాఠము నాటకములెల్ల శ్రీనోరి హనుమద్బుధుని కెవ్వఁ డగును దీటు?
అతిశాంతమూర్తి సాహితిపట్టు శ్రీపార్వతీశశాస్త్రికి సాటి యొకఁడు గలఁడె?
గీ॥ మఱియు నెందఱు లేరు ధీమంతులందు, వీరిలో నేరు కొఱవ్రింపువారు చెప్పుఁడ?
వారికే యాసనంబును గోరనేల, చర్చ పెంచఁగ నేల యశస్వులార!.

సీ॥ కవి హూణభాషావగాహి వంకిపురవంశజుఁడు శ్రీకృష్ణమాచార్యకన్న
బలిజేపల్లి కులసంభవుఁడు కవిత్వవిస్ఫూర్తి లక్ష్మీకాంత సుకవికన్న
సకలకళానైపుణికిఁ దావు మేటి మల్లాది వెంకటసోమయాజికన్న
నాఱునేలనియోగి యనఘ జూపూడివంశజ హనూమచ్ఛర్మశాస్త్రికన్న
తే॥ గీ॥ మఱియునుంగల సత్కవిమణులకన్న, లౌకికాగ్రణులకన్నను లాఁతివారి
కాసనము గోరనేలయ్య! యనుచితముగఁ, జర్చ పెంచఁగ నేలయ్య సరసులార?

సీ॥ శొంఠి భద్రాద్రిశాస్త్రులవారిశిష్యుండు తచ్ఛైలి గలకైత దనరు సుకృతి
"అవధాన మేఁ గూడ నాచరించితి నని స్వయముగాఁ జెప్పికోఁజాలుధట్టుఁ
డొకశైలి నేకాక ప్రకటితంబుగఁ బలుశైలులఁ గవనమ్ము నలుపుజాణ
ఎప్పుడు రచించినట్లే కనుపట్టకే పలుకృతుల్ ప్రకటింపఁ గలయుపాయ
గీ॥ శాలి బ్రాహ్మణప్రభువు నాచారపరుఁడు ప్రథితమంత్రిప్రగడవంశభవుఁడు శ్రీ ఘ
జంగరాయల కేల యాసనము నడుగ?.రౌరులు వీరికి మిన్నలే యోగ్యులార?

మ॥ పటుజంఝానిల ఘోరణీరణరణత్ప్రాగ్భారసన్నాటవీ
తటశాఖాపటలాంతరుద్గతనితాంతస్ఫారఘోరాగ్నిరు
ఙ్ఘటనా ధూపితభస్మసాత్కృతకురుట్కాండంబుతో వహ్నికిన్,
ఘటియింపం దలపెట్టినారు కద! సఖ్యం బార్గవభూమామణుల్.

మ॥ స్వకృతాగఃప్రకర ప్రచారనిహతాపారస్వరూఢ ప్రజా
నికరాత్మైకశరణ్యసర్వధరణీ నిర్ణేతృ తాభాగ్యభా
రకృతాహంకృతితో సుయోధనునితో భ్రాజిష్ణునిన్ ధర్మపు
త్రునిఁ గల్పఁ దలంచినారె? యిది ధర్మ్యం బెట్టులో హా! హితుల్.

సీ॥ "గర్వం"బనెడి మిషగల్పించి దుఃఖంబు దీర్పకో నుంకించు ధీరుఁ డొకఁడు
"పండిత లక్షణ" ప్రస్తావమిషచేతఁ బడదిట్టునట్టి సర్వజ్ఞుఁ డొకఁడు
"పంటకాపనికుత్సవం"బంచుఁ గల్పించి రసఁ బేరుగనుయశో రాముఁ డొకఁడు
"రామేశ్వరీయ"మన్నామంగు పొత్తాన బూతు లేకరు వెట్టుపుణ్యుఁ డొకఁడు
తే॥ గీ॥ మఱియు నెందఱో శాఖాభిమాను లిట్లు, బయలు దేఱియింక నుబయలు దేఱఁ
గలరు కీరితి చేకూర్పఁ గలరు సంధి, కొప్పరపు వారికేటికిఁ జెప్పఁడయ్య.

సీ॥ "ఈలకూరకుఁ బోయి యిల్లటం బున్నట్టు"లయ్యె మావర్తనం బార్యులార!
అలపాశుపతమహాస్త్రాగ్ని హోత్రజ్వాల లాఁగిపోయెను దీన ననఘులార!
కాఁకరపర్తి "శృంగంపుభంగపు" వ్రాఁత లడఁచుపూనిక దీన నడుగుఁబట్టె
చర్ల నారాయణశాస్త్రి "బార్హస్పత్య" మరయువేడుక దీన నంతరించె
గీ॥ గీరతము సారెకుం గోరు గీరతులకు, తూహాలమ్ము నకించుక దొడరె విఘ్న
మిక వ్రాఁతమ్మున, నిఁక నింటికేగ నాజ్ఞ, నొసఁగుడయ్య గుంటూర్పురీరాగ్యులార.

సీ॥ కొవ్రింపువారు మాకుఁ గనిష్ఠులవ్వారి కరయఁగా జ్యేష్ఠుల మగుదు మేము
కొవ్రింపువారు మాకు ఘనశిష్యులవ్వారి కరయఁగా నొజ్జల మగుదు మేము
తత్కృతిత్వంబు "సదరు మరాటా రైలు" "మదరాసు రై"లయ్య మాదు కైత
మిత్రులవ్వారు మెప్పింతు రేము శత్రులఁగూడ మెప్పింపఁగల మొకింత
గీ॥ వయస్సుకా! పెద్దలము మేము, వారుపిన్న, లింతియే భేద మింతకునింత కలహ,
మొందులకు? స్నేహితులమైతి, మింక మీరు, శంక దక్కుండు సెలవు నొసఁగుఁడు మాకు



క॥ ఉరుకీర్తి నరసరాట్పుర, 'తిరవాసుఁడు పంగనామతంత్ర్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావ,త్పరమునతున్ మమ్ము నవ్వయముగఁ దాఁబిలిచెన్

తే॥గీ॥ అతఁడు శాఖాభిమానుల, కహితమైన, తనికిఁ బూనినకతన నప్పట్టణంపు
శాఖలోని గుణాఢ్యులు సాగకుండఁ, జేయవలె నని యత్నంబు చేసిరంబ,

ఉ॥ *ఆపురికేమురేపు చనునట్టికుతూహల మూనియుండ నే
పాపియొకాని యయ్యనఘువజ్జకుఁబోయి "వృథాప్రయత్నమేం
లా పొనరింతు? విప్వరికి నల్లకపుల్ చనుదేరు భీతిలో
దాపర మయ్యె వారి" కని, తా నొగి బొంకి కలంచె నాతనిన్. ౨౦౦

చ॥ కలఁడు ప్రసిద్ధ వంశ్యుఁ డరికాండము నైతము మెచ్చఁ దగ్గధీ
బలమున కిక్కడ యా"వయిశిహాటి" నివాసి, యశస్వి త్యాగి వి
ద్యలకు నిధాన మంబ? కవితా వనితా హృదయంగముండు పే
ర్వెలసిన "రామరా" వనెడి పెల్లముకొండకుఁ డున్నతిన్. ౨౦౧

---

*(నర్సరావుపేట శతావధానపీఠికనుండి.)

...నర్సరావుపేట.

ది 30-9-11

నాప్రియమైన ఆర్. హనుమయ్య గారికి— శ్రీ "తిరుపతి వెంకటేశ్వరకవీంద్రుల"నిక్కడకు దయచేసి వారి కవితానైపుణ్యమును జూప నిక్కడకు రమ్మని యాహ్వాన జేసియుండుట మీకు తెలిసినవిషయమేకదా; వారిని ఆవాహనచేయుటకు తగుప్రయత్నములన్నియు సిద్ధపర్చుకొని యున్నాము. నోటీసులు పంచిపెట్టి సామ్మువసూలుచేసి పెండాలువగైరా సిద్ధముచేసి యున్నాము. వారురేపిక్కడకు వత్తురని నిరీక్షిస్తూయున్నాము. అవధానము రేపు 1 గంటలగాయితు ఆరంభమగునని నోటీసులలో ప్రచురించినాము. ఇక్కడ శతావధానమే లేదనియు, యిది యంతయు నబద్ధమనియు. పి. నరసింగరావు నవరుక్ష్యలను మోసగించదలచినట్లున్న, ఎవరో వారితో చెప్పియున్నట్లు,వినుట మిక్కిలి విచారకరముగా నున్నది, అట్టిమాటమేమెన్నడు తలంచ లేదనియు, యీశతావధానమునై పూనినవారండఱు మరియానగల పెద్దమనుష్యులనియు, మేము రూఢిగా చెప్పచున్నాము. అవధానమిచ్చట జరుగుట యిష్టములేనివారలు పన్నినకుట్రమాటలై యుండునని మేముతలంచెదము. ఈవిషయమై మేమింక వ్రాయవలసినయవసరముండదు. సదరు విద్వత్కవుల మనస్సునగల సంకోచము మీరు నివర్తించగోరుతాము, రేపుఉదయం 9 గంటల రైలుమీద వారు యిక్కడికి దయచేయవలయును. ఈఉత్తరంతెచ్చినవారు ప్రత్యేకించి వారినిక్కడకు తీసికొనివచ్చేనిమిత్తం

చ॥ కలహముపెట్టుమానిసియు గవ్వకు మాలెడివాఁడు గాఁడు పై
నెలమిని వాని నూఁత గొని యెన్నియొ ముగ్గులు పెట్టుచెట్టు నీ
డలమురిపంపుజీవనపుఁడక్క్రియ లాతని పాటి వారె య
య్యలఘుఁడు రామరా వొక్కఁడె యాఢ్యుఁడు సర్వవిధాల నంబికా. ౨౦౩

---

రె॥ పైకిన మనక్క్రియల్ మృషా, ప్రియములు పలుక్కచుఁ నలుపుఁబేరును మాటిచిమా
ఱ నేర్పు సం, ఘయశముకోనసై మిగులఁగష్టమొక ర్పైద, నంచువాఁగు ని, ర్ణయమున
మస్తముం దెలిసి నాస్తికుఁడై యనృతమ్ము లాడు గో, మయజలసేవనాప్తుఁడగు మాన
వుఁ; డాయవివేకితోడ నా, భయరహితాత్ముతోడ నలపాతకపుంజముతోడ నట్టి
సం, శయలవశూన్యుతోడ నలసాహసికాగ్రణితోడ నట్టిమృ, న్మయయుతుతోడ నట్టి
పితృమాతృవిరుద్ధునితోడ నట్టియా, మయముఖుతోడ నట్టిఖిలమాన్యునితో నటువంటి
జెట్టుతో, నియతదురాశుతో జితమనీషివరేణ్యునితో నపాత్రితో, నియమితలజ్జుతో
నెవఁడు నేర్పుఁ బెనంగఁగ ;ఖిమ్ము శంటివా, రియశము నందె యెట్టులొ పరిశ్రమ చేసి
కళంకు నిగప ని, ర్దయుఁ జాయతించెఁగా! అక్కర! దంభ, మహామయవివేక! మార! దు
ర్ణయ, మఖరాతుతగత్రి! మఖరా! కలికాలము! పతి) కామహా, శయులను బోలెమిమ్ముఁ
దన సంచినినిం దఁదలంచెఁగాదురా, మయుఁడు; మయుండుపన్ను నలమాయలు పన్నె
డివీని సాహసో, దయమిటు లేపరివృద్ధిఁగనితద్దయు వానికిఁ జేటు దెచ్చుఁగా, కయతనితో
డ నేమి! కఱకంఠుఁ దెహర్పఁగ వచ్చె నేనియుఁ "భయ,, మనుమాట మాగృహాము వజ్జ
వసించెడికుక్క్రకేని లే, దయు మొనఁ గూర్చు కాళికజయింబెపుడుఁ సమహార్పితీయ
డు, ర్ణయులుహితాశులై చెడి యనాథవివాహాపుమంగళధ్వని, ప్రియముఖులై యడం
గుదు, రుపేక్షరొనర్చు టెహేలు వీరిపై, నీయుఁక మటెంత కాలము నశింపక నిల్చునొ?
చూత మోమహో, దయ! నరసింగరాయని మమతఁ మముఁ బిల్చిన మిత్రునిన్ను నై,
హ్మయిఁ గిమరింతు! మెవ్వఁడో యమేధస్సుఁడే, మన నేమి యా దుర్రా, శయులు నశిం
తుర్రి గాక విలనద్యశమబ్బెడుఁగాక నీకుమా, కయి శ్రమచేసినందులకు నంబిక నీ
కు శుభమ్ము గూర్చు మా, జయమున శోకక్రిశంబముగఁ జకక్రఁగ నిల్పెదుఁగాక
యుప్పారిక, సీ॥ స్నేహితుల్ పిలిపించి చేయించునభకంటె శాత్రవసభయేయశస్త్ర
దంబు, జయము గోరెడి సభాసదులకంటెను బరాజయము గోరెడిసభాసదులె హితు
లు, నీరసపశ్నముల్ గోరువారలకన్నఁ గఠిననంపశ్నముల్ కరము హితులు, స

క॥ అతఁడింట నుండియే వం, డితులం బిలిపించి విద్య నేర్చెన్ శాస్త్ర
స్మృతిముఖ్యసంగ్రంథకళా, గతి నసదృశుఁ డంతెకాదు కవితాన్వితుఁడున్
తే॥గీ॥ నరసరావుపురి శతధానంబుఁ మొదట, జరిగె నందునొకానొక జనుఁడు రామ.
రాజు నడిగి సమస్యవైరంబు కతనఁ, దెచ్చి మాకిచ్చె నది మాకు నచ్చుదయ్యె ౨౦౫

# నరసరావుపేటశతావధానము.

ఉ॥ మాకొఱ కొకబ్రహ్మను సమస్తకళాకరు సృష్టి చేసి యా
వ్యాకరణామృతాంబుధికి వారిదముల్ పొనరించి మమ్ము; మా
స్వీకృతశిష్యులన్ సదులఁ జేసి యశం బనిశంబు నించి లీ
లాకలనంబునన్ నరసులన్ దనియించుపరాంబ నెంచెదన్.

ఉ॥ రెండవసారి యర్జునుఁ డరిందమయాత్రకు నేగుపట్టునన్
ఖండనమందు గాండివము పార్థునిహస్తమునుండి జాఱిన
ట్లాండొకచో స్ఖలద్గతియ నుండిన గేలి నొసర్పకుండ మా
చండిక వచ్చి వెంబడినె సర్వము నిర్వహణం బొనర్చెదున్. వెం॥ శా॥

ఉ॥ "ఎందులకై జనించితిరొ యేపనికై మఱి పూనియుంటిరో
అందులకై శ్రమఁపడక యందును నిందుఁ జరించు టేల" యం
చుం దరిలేనినీదయను జూడఁగ నెంచితి వోమదంబ! యీ
చంగముగా వధానములు సాఁగఁగ నిమ్ముటులేని యీశ్వరీ. తి॥ శా॥

సభ్యులిచ్చినకల్పన.

సీ॥ చుట్టుపట్టుల నెందుఁ జూవట్టదే సింగ మని మనంబున ధైర్యమును వహించి
జంబుకమ్మొకండు జంకింతయును లేక గర్జించె నఁట! "సింహగర్జిత"మని
ఆసమీపస్థకుంజాంతరమ్మున నిద్రఁ గనుచున్న యొక్క సింగమ్ము కన్ను
లర విచ్చిచూచినయంతనే యానక్క వీఁక యంతయుఁ జెడి తోఁక ముడిచి.

---

మ్మన మొనరించు సజ్జనావళికంటెఁ బడఁదిట్టువారె యాస్తవ్రజంబు తే॥ గీ॥ మాక
సుచు నెంచు లోకసమ్మతులె కాని, "శత్రునభ" యంచు మదిలోన జంకిపోఱు,
పంచశతావధానులపంచలోని, వారు తిరుపతివెంకటేశ్వరులు గారు. (తి॥ వెం॥)

తే॥ గీ॥ పాఱిపోయియు "సింగమే పాఱిపోదె," నంచునలవంగఁజొచ్చె యథార్థవాది
సత్యవాదియనాఁచు నిచ్చలునుగడఁగి, యుక్తిగా! శక్తిహీనులదేమొ మ్రొక్కులక్కట. ౮

## సత్కవిత్వము

శా॥ సారాసారవివేకముల్ గలిగి శాస్త్రప్రక్రియాధుర్యనై
పేరుంగాంచిన సత్ప్రబంధవితతిన్ విన్నాణమౌ నయ్యలం
కారాదుల్ గనుపట్ట మోద మిడు, సత్కావ్యగ్రీణుల్ మెత్తు, రే
దోరీతిన్ జెడుగుళ్ల గూయ నదివిందుల్ సేయునే యేరికిన్. ౯

## పృచ్ఛకుఁడిచ్చినకల్పన—కవిరాజవిరాజితము.

తిరుమలలో నలదేవుని భక్తులు తేఁకువమై నెటు పూజలచేఁ
బరమమహోత్సవముల్ పొనరించుచు భక్తిమెయి న్నుతియింతు రటుల్
తిరుపతివెంకటనాముల మమ్ములఁ దీరికమైఁ బిలిపించి మహా
దరమున నూఁరున నేఁగఁగఁ జేసిరి తద్దయుఁ బౌరులు నర్సపురిన్. ౧౦

## చిల్లపెంకు.

సీ॥ ఎద్ది దా నీటిలో నెగురవైచినయంతఁ గప్పగంతులు వైచి గుప్పచుండు
నెద్ది దా వీధిలో నేగుచోఁ గాలిలోపలఁ గ్రుచ్చుకొని బాధపడఁగఁ జేయు
నెద్దానిఁ ద్రొక్కుచో నెగిరి తిట్టుచు ముసలమ్మలు మడినీళ్లు గ్రుమ్మరింతు
రెద్దాని బాలురెంతేఁ ద్రొక్కుడుంబిళ్ళయాటలో నుపయోగమనుచుఁ గొంద్రు
తే॥ గీ॥ అట్టిచిల్లపెంకుదరిని బుట్టి బీఱ, పాదు చేఁదుబీఱను పేరఁ బరఁగుచుండు
దానివర్ణించుచును గవితనురచించు, వారికవనంబు చేఁదుగావలెనేమొ. ౧౧

## దశావతారములు-

క॥ జలచరకూర్మవరాహా,మలనరసింహావటురామమానవరామో
జ్జ్వలబుద్ధకలికిమూర్తిన్, దలఁచెద నే నాదశావతారున్ ధీరున్, ౧౨

## రాజు—కవిరాజు.

ఉ॥ ఆతఁడునూరసార్థి, యితఁ డన్నను నప్పైరసార్థి, శ్లోకసం
పాతమనూహారుండతఁడు, ప్రస్తుతవృత్తమనూహారుండు వి
ఖ్యాతుఁ డితండు, నట్టిఁడ తగన్ బరిశీలనచేయ నిర్ధరా
రాతినృపాలుఁడున్ సుకవిరాజు సరాసరివారలే కదా. ౧౩

ఇప్పటికొండవీటిసీమవైఖరి.

శా॥ జ్ఞానన్నంబులు పోయె నెల్లరకు మెచ్చుల్ గొల్పు మేల్ రాజనా
లన్నంబు ల్లభియించె మిన్నయగుగోఁగా కన్నఁ గర్వమ్మె సం
పన్నంబై తగుహూణపాలనము సంప్రాప్తించు నీకాలమం
దన్నా! జార్జినృపాల! నీదుకృప నేఁ డైశ్వర్య మింకబ్బునో. ౨౨

శార్దూలమార్జాలములను గూర్చి.

శా॥ చాలల్, కన్నులుఁ, గూరుచుండుగతి, మార్జాలమ్ము గా నొప్పరుఁ
కారంబుల్ గనుకొన్న మేనివటిమల్ గన్గొన్న భేదించు బల్
ఘోరాకారము గల్గువ్యాఘ్రములు, నైకొన్నట్టిశౌర్యంబు మా
ర్జారంబుల్ పొసఁగింప నేర్చు నెటు లోజల్ జచ్చి జన్మించినన్. ౨౩

(అవధానాంతమున, ఇతరులుచెప్పిన పద్యములనుండికొన్ని.)

సీ॥ ఆశుకవిత్వంబు నల్లుట జగతికిఁ జవిఁ జూపినట్టియీశ్వరనమఃలు
అవధానసంపద నతిలాఘవముఁజూపి కీర్తిఁ గాంచినయట్టికీర్తియుతులు
సంస్కృతాంధ్రములందు సరిలేనిపాండిత్యగరిమగాంచినయట్టి గణ్యయశులు
ఎలమిరాజులచేత నెంతేనిమర్యాద లందియు, నందుచున్నట్టిఘనులు

తే॥ గీ॥ నాచు నీయవధానమింపలరఁ జేసి, మమ్ముఁ దన్పిరి నిండుప్రేమంబుతోడ
సుకవిశేఖరు లంచను సూరిజనుల. పలుకు నిజమయ్యె నీప్రజ్ఞ పరిఢవిల్ల.

ఇట్లు, భువనగిరిబుచ్చిపరదేశి సోమయాజులు.

క॥ అరయంగ నరసరాట్పుర, వరమున విబుధేంద్రులెల్ల బళిరేయనఁ గాఁ
దిరుపతివేంకటసుకవులు, మురిపమున శతావధానమును సలిపిరొగిన్.

గడియారం వెంకటకృష్ణుఁడు.

చ॥ ఇపుడునజీవులైన మనయెల్లరపట్ల శతావధానపుస్
సుపథము మాడభూషితులసోముఁడు చూపెను వెంకటార్యుఁడీ
విపులను దత్ప్రసిద్ధితనవీనపు నీయవధానమార్గమున్
విపులము చేసి నై కొనిరి విశ్రుతి తిరుపతివేంకటేశ్వరుల్.

ఉ॥ ఇట్టితఱంబు చూపుటనె యొందటో యష్టవధానులెటు గాఁ
బట్టి వధాని యైనప్రతివానికిఁ గూడ ననస్య శక్తిమై

మొట్టమొదల్ తదీయపదముల్ భజియించుటయొప్పు లేనిచో
దిట్టఁడెయౌతఁ డైత గురుధిక్కృతిఁజేసినవాఁ డనంబడున్,

జానపాటి పట్టాభిరామశాస్త్రి,
అభినవసరస్వతీ పత్రికాధిపతి.

సీ॥ "చంద్రుఁ డెవ్వరికైనఁ జల్లగా నుండఁడా? పద్మాలభాగ్య మాపాటిగాక"
వెలుఁగేరికైనను జెలువుగా నుండదా? గ్రుడ్డిగూబలనోముకొలఁది గాక
కలకండతీయనివలపుఁబుట్టింపదా? పైత్యరోగుల పాపఫలముగాక
కోయిలగానంబు హాయిగా నుండదా? విరహులదుర్దశావిధముగాక
తే॥గీ॥ మీకవిత్వంబు మీలీల మీదుఫణితి, నరసులకుఁ గాదె కర్ణరసాయనంబు
సరసతరువతి వేంకటేశ్వరకవీంద్రు, లార! శాశ్వతకీర్తివిస్తారులార.

ఉ॥ కూరిచినారు మంజురసఘూర్ణితదివ్యకవిత్వతత్త్వ సం
పార ననేకకావ్యముల నందఱుప్రాజ్ఞులు మోదమందఁ మీ
పేరులు సర్వదేశముల విశ్రుతముల్ వివరింపనేల? మీ
ధారణకున్ సమస్యకృతిశతంబులు తిర్పతివేంకటేశ్వరుల్

ఇట్లు,
రాయప్రోలు సుబ్బారావు.

సీ॥ ఎవ్వారిశుభనామ మేప్రొద్దు నుడువంగ! శాపచయంబులు పాఱిపోవు
ఎవ్వారి మిత్రత్వమెల్లభంగుల మాకు సుఖమును వృద్ధియు సొరిదిఁజేయు
ఎవ్వారికావ్యంబు లేవేళఁ జదువంగ నాహ్లాద మిడుచుండు ననఘఫణితి
ఎవ్వారి దర్శన మేవట్ల నబ్బిన శారదఁ గాంచినతీరుమీఱు
తే॥ అట్టిజగదేక కవిసింహు లనఘపదులు, సరసముగ నవధానముల్ సలుపఁబూని
పూర్తిగావించి మించి రీపురములోన, వారివర్ణింపఁదరమె యెవ్వారికైన

స్వయంపాకుల సీతారామమూర్తి,
బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి గారిశిష్యుఁడు

చ॥ పరమపవిత్రమై మిగుల భవ్యతరంబగు 'గౌతమీతటిన్
జరలకు లాభిచంద్రుఁడును సత్పథవర్తి ప్రశాంతచిత్తుఁడై

పరభవశేశ్వరంబున నివాసముఁ జేసిన బ్రహ్మశాస్త్రి భూ
సురవరసిద్ధ శాస్త్రములు సుస్థిర తన్బఠియించి వారిస
త్తరమున సన్నముం దినుచుఁ దత్పితవర్గముఁ బోలఁ నిచ్చలున్
పరనరవిత్వమార్గములు సభ్యులు మే లన నేర్చి వారి యు
త్తరుసుపొంది సద్గురుని దద్దయు భక్తి నుతించి వేగమే
తిరుపతివెంకటేశ్వరసు ధీమణు లిర్వురు ప్రాజ్ఞులై భువిన్
దిరిగిరిసర్వదేశములు దేజమెలర్పఁ గవిత్వకన్యకా
వరులయి రాజ్యభోజ్యులయి పందలువేలు సనంగరాని సుం
దరవతకాదిభూషల సుదారధనంబులఁ గొంచు నర్సరా
ట్పురమున కేగుదెంచిరి సుపూజ్యత నీయఁ దలంచు మంజనా
వరతనయా? యటంచు నభివాదన మేను నరింతు మారులిన్

బూరుగుపల్లి లక్ష్మీనరసింహాచార్యులు.

మ॥ చిత్రశాల్మియశతావధానకవితా విద్యార్ణవమారాశి సం
భృతశిష్యాంబుదవాఙ్మయామృతరసప్రీతాఖిలాంధ్రక్షమా
భృతరత్నప్రదనీశావతంసకృతనందిస్తోత్రమాలావిభూ
షితు శ్రీవెంకటశాస్త్రి నేఁ బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్.

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.

అవధానపద్యములేమి, అయ్యవధానాంతమున నితరులు చెప్పిన పద్యములేమి కడుస్వల్పముగా మాత్రమే యుదాహరించితిమి, ఇందు దివాకర్ల తిరుపతిశాస్త్రి, అనుచేవ్రాలుగల పద్యము, అష్టావధానాంతమున, వెం॥ శాస్త్రినిగూర్చి చెప్పినది. ఆయష్టావధానపద్యముల ను, అచ్చయియున్న నరసారావుపేట శతావధానమందే చూడఁగో రెదము. దానివెల రు 0-3-0 లు మాత్రమే.

క॥ అందుఁగల "పశ్య" శబ్దము, సందేహాస్పదమె కాక నరసతరముగా
డెందమునకుఁ దగులదు తత్, సందర్భముకతన దుష్టతకుఁ దావనుడున్. ౨౦౯

గీ॥ పృచ్ఛకుఁడు మూర్ఖుగాన నష్టేమియనక, వైడిపొ డేగి మఱునాఁడు వచ్చి వచ్చు
నప్పుడా రామరాట్పుగనటకుఁ దెచ్చెఁ, "దప్పెటులో తెల్పుఁ" డనెడి వాదమ్ము కొఱకు

క॥ గతదినమే కౌముదిఁ జూ, చితిమే మద్దానికొఱకు, శ్రీకరుఁ డలదీ
క్షితుఁ డటఁ "బశ్య" యనియుదా, హృతిఁజూపెఁ "సూత్ర" ముందిఁ కేమన వచ్చున్,

తే॥ గీ॥ పాపనీపులరామరావల్లబలమయూరి, వాదమున కేగుదెంచి యవ్వానరమున
నలువు నష్టావధానంపు సమయమందు, మరల నడుగంగఁ జేసె నమ్మొఱకుచేత

ఉ॥ అంత కొకింత పూర్వమె* సమస్యను బూర్తియొనర్చి మేము ని
శ్చింతగ నుండియున్ "మునుపు చెప్పితి చూఁగదె? తప్పటంచు ని
ర్ధాంతము సేయఁగా వలయు నానుడి యట్లొనరింపమేని ధీ
ర్ధాంతులు వైరులిక్రుతనఁ దాండవమాడుదు" రంచు నెంచుచున్. ౨౧౦

క॥ అది యెట్లు తప్పగునొకో, తత్పదపాయము చూడకయె పెనన్ సాహసమున్
మది నూని మున్నుబలెఁ "దప్పది" యని పలిక్రితిమి మే మనాతంకముగన్.

ఆ॥ వె॥ "ఎట్లు తప్పు సెప్పుఁడీ?, యని యడిగిన, యంబుపొఱయమమ్ము నడిగె మొఱకు
'ఇపుడు గాదు పిదప నీవని తీరిచి, చెప్పువార' మనుచుఁ జెయ్యలుడిగె. ౨౧౨

ఉ॥ కౌముదిఁ జూచియుండియు నఖండుఁడు రామకవీంద్రుఁ డన్యదు
ర్ధామత కోటించి మది ధైర్యము చాలక మిన్నకుండె నం
తా? ముగిసె నవధానము క్రమమ్ముగ నంతట రాత్రి యయ్యె నా
యామహితుల్ గృహమ్ములకు నమ్మొయి నేగిరి నంతనమ్మునన్ ౨౧౩

ఉ॥ ఏమను నింటి కేగితిమి, యేగెడునంతకె ప్రత్యుత్తరం బొకం
డేమను జుండ తెచ్చె నట నెందును రామకవీంద్రువార్యులు లే ౨౧౪

---

* శ్లో॥ యశ్శ పశ్యతి జగత్సర్వం యోనపశ్యతి సర్వతః, తాభ్యాంభావరమా
త్మానంపశ్యాపశ్యాన పశ్యతః॥ (విస్తరమునకు 'పశ్యాంపుశ్యాం' చూ)

---

శ్రీబ్రహ్మశ్రీ తిరుపతి వెంకట శాస్త్రుల వారికి,

బ్రి॥ ........ రావు వ్రాయున దేమనగా? నిన్నటి దినము శతావధాన
ములో బ్రహ్మశ్రీ ......య్య, అనునొక పృచ్ఛకుడు అడిగిన "పశ్యాపశ్యా న పశ్య

దానిఁ జూచి "రామకవి కంతగ ధైర్యము లేదులే"దటం
చేము మదిన్ దలంచి *ప్రతి యించుక పంపితి మల్లజాబుకున్.

తః" అను సమస్యతప్పని మీరు అనేక పర్యాయములు వక్కాణించి యున్నారు. ఈరోజున ఉదయము కూడా "తప్పలేదని చెప్పిన పండితః డెవ"డని పండితదూషణతో ఉల్లంఘన జేసియున్నారు. ఈరోజున అష్టావధానసమయమున తిరిగి ఆపృచ్ఛకుడే ఆవిషయమును అడుగగా సభానంతరమున మీరు చెప్పిన విషయమును సమర్థించుకొందుమని చెప్పియున్నారు. గనుక మీరు చెప్పినప్రకారం తప్పను చూపించుటకు సామర్థ్యము కలిగిన యడల పండిత సభచేయించుటకు సిద్ధముగానున్నాము. అందుల కీయకొననిచో వ్రాతపూర్వకముగా సమస్యలో తప్పలేదని యొప్పకొనుచు "సమస్యతప్ప అని చెప్పటయేతప్ప" అనిమీరు తెలియపరచవలయునని కోరుచున్నాము. పండితదూషణనివృత్తికొరకై యేడ విధియో ఆప్రకారము జరుపవలయునని కోరెదము. సాహానముగా సభలో పండితదూషణ చేశినందుకై ఇట్లు వ్రాయవలసివచ్చినది. వెంటనే జవాబీయగోరెదము. కాలయాపన ఉభయత్ర కష్టము.

Yours Sincerely,

(ఇంగ్లీషుచేవ్రాలు.)

2-10-11

Narasaraopeta.

---

*శ్రీమత్పరదేతావహ్యై నమః.

మహారాజశ్రీ ......... రావుగారికి

అయ్యా

తమయుత్తరమందినది. అందప్రస్తుతవిషయములు కొన్ని వ్రాసినారు. మేము పండితదూషణము చేయలేదు. అనయమున మాయుచ్చరించినమాటలు విద్యావిషయములు గాని పండితదూషకములు కావు. అదియటులుండనిండు. ఇది పండితవిషయముగాని తమ విషయముకారు కావున నావిషయమై తమకు జ

క॥ మఱునాఁ*మదయమొక్కటియు, మరల నిశీథమున నొక్కటి మఱి యక్లేగొం
టరు లెవ్వరో చే వ్రాలిడి, పురపురఁ బంపియు జవాబుఁ బొందరు మాచే.

---

వాబు వ్రాయుట మాకనవసరము ప్రతివాదులగు పండితులచే వ్రాయించినచో దా
నికి సమాధానమిఁబడును.

3- 10- 1911 } దివాకర్ల తిరుపతిశాస్త్రి.
నరసారావుపేట }

Narasaraopet
3rd October 1911

*మహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్లగార్లకు.

......... రావు వ్రాయునది యేమనగా? మిమ్ము కోరిన పాంశమునుమా
త్రము తప్పించుకొనుచు మీలో తిరుపతిశాస్త్రిగారిచే వ్రాయబడిన జవాబును చూ
చి చాలా సంతసించినాము. "మీరు ప్రచురము చేయురీతిని విశేషములుగలపండితు
లు కా"రనే ఉద్దేశ్యముతో"మిరు తెలియపరుచుకొనన్న సంగతులను సమర్థించుకోగ
లరా"యని మిమ్ము పండితసభకురమ్మని కోరగా అట్టిసందర్భమున సభకు వచ్చుట
కు పూనుకొనదగిన పండితలక్షణమునకు విరుద్ధముగ "సభనునిర్మాణము చేయుటకు
పూనుకొనినవారు పండితులైతే జవాబు నిత్తు"మని పండితలక్షణము గలిగినట్లుకను
పడని యూహనుపెట్టుకొని"వ్రాసినవారివిషయము కా"దని పండితలక్షణమునకు తె
లియగుజవాబు నిచ్చినారు. ఆవిషయమును తమ కేపరదేవత తెల్పినదో తెలియదు.
సమయము మీరుతరి ఈప్రకారము తప్పించుకొనుచు ఛందోలక్షణ అనభిజ్ఞులగు
స్కూలుపిల్లలు మొదలగువారికి మాత్రము శతావధానము చెప్పుచూ పరదూషణ
చేయుచుండుట మాత్రము పండితలక్షణమా? అట్టివారే పండితులని మీయభిప్రాయ
మా? వారితో ప్రసంగములు గలుగజేసుకొనుటయేపండితలక్షణమా? ఇట్టిసంద
ర్భములలో మీరు పండితులనుట కెటులదగుదురో తెలియకున్నది."పండితసభ చేయ
బూనుకొంటి"మని యొకరు వ్రాయగా యిట్లు తప్పించుకొనుటవలననే"మీరుపండితు
లుకా"రని మాత్రముస్పష్టమగుచున్నది. మాపాండిత్యవిషయమును మీరిటుల నిరా
కరించిన మాత్రమున మాకుగల్గులోపమేమియులేదు అందువలన మీకుయేవిధమైన

తే॥ గీ॥ శ్రీరామరాజ్యపత్రికలో నప్రశ్నలు వేసి, పంపుచో నుత్తరంబీయవలయు ననియు
పట్టి "శశ్ఛతి, గాంధతో వాదమేల, యనియు భావించి ప్రతి పంత మంబనేమము

---

చౌన్నత్యమును కలుగ నేరదు. ఇంతటనైనను విజయదశమినాడు మాచే వ్రాయబడి
న ప్రాకారము స్వవచన పోషణసమర్థత్వము గలిగిన పండితన ను పచ్చెదరని తల
చెదము.

(తెలుఁగుతో చేవ్రాలు)

---

నరసారాయునిపేట

3-10-11

శ్రీమహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్లగార్లకు

అయ్యలారా!

"పశ్యాపశ్యాన పశ్యతః" యనుసమస్య విషయములో రెండుదినములయందు
ను "సమస్యలో తప్పు గలదుగాన పూర్తి జేయవీలులే,, దనిమీరు దృఢముగా జెప్పియు
న్నారు పండితులు సాధువని చెప్పినారని తెలియపరచుచున్నను పండితుల నగౌర
వసూచకముగా నింద నల్పినారు సామర్థ్యముగలయెడల స్వవచన పోషకము చే
యుడీయని బ్రహ్మశ్రీ........రాయులవారు మీకు వ్రాసిన నదుత్తరము లిఖ్య
బూనరైతిరని తెలియవచ్చినది పైసమస్యతప్పుగా నున్నదని మీరు పండితలక్షణ
ముగ సిద్ధాంతపఱచినయెడల నూటపదియారు రూపాయలు మీకుతప్పకుండ నిచ్చుట
కును సాధు వని సిద్ధాంత పఱచిన నట్టిమొత్తమే మీరు మాకునిచ్చు నట్లుగను మీరు
ఒడంబడిక చేయునెడల నందులకు మేమంగీకరింతుము పైప్రకారముబూనెదరా,
మీతరఫున జానపాటిపట్టాభిరామశాస్త్రిగారు వచ్చి మాట్లాడగా నీసంగతులతే
మీతో కలసి మాటాడి జవాబునిత్తు మని చెప్పి కాలవిడంబము చేసినందున నీశాకిత
ము వ్రాయవలసివచ్చినది వెంటనేజవాబువ్రాయకోరినాము.

ఇట్లు

......శర్మశాస్త్రి.

......శర్మశాస్త్రి.

చ॥ ఉదయము సాప్రయాణ మపు ''దూరున నేగఁగఁ జేతు'' నంచు సొం
పొదవఁగ యత్నమున్ సలుపుచుండు నెడన్ 'రయి'' లేగు వేళ కి
య్యది తుదముట్ట దేగవలె నక్రీడ యింకొకచో సపస్సు మా
కొదవు కతాన'' నంచు నలయుత్సవ మాఁగితి మంబ! యే మొగిన్- ౨౦౭

శా॥ ''ఊరేగిం పొనరించి తెచ్చితిమి మీ''స్వామి హెయా'' యన న్నేఁడు నిం
పారన్ బంపెద మల్లె'' యంచు నరసింహ రావు లోనైన యా
ధీరుల్ పల్కఁ దొడంగి రెట్లొ యలసద్ధీమంతులన్ మాన్పి కా
ర్యారంభంబునఁ జేసి యేగితిమి మే మానాఁడు గుంటూరికిన్ ౨౦౮

చ॥ పతితుఁడు *''సత్యవాది'' తరువాత నెటో లిఖియించె వాని కే
గతి పరమందుఁ గల్గెడినొ! కట్టఁడి సర్వ మెఱింగి, యునృత సూ
నృతము నడంచి యాత్మను జయించి వృథా వదరు ల్లిఖించు నా
చతురుని సాహసమ్మునకు నల్పవలె న్నతు లెన్ని యేనియున్. ౨౦౯

శా॥ అంబా! యిట్టి యసత్యవాదులకు నీ నావంతయే నల్గ''కా
లంబింపం జన దీరసత్య మవి వాలాయం బెదేరీతి జ్ఞ
ప్తిం బుట్టింపుము, నీవు కోపమున కీ''దేవయ్య'' లేపాటి! కో
పం బూనన్ బవిలేవ, పిచ్చుకల పై బ్రహ్మాస్త్రముల్ నింతురే. ౨౧౦

ఆ॥ రైలు కదలు వేళ రయమున నొకఁడొక్క, ప్రత్యుత్తరమ్ము తెచ్చియొసఁగె

---

*ప రా:—ఈ 'సత్యవాద' తప్పుడు వ్రాఁతను గుంటూరిసీమ, పూర్వరంగము 58 వ పుటలోఁ దుట్టతుదను జదివి, దానిసత్యాసత్యములను గూర్చి మ॥ రా॥ రా॥ వంగనామాల నరసింహ రావుపంతులుగారికిఁగాని వేరొక సంపన్నగృహస్థునకుఁగాని యోగ్యుఁడని మీకుఁదోచిన యెవరికిఁగాని వ్రాసి తెలిసికొనఁ గోరెదము,

---

శ్రీఓంపరదేవతాపతయే నమః

బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరులగార్లకు.

బ్రహ్మశ్రీ .........రాయశర్మ వ్రాయునది.

అయ్యగారా! డైమండు జూబిలీ రీడింగురూం వారు నిర్మాణము చేసిన టుల శ్రీవంగనామల నరసింగరావు పంతులుగారు తమనాహ్వానము చేయుటచే తామి

దానఁ, "బళ్ళ" గోలలేదు, పదపడి గుంటూరి కరిగి దానికిడిలిమంబగు*జాబు.
గీ॥ అంతతోఁ జల్లఁబాఱె నయ్యయ్యబులుపు, పిదప "బావట్ల" వారలపిలుపు కతన
నటకు నేగియవ్వర వాగ్ములలరియొసఁగు, సత్క్రతులుగొని గుంటూరు చనిముదమున.

---

చ్చుటకి విజయంచేయగా రీడింగురూం వారిలో నేనుకూడా మెంబరునౌటచే రీడింగురూం సంబంధము నాకుబోధపడకుండ మీరుశతావధానము చేయబూనితిరి నా కాహ్వానము లేనందున నేను రాసందర్భముగలుగదయ్యె అందుచే తమరుశతావధానులనుచు వచ్చినపుడు మీసామర్థ్యముచూచి సంతసింపకుండుట న్యాయము గాదని తోచి మీరు యథావిధిని శతావధానము పృచ్ఛకప్రశ్నానుసారముగా సంస్కృతాంధ్ర భాషాద్వయములో చేయగలశక్తి మీకు గలిగినచో ఈఆశ్వయుజశు 15 స్థిరవాసరమునకు సరియగు 7-10-1911 తేదీన నేను శతావధానమును మీచే చేయించబూనితిగనుక యాప్రకారమున జరుగబడుటకు మీయభీష్టమును వెంటనే తెలుపగోరినాను ఆప్రకారము మీరు జరిపినచో నూటపదియారురూపాయిలుబహుమతి నిచ్చుటకు సిద్ధముగా నున్నాను.

నర్సరావుపేట
4-10-1911 (ఇంగ్లీషుచేవ్రాలు)

4-10-11 తేదీని 3 గంటలు.

*శ్రీమత్పరదేవతాయైనమః.

మహారాజశ్రీ...... రాయశర్మగారికి } గుంటూరు, క్రొత్తపేట బ్రహ్మశ్రీ శిష్టాహనుమచ్ఛాస్త్రిగారిలోగిలి.

ఆర్యా!

తమ 4-10-11 తేదీగల యుత్తరమందినది. ఇంతకుమున్ను ఇరువదియైదుసంవత్సరములనుండి సంప్రదాయసిద్ధముగాఁ బండిత సమ్మతముగా శతావధానాష్టావధానాదికములు సల్పుచున్నమమ్ము "యథావిధిని శతావధానము పృచ్ఛకప్రశ్నానుసారముగ యథార్థముగా సంస్కృతాంధ్రభాషాద్వయములో చేయగలశక్తి మీకుగలిగినచో" అనివ్రాయుటచే మమ్ముఁ బరీక్షించుతలంపుతో మీరీకార్యమునకుఁ బూనితిరని స్పష్టపడినది. కానిందు మీయభిమతార్థము తీర్తుము కాని మీవంటి

# బాపట్ల శతావధానము.

ఆర్యులారా!

బాపట్ల పురవాసులగు బ్రహ్మశ్రీ కైవారం నరసింహము గారును నూరి వెంకటేశ్వరులు గారును తంగిరాల ఆంజనేయులు గారును ఎడవల్లి కామేశ్వరరావు గారును మున్నగు మహనీయులు పలువు రాహ్వాన మొనరింప గుంటూరు పురమునుండి బ్రహ్మశ్రీ కింకవీంద్రఘటాపంచాననాదిబిరుదాంకిత శ్రీ తిరుపతి వేంకటేశ్వర మహాకవులు 8-10-11 దినమున బాపట్ల పట్టణమున కరుదెంచిరి. దిగంత విశ్రాంతకీర్తులగు మహాకవుల రాక మహానందసంభరితం జేయఁ బౌరులు స్వాగతంబొసర్ప రైలుస్టేషను నొద్దకువచ్చి యెదుర్కొనిరి. కవివరేణ్యులం బుర ప్రవేశంబుఁ జేయించి బ్రహ్మశ్రీ విష్ణుభొట్ల రామయ్యగారి మేడలో విడియఁజేసిరి. పదపడి ఆదినము మధ్యాహ్నమున మంగళవాద్య ఘోష పురస్సరముగాఁ బౌ

మహావిద్వాంసుల దగ్గఱ "యథావిధిని పృచ్ఛక ప్రశ్నానుసారముగా యథార్థముగా సంస్కృతాంధ్ర భాషాద్వయములో శతావధాన మొనర్చిన కష్టమునకుఁ దామేర్పఱచిన వెలమాత్రము బొత్తిగాఁ జాలదు. కావున మాకుఁ జెఱియొక 1116 రూపికలేని యథమపక్షమింగల శక్తిగల్గియున్నచో నీసారి విస్పష్టముగాఁ దెలిపితిరేని మీయభిమతార్థము నెఱవేర్చుట కేవిధమైన యభ్యంతరమునునుండదు. సాధ్యమైనంత త్వరలోఁ బ్రత్యుత్తర మంపుదురుగాక.

దివాకర్ల తిరుపతిశాస్త్రి.
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి. } శతావధానులు.

[illegible] మరా:— చదువరులారా!

ఉదాహరించిన యుత్తరములలోని " (1) బ్రహ్మశ్రీ ......శాస్త్రులవారికి, (2) మహారాజశ్రీ... వెంకటేశ్వర్లగార్లకు, ఇత్యాదిసందర్భములంబట్టియేమి బ్ర॥ ......రావు" అనిస్వయముగా వ్రాసికొనుసూత్రాంశసందర్భముంబట్టియేమి, మఱికొన్ని వ్రిల్లదములంబట్టియేమి, 'బ్రహ్మశ్రీ, వ్రాయుచు నమస్కారశూన్యముగాఁ లేఖవ్రాయుసందర్భముంబట్టియేమి, 'హింశము, లోనగు ప్రయోగశుద్ధింబట్టియేమి, యొకటిరెండుత్తరములను వ్రాసిన మానిసి తెల్విశేటలను దెలిసికొనుఁడు

రులచేఁ దోడ్కొనిపోఁబడి ఘనసుకంపెని పెండాలులో నవధానంబొనర్చి పండి
తజనహృదయాహ్లాదంబుఁ గావించిరి. ......మూఁడవపాదమునులవముగా నాల్గవ
పాదము సంఖ్యనుడివి ఎవ్వరేపాదముచెప్పుమన్న నాపాదము చెప్పుచుఁబూర్తిచే
యుటచే వీరియద్భుతధారణాశక్తి సభ్యులకుఁ దెల్లమయినది. ... సభ్యులలో
నెవ్వరోయొకరు పద్యములన్నియుం జదివినంగాని యవధానపూర్తి కాదని తమ
యసూయను ప్రకటించినను సభ్యులు కాలహరణమున కోర్వలేకైరి. కాని శ్రీ

---

ఇతనిపిమ్మట, నిరువురు 'శర్మశాస్త్రు' లవ్రాలు గలయుత్తరములలోని, రెండవమాని
సిధరించిన, శర్మశాస్త్రి' బిరుదము, 'పండితునకుఁగాని మేముత్తరమీయ' మనుట
చేఁ గల్పించినది. అతనిని మొదటియుత్తరమున 'బ్రహ్మశ్రీ అని మొదలిడి...అ
య్యా, అనునొకవృచ్ఛకుఁడు' అనియే యీకలహప్రవర్తకుఁ డగు "రావు" లిఖించెను,
గానిసమయానుకూలముగానీ'శర్మశాస్త్రి' భూమికనతఁడు వహింపవలసిన వాఁడయ్యె
ను. ఎట్టిమూర్ఖునకేసి యీగుట్టునుగమమే యగుటచే గుట్టుమట్టులెఱుఁగనివారమ
య్యు మేమిది గుఱితింపఁగల్గితిమి, కావుననే యీ'శశ్శోటులకు' మేము జవాబొ
సంగనైతిమి, ఆపిమ్మట నిదితోవగాదని 'అవధానార్థమాహ్వానించువారువలె నిఁ
క నొకయుత్తరమంపిరి, అందలి' పరదేవతాపతి" శబ్దమును, మా 'పరదేవతా' శ
బ్దమును, విచారించినచో మఱికొంతవారి తెల్వి బయలువెడలఁగలదు. అదియటు
లుండె, పాపము? ఏగ్రంథమునందుఁగాని' శశ్న, శబ్దము సాధువు కాదని వ్రాయఁ
బడియుండ దనుదృఢనిశ్చయము రామారావుగారి కుఁడుటచే వారి'శశ్శోటులను
చేరేపియుండురనునది మేము వ్రాయకుండఁగనే ప్రపంచము తెలిసికొనఁగలదు
గాన విస్తరింపఁబనిలేదు సమస్య పంపినవారుగాన రామరావుగారు స్వయముగా
మమ్మడుగ వచ్చును, చెప్పఁగలిగినచోఁదగుసమాధానమును, లేనిచోక్షమాపణమును
మేము చెప్పనువచ్చునుగాని 'చల్లకువచ్చి ముంతదాఁచిన' సామెతగా శ్రీరామరా
వుగారు, ఎందులకును గొఱగానిమానిసులకు 'శర్మశాస్త్రి' బిరుదములను దగిల్చి
యుఁ దగుల్చకయు, అవమానకరములగు నుత్తరములను వ్రాయించుటనుగూర్చి వి
జ్ఞులే విచారించుకొందురుగాక. మాయుద్దేశమునుబట్టి వారిట్లుప్రవర్తింపఁదగువారు
కాకున్నను నట్లు ప్రవర్తించుట భావ్యపజయసూచకమనియు నందులకే దైవమట్లు
ప్రేరేపియుండుననియుఁ బొడకట్టెడిని, ఇందునుగూర్చి, కొన్నిపుటలలో ముందు"
బందరు" అనుశీర్షికగలచోఁ జదువఁదగు

శాస్త్రులవారు మాత్రము కాలహరణమున కోర్వలేని సభ్యులు వెళ్లిపోయినను ఈ సందేహముకలవారు కూర్చున్నచోఁ జెప్పక అన్నిపద్యములను జదివెదమని రి కాని వారట్లుచేయకపోవుటచే ఆపని జరగలేదు. ......తరువాత ప్రశంసాపద్యములతోడను జయజయధ్వనులతోడను సభముగిసినది. ...... తరువాత మఱునాఁడు మూఁడుఘంటలకు సభప్రారంభింపఁబడినది. అందు శ్రీతిరుపతివేంకటేశకవులు లేటు శ్రీ విజయనగరము మహారాజా మొదలగు రాజోత్తములపై రచించినపద్యములును, ప్రతిపదనీతిసారంబగు గీరతంబును గర్ణరసాయనముగ సానన్దయముగఁ జదివి సభ్యుల కానందంబమందంబుగం గల్పించిరి. .. .......,.

ఇట్లు, విధేయుఁడు
కైవారం వెంకటలక్ష్మీనరసింహం.

## పౌరులొసఁగిన స్వాగతపద్యములు.

మ॥ జితనానావిధ బోధశోధనసమష్టి భూతశాకాద్యలం
కృతశయ్యా మధురీతిగీతిఫణితి శ్రీమాధురీసాధురీ
త్యతిభాస్వత్కవితామహాఖురళికావాంయుప్రతత్యౌచితీ
యుతులౌ తిర్పతి వేంకటేశకవి సింహులౌ! స్వాగతం బీయదే.

మ॥ నితరాముద్ధతి భృత్యుత్కవ్యధిప సన్నిద్రప్రతాపార్వజా
లతిరస్కార్వ దహీనవర్షబుధ వేళాలోల నీరంధ్రపూ
రితవాఃపూర ఖగభ్రమభ్రమిత నీవృత్స్వప్రలావర్త్తకా
యిత శ్రీతిర్పతి వేంకటేశకవి సంతీ! స్వాగతం బీయదే.

మ॥ అతిమాధుర్యరసావగుంఫన సమ్యక్పారంభరంభాఫలా
ప్లుత సుస్వాదురసాయనప్రచుర విప్లుష్టప్రణాళీవిని
ర్గతసారస్వత మంజులాశ్రమవణ సమ్యోల్లతాంతాంతవ
స్థిత శ్రీతిర్పతి వేంకటేశకవికేకీ! స్వాగతంబీయదే.

మ॥ కృతవిస్తారమనోహర ప్రచుర నిష్కృష్టోదధారావిసా
రతశర్ధాశధళీవిలాసి సుషమాప్రాగ్భార గోదావరీ
కృతనవ్యామృత పారణోపమితనిష్కృష్టాశుధారాప్రవా
హాతరత్తిర్పతి వెంకటేశ్వర మరాళా! స్వాగతం బీయదే.

మ॥ చెఱుకుందోఁటల తోట నట్టనడుమన్ జెన్నారి చెల్వారు బం
గరు పూఁదేనియ యేటికొత్తరఁగలం గ్రంపుఁ బెందిప్పలం
బఱపై యేపగు మావికైతనడి దీవం గూడి యుయ్యాలహే
ళి రహిం బొల్చెదు కోయిలల్ కవులు! వాలిన్ స్వాగతంబీయదే.

బాపట్ల పౌరులు.

సీ॥ శ్రీమన్మహాకవి సింహాసనల రారు ఘనపుణ్యులార! స్వాగతము మీకు
శ్రీమహేశ్వరీపదకమలసంసేవకమతియుతులార! స్వాగతము మీకు
అవధానమహిమచే నకలంకవిఖ్యాతి గను ఘనులార! స్వాగతము మీకు
తిరుపతివేంకట దివ్యనామాంచిత ఘనకీర్తులార! స్వాగతము మీకు
గీ॥ శారదామూర్తులై యొప్పి సాంద్రమైన, యశము దశదిశలందున నమర నిల్పి
నట్టి మిము శారదాకాలమందుఁ గాంచి, స్వాగతము నిచ్చు పుణ్యంబు శాశ్వతంబు

కర్లపాలెం సూర్యనారాయణ.

చ॥ సరసకలావిలాసయుత చాతురి మీఱ సురాంధ్రభాషలన్
గరము ఘనంబు లౌకృతిక గతిఁ గైత నహోయనుగాఁగఁ జెప్పి సో
దరు లన మేటికారమితిధం బెసఁగం జరియించునట్టి మా
తిరుపతి వెంకటేశ్వర సుధీవరులార! గొనుండు మానతుల్.

చంద్రమౌళి చిదంబరరావు.

శ్లో॥ శ్రీమత్తిర్పతి వేంకటేశ్వర మహావిద్వత్కవీంద్రావుభౌ
నానాభూపసభాంతరాళవిలసత్సత్కీర్తితారావళీ
శ్రీమత్పాణిని గౌతమాదిమునిభిః ప్రోక్తేషు శాస్త్రేషు తౌ
సారజ్ఞౌ చ రసజ్ఞసభ్యసుజనవ్రాతౌ గిరీశోఽవతు
శ్లో॥ కింకవీంద్రఘటామధ్యే మృగరాజయశోన్వితం
పశ్యంతు సకలాధీరాః, శ్రీమత్తిర్పతి కోవిదం
కుకవీంద్రఘటామధ్యే తథా బిరుదసంయుతం
వేంకటేశ్వరనామానం కవిరాజం సుపశ్యత
మాతాపిత్రోస్తు తన్నామ్నాం పూర్వజన్మతపః ఫలాత్
జజ్ఞే తిరుపతికవి ర్వేంకటేశకవి స్తథా

వేలూరివంశసంభూత శ్శివరామాభిధానకః
తయో శ్శిష్యత్వ మాపన్న స్తథా ఖ్యాతిం సమార్జయత్.
శంకర శ్శంకరో నిత్యం భక్తానుగ్రహతత్పరః
సచమాంసభ్యకాన్ రక్షన్ దుమానామార్థజానికః.
చంద్రమౌళిక్రపాలబ్ధా న్వదగ్ధస్ఫటికసన్నిభా
శివరామకవేః ఖ్యాతి ర్జీయా దాచంద్రతారకం
మంత్రవాదికులోద్భూత వేంకటాఖ్యేన ధీమతా
దత్తాని పద్యరత్నాని విద్వద్భ్యో నిర్ధనేన వై.

మంత్రివాది వేంకటశాస్త్రి.

---

గీ|| అందఱు నవచ్చు కతన నాసంధకవిమ, కలుగుట నటుండ్ర శ్రీసూరికులుఁ గు నాకు
గురులలో నొక్కరు సువ్యాకరణవార్థి, గూడ వచ్చు సుబ్రహ్మణ్యసోమవిదుఁడు.

నెలబాలుఁడు.

సీ|| కొండవీటను నుండుకొమరాలి మోముపైఁ బొలుపారు పాపటబొట్టనంగఁ
బడమటిదెసబోటి పలుపుపైఁ బెనిమిటిఁ గనుపఁ దాల్చిన పూవుసండయనంగఁ
దమ్మికిలివ నెలంత యమ్మాయినుండ జాతిలిచ గంపంపు పెత్తికయనంగఁ
సెరిమ నాకస మను పీఠ్లపంజాను,, నిల్పవ ''గాలసాహెహాబుపీ,, రనంగ
తే|| గీ|| నంజమొలనాగ తన చేతినందుకఁగఁ, జెలఁగు గాజులనొకరిపి చేతఁ దెగిన
టోరమనఁగను లెఁత చందురుని రేక, వెలయుచుండెఁ బశ్చిమపరిధియనాఁడు.

చంద్రోదయము.

చ|| కలువ లెసంగఁ దారకలు కాంతిఁ జెలంగ ననంగవహ్ని సొం
పులు గులుకంగ నంగనలు పొంగుచు మేను లలంకరింపఁగా
నలమదనాంతకాంతకపురాంతకమౌళిజటాటవీసదా
కులమగుబాలశేఖరకలకోవిదమాన్యుఁడు పుట్టెవందెముల్.

భారతయుద్ధము.

స్రగ్ధర— భీష్మ ద్రోణశ్చ కర్ణః కురుపతి రనుజాః పాండవా వాసుదేవ
స్సౌభద్ర శ్చేకితానో ద్రుపదధరణిరాట్ తస్య పుత్రో విరాటః

ప్రారంభం తాఽతిఘోరం సమర మమరదృక్తోషదాయి ప్రవీరాః
క్షోణీయం శూన్యరూపా జని తదను మహాభారతానాం క్షయోఽభూత్.

చంద్రకళంకము.

శ్లో॥ నాఽకాశోఽయ మపారవారిధి రిమా నో తారకా బుద్బుదా
శ్చంద్రో నాఽయ మనంతశేషఫణిరాడ్దేహ స్తదంతర్గతః
య శ్చైతేకిల తత్రి నీలజలదాకార స్తదంకో హరి
స్సోయం పాండ్రితరేందుకాంతివిసరః పాథోధివీచీచయః

(రైలుస్టేషనువద్దఁ బ్రయాణసమయమునఁ జెప్పినవి.)

మ॥ సరసీజాలయ నీయెడ న్నిలువ నిచ్చల్ భావనారాయణ
స్థిరకారుణ్యరసాతిరేకమున వృద్ధిం జెందుచున్ మమ్ములన్
స్మరియింపంగదవమ్మ చూపఁగదవమ్మా? నీదయాపూరసం
భరితాంతఃకరణప్రచార మెపుడున్ మావట్ల బాపట్లలో.

మ॥ చిరసౌభాగ్యము కల్గి ప్రాగుదధివీచీమాలికాడోలికా
చరవాతార్భకసేవ్యమాననిజవత్త్వం బైన బాపట్లపూ
రరుణాంభోజదళాక్షి! మాకు నెలవిమ్మా? ప్రోవుమా? యెల్లవ
త్సరముల్ తిర్పతివేంకటేశ్వరనిఖాతంబున్ జయస్తంభమున్. తి॥ శా॥

ఇతరులవధానాంతమునఁ జెప్పినపద్యములలోఁ గొన్ని

ఉ॥ నిన్నటికంటె నేఁడు మఱి నేఁటికి మించియు రేపు సత్కళా
భ్యున్నతి మీఱుమీకవనముల్ బుధకోటికి నింపునింపు సూ
నన్నుతకీర్తులార? విలసద్భవదద్భుత సత్కవిత్వమున్
గ్రొన్ననబోణి నిర్జరతఁ గోమలతన్ దనరారు నిచ్చలున్.

ఉ॥ క్రొత్తమెఱుంగులన్ విబుధకోటి నుతింపఁగ నాఁడునాఁటి క
త్యుత్తమ మాచు మీకవన మొప్పెసలారెడు కారణంబునన్
"క్రొత్తొకవింత ప్రాఁత యొకరోఁ", తనులోకులపల్కు లారయన్
రిత్తల టంచుఁ బల్కు విపరీత మదేటి కగున్ వచింపరే॥

ఇట్లు,
కురుగంటి శ్రీరామశర్మ.
9-10-11.

శ్లో॥ శ్రీమత్ఫణీశ్వరవచోద్ధికృతావతారా,ద్విద్వత్కవిస్తుతసమస్తగుణప్రభారా
భాత్యవ్యయుక్తముఖదోషగణాదిదూరా,చ్ఛ్రీ శ్రీశవేంకటవిట్కవితామహారా

సీ॥ అన్న! తెల్గులసొంపులెన్నఁ దిక్కన్న తిక్కన్న యంచపకీర్తి నందకున్నె
అన్న! యల్లికసొంపుగన్నఁ బెద్దన్న పెద్దన్న యంచొక దూఱు నందకున్నె
అన్న! గుంఫనము గన్గొన్న లింగన్న లింగన్న యం చెగతాళి నందకున్నె
అన్న! ముద్దులపలుకు లెన్నఁ దిమ్మన్న తిమ్మన్న యంచొక నింద నందకున్నె
తే॥ గీ॥ వీరికవితామహాసుధావారిరాశి, ననుచు జనులెల్ల వేనోళ్ల వినుతి సేయ
జగతి యశమున నింపిన సరసకవులు, ధరణిఁ దిరుపతి వేంకటేశ్వరులుగారె.



గీ॥ అరట మఱికొన్ని నాళ్లుండి యనఘులైన, వారలొనరించు విందులతలఁదనిసి
సెలవు పూర్తి చెందుటయు నానీమువిడిచి, యెవరి యిండ్లకు వారేగిరొనకమునఁగ.
గీ॥ ఉండుతఱిఁ గొన్వరపువారినోముదలఁచి, భంగపడిన బంధుగులు *దర్బారటంచు
పత్రికనొకందు ముదలిడి పాడునుడులు, గిలుకఁ దొడఁగిరి తమ తెల్వి చులుకఁ బడఁగ

మత్తకోకిల॥ మంగళం జయమంగళం శుభమంగళం జగదీశ్వరీ!
మంగళం నినుఁ గొల్చువారును మమ్ముఁ దిట్టెడి వాండ్రకున్
దొంగవ్రాఁతలు వ్రాయువాండ్రకు తోడిమూర్ఖులకున్ సదా
మంగళం జయమంగళం శుభమంగళం జగదంబికా. ౧౧౫

మత్త॥ ‘‘పోచిరా,, జాకరుండు బూతులభంగ నోరకు విప్పెదున్
‘‘పేచిరా,, జాకరుండు ప్రేలుడుఁ బెట్టె బైటికిఁ బెట్టెదున్
‘‘చీచిరా,, జాకరుండు చెన్నఁటిచీటిఁ గైతను గోఁకెదున్
కాచి కొవ్విపువారి నెట్టులో గట్టు నొక్కఁగఁ జేయఁగన్. ౧౧౬

మత్త॥ ‘‘శ్రోనిరాజాలు,, కొండ వొక్కఁడ దూలనాడుచు నుండఁగా
‘‘వేసిరాజాలు,, కొండ వొక్కఁడు వెక్కిరింప వలరింపఁగా
‘‘తీసిరాజాలు,, కొండవొక్కఁడు తిట్లు చిట్టుగఁ దిట్టఁగా
వాని కై దదరంగ మానము వైరులాడి రధీరులై ౧౧౭

*ఉదర్బారనునార్చి పూర్వరంగమునఁ గొండొక మాటఁ బడితిమి, ఇది
ంసుకపాఁతయవంటిది దీనిప్రలాపనలు చూచి తిరపల్లయ్యను.

మత్త॥ "పోతురాజులు,, విట్ల వీఁగుచుఁ, "బోకిరీ,,నుడు లాడఁగన్
"బూతురాజులు,, మీరదవ్వుచు బూతు లేకరు పెట్టఁగన్
"ఓతురాజులు," "మేవుమే" యని హుంకరింపులు నింపఁగన్
గోతు *రకర్కటి కోఁత లెన్నియొ కొవ్విపుంగవు లాపయిన్. ౧౧౮

మత్త॥ బండ లాక్కొడఁ బందలాక్కొడ బారు బూరులు నూఱఁగన్
మొండివ్రాఁతలవారు సారెకు ప్రోఁత లేమియొ ప్రోఁగఁగన్
పిండి లేకయె రొట్టెఁ గాల్చుచు బింకముల్ తెగఁ బొంకుచున్
దండుబల్మిని కొప్పరంబు వృథా ప్రగల్భము లాడెడిన్. ౧౧౯

తరల॥ తెలివి తక్కువ యీసు రోసము తెల్లమోమును వ్రాఁతయే
తెలుపు నంచు నెఱుంగ కూరక తెల్లవాఱిన దాదగాఁ
బలుగువ్రాఁతలు మమ్ముఁ గూరిచి బండ్లఁ దోలుచు దాసిచే
గెలుపు కొప్రవువారి కీ గమకించి రాప్తులు కొల్లగన్. ౧౨౦

---

(*ఫిబ్రేవరి 10వ తేది1912 సం॥ దర్బారునుండి.)

4-9-1911 తేదీన, మాకును దిరుపతి వేంకటేశ్వరులకును వైషమ్యములువల
దని యుద్దేశించి తదనుగుణమయిన పత్రికనంపి అందు సంతకములుచేసిన ప్రజ్ఞా
నిధులకు వినయపూర్వకముగా నమస్కారములొనర్చి చేసిన విన్నపము....
సీ॥ ...గీ॥చేసిన ప్రతిజ్ఞఁదప్పకు చెప్పమితర,మార్చుఁడీ సంశయం బానఁగూర్చుఁడి
వళఁ,బంపుఁడీ వార్త దిశలకునింపునింపుఁ,డో సరసులార గుంటూర్ని వాసులార!
గీ॥ పత్రికలఁ దెల్పికొనినమై ప్రతిన లెల్ల, వీఁక నిగ్గించుకొందు మీలోకమందె,
యింత కేమాఁదులో కాలకేగనేల?, వేగ వళఁ గూర్పు సోజగద్విదితులార!,

ఇట్లు

కొప్పరపు సోదరకవులు, శతావధానులు

☞ ఈసాటి కోఁతలు హీరు సంధిపత్రమందుకొనిన ప్రమాణము
లకుఁ బిమ్మటివని యెఱుఁగుఁడు. సారమరయుఁడు, తి॥ వెం॥

మత్త॥ మంగళంబగు నాశుఘోషసమాఖ్యకుఁ బరపృచ్ఛమున్
గంగ నీఁదఁగ నూఁతగాఁ గొను కాకవిద్విజపాళికిన్
మంగళంబు నిజం బెఱింగియు మా యశమ్మును మార్చఁగా
వెంగలుల్ పొనరించు నా యవివేకపుం జెడుగోలకున్. ౨౨౧

సీ॥ ఎండగండిని బట్టి యొండుగండి, యటంచు వ్రాయఁ జొచ్చిరి వృథా వాగ్వ్యయముగ
తమపాటి పోక లోకము లెఱుంగుటయెఱింగియును మమ్ముఁ బాటి రంచనఁ దొడఁగిరి
పృథవుగా నేదేని మేము వ్రాయఁగ దందుడుకు మీఱి తందనాలకుఁ గడంగి
"శతావధానమును జేయక వధాను లెటులైరి," యన నెకసక్కెమ్ములాడఁ దొడఁగి
గీ॥ తకటు లోకమ్ము గుడ్డిదియంచు నెంచి, కించి చెలరేఁగి మమ్ము దూషింపఁ దొడఁగి
రేమి చెప్పఁగ వచ్చు నిశ్శామరోష, దూషితములు కొప్పరపువారి భాషితములు.

క॥ ఇది యిదియుండెఁ బవాదా, స్పదమగు నల "పశ్య" యనెడి శబ్దమ్మునకై
పదరులు పదరుచుఁ బ్రకటిం, పఁ దొడఁగి రొక కొంతమంది పత్రికలంతన్

క॥ 'కాశిక' యనుపేరెఱుఁగని, ధీశూన్యులుగూడ దాని దెగఁదిట్టుచు శా
ఖాశార్యప్రాగ్భరా, వేశమ్మునఁ దఱచుఁ దాండవించిరి జననీ ౨౨౪

గీ॥ రామరావు వ్రాసెడిదనఁ వ్రాయరాద, యుత్తరంబని మిన్నకయుంటిమేము
ఎట్లు వ్రాయ నేమగునొక్కఁ డూరివాడ, మనుచు నాతఁడు పత్రిక నంతఁ డయ్యె.

గీ॥ అపుడు వాయమ్ముదోఁచక యతని పేరు, కూడఁ జేర్చి శిష్యుడు వ్రాయు కొంటె* వ్రాఁత
చూచి యాయన ప్రేరణఁ దోఁచెపుడ్సు, రాక యాతని బుద్ధిదీర్పఁగఁ దలంచి.

శ్రీహయగ్రీవాయనమః.

*బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులకు.

అయ్యా,

మీరు నరసారావుపేటలో యీ సంవత్సరము అక్టోబరు 1, 2 తారీఖుల శతావధానమను పేరుచే 40 మందికి సభఁ జేయునపుడొక పృచ్ఛకుఁడు "పశ్యా పశ్యాన పశ్యతః" అనుసమస్యనిచ్చి పూరింపుఁడనఁగా నానమస్య తప్పని చెప్పి, పృచ్ఛకుఁ "డిది పండితు లొప్పికొనినదియే తప్పుగా" దనిపల్కఁగా 'ఎవడా పండితుఁడు

తే॥గీ॥ కాశికా కృత్తిలోనున్న గ్రంథమల్ల, రామరాయని కెట్లు గంగ ర్వానిదనుచు
నతఁడు వ్రాయించు వ్రాఁతలకర్థ మెఱిఁగి, దాని చేమానుడిని నిల్పఁదలఁచిమట్టియు

క॥ శకలహామునకుఁ బార్శ్వామ్ర్యక, యలఘుఁడు తచ్ఛిమ్ముఁ దెలమినంగాను దోష
మ్ములగని యగు రామకవీ, త్తిలకుని కావ్యమ్ము దాని దెలిచితి మంతక.

ఉత్ప॥ ప్రాజ్ఞుఁడయ్యును రామరాట్కవి ధావిధూగతశమ్మునన్
విజ్ఞులెల్లరు నవ్వకైతను వెళ్లఁ బెట్టెను దానిలో
నజ్ఞు లత్తతిఁ జేయనల్లరి కాతఁ దూఁతము గాఁ పుటన్
దజ్ఞుఁడంచు నెఱింగియుండియుఁ దప్పు లేరిరి మంచి కా. ౧౯

---

పండితుఁడైన నిట్టితప్పనమన్య నేల నొప్పుకొను'నని పండితదూషణ చేసితిరి కదా·
అందుకైఁ గొందఱు పండితులీ నమన్య తప్పుగాదని, మేము సమర్థింపఁగలమనియు
మీరు తప్పని సమర్థింపఁగలరేని సభకు రావలసినదనియు మీరుతప్పని ధ్రువపఱచి
న యెడల మేము నూటపదారు లిచ్చెదమనియు ధ్రువపఱచ లేనియెడల మాకు మీరు
నూటపదాఱు లిచ్చిపోవలయు''నని యుత్తరము వ్రాసితంపఁగా బ్రత్యుత్తరమీయక
నరసారావుపేటనుండి గుంటూరునకు వెళ్లిరి ఇంతవఱకుఁ దగిన ప్రత్యుత్తరమి
చ్చినవారు కారు. కావున నివ్విటికైన న్వపదన పోషణ సామర్థ్యము న్న యెడల
పట్టియత్తులువన్ని కాలము వ్యర్థపుచ్చక తప్పని నిశ్చయపరచుట కొప్పకొని తెలి
యపరచిన తక్షణమే పండితసభఁజేయించుటకును. అనమన్య తప్పు కాదని సమర్థిం
చుటకునుఁ గృతనిశ్చయుఁడనై యున్నాఁడను. (ఇందులకతి శీఘ్రంబునఁ బ్రె
త్యుత్తరం బొసంగనిచో మీరోడినట్లే తలంపబడుదురు.)

బ్రహ్మశ్రీ బెల్లంకొండ రామారాయ కవీంద్రుల శిష్యుఁడగు

1-11-11: ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రి.

☞ కుండలితమగు వాక్యము ప్రెషకునిస్వహస్తలిఖితము తక్కినదిఅచ్చు

---

*మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధానిగారికి యిచ్చేది

రవాణా, బందరు, భైరవప్రెస్సు. 27-6-11 బండారుపల్లి.

నమస్కారములు.

క్షేమం యీపత్ర తెలియలేదు, గీరతము యొక్క దుంపలు వెడలునది తెలి
యలేదు, ప్రస్తుతం మా గురువుగారు బెల్లంకొండ రామారావు చేసిన కృష్ణలీలాత

మత్త॥ *తప్పు లయ్యవి బ్రహ్మకేనియు దాఁట రానివి యాటచేఁ
"బప్పులోనడు" గన్న సామెతఁ బట్టిపోఁదలంపు లా
చొప్పు చొప్పడెఁ దక్కువారలు శుద్ధశుంఠలు సారెకున్
దిప్పిశైతము పేరిబెడ్డలు వేయఁ జొచ్చిరి మావనున్. ౧౩౦

మత్త॥ "రామరా వెటులేని బైకిఁక రాఁగలేఁ"డని కావ్రిపుం
గోముకైసములంతటన్ దమ గుంపు గూడిరి పెల్లఁగన్
సాము సేయఁ డొండంగి రెండు నసత్యమే యొకవిద్దెగన్
వామ మార్గముఁబట్టి సారెకువాగ్వ్యయ మ్మొనరించుచున్. ౧౩౧

---

రంగిణీని మీవద్దకంపినాను. దానిని తాముచిత్తగించి గుణదోషములను వెల్లడిం
తురుగాక, నాశరీరము కొంచము నెమ్మదిగా నున్నది. యింకా పదిరోజులకు
వారుచేసిన రుక్మిణీపరిణయ చెంపూప్రబంధమును పంపఁగలను. శ్రద్ధగాపరిశీలిం
రుగాక. (మక్కికిమక్కినకలు)

జూపూడి.హనుమచ్ఛాస్త్రి.

(*శ్రీరామారావుగారి కృష్ణ లీలాతరంగిణి నుండి)

(1) శ్లో॥ ...న నందతనయః కరపంకజేన పస్పర్శ శ+ మ్...,,
(2) శ్లో॥ మయి మూర్తిరాయ నదనా ద్బహి ర్గతే,,
(3) శ్లో॥నవనీతచోర తవ శ+మాహ రామి ... మమ శ+చుంబనమిదం...,,
(4) శ్లో॥ సుభగే త్వదీయ మయి శోభనంభ+ం మమ దర్శయ ...,,
(5) శ్లో॥ అధిరుహ్యవైష శయనం శయానమ,త్తనయాశుశ్రోనిహితవాన్న జంపదం
(6) శ్లో॥ మమ బాలికాభ+బిలేతవాత్మజో నిధ ధేక రాఁబురుహామధ్యమాంగులిం
(7) శ్లో॥ ...అత్మసూత్ర విశ్రుతా ననాస్త్రే నమమూత్రయత్,,
(8) శ్లో॥ ...ఇతి బాలికాంగ మఖిలం విశాఉఉత్మనః పరిలిప్తవాన్...

☞ దిజ్మాత్ర ముదాహరించితిమి ఇట్టివెన్నో కల వని యెఱుఁ
గునది ఇందునుగూర్చినవిచారణమునకు శలభాలభనము, చూడఁదగు
'పవిమాదోధీనుతామపీత్యత్ర అపిశబ్ద ఏవకారార్థకః, అతోనరామరా
య స్యైతావతా కించిదపి న్యూనతా నతు సర్వథా నమర్థ ఇతి శివమ్,

మత్త॥ రామరాయని కైతలోని దురర్థపున్ విరసప్రయో
గామయ మ్మది త్రివ్వరానిది యాట మిన్నక యుండి వి
ద్యా మహేంద్రులు "పశ్య" శబ్దముపైని సారెకుఁ గొంద ఱే
మేమొ వ్రాసిరిగాని నీదయ నేము కొంటిమి గెల్పులన్.

గెల్పులు.

☞ వరా:— 'పశ్య' అనుశబ్దము తప్పనియు, ఉపసర్గపూర్వక 'పశ్య' శబ్దము సాధువనియు, కాశికావృత్తిమతము, రెండును సాధువు లని కౌముదీమతము, మొదటిది ప్రాచీనమతము, రెండవది నవీనమతము, మొదటిదే మంచి దని మేము, రెండవదియే మంచి దని మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రులవారు లోనగుకొందఱుపండితులు, ఇందునుగూర్చి పత్రికావాద మొక సంవత్సరన్నరవఱకు జరిగినది, కాని యీక్షణమువఱకు మావాదమే నిల్చియున్నది. ఇందుఁ గౌముదీమతానుసారముగా వాదించినవారు (1) మంత్రవాది సూర్యనారాయణశాస్త్రులవారు, (2) తాతా సుబ్బరాయశాస్త్రులవారు, (3) పుదఘు శ్లరామశాస్త్రులవారు, ఇందు, తుట్టతుదివారు బెల్లంకొండ రామారావుగారిగురువులు, వీరు కడు శీఘ్రముగా నోడిపోయి రని చెప్ప వలసివచ్చినందులకుఁ జింతిల్లుచున్నారము, మొదటివారుతమశిష్యుపేరితోఁ బత్రికలు ప్రకటించినవారు వీరు శ్రీరాయఁడుశాస్త్రులవారిశిష్యులగుజయంతిభగీరథశాస్త్రులవారిచే నోడఁగొట్టఁబడిరి, ఆయీవిద్వన్మణులు వివాదమునకు దిగుటకుఁ గారణము మొట్టమొదట నేము ప్రకటించిన 'పశ్యాంపుశ్యాం' అనుచిన్నిపొత్తము, వీరిలో వీ రిట్లు ఖండనముండనము లొనర్చుకొనుచుండఁగా మున్నుదాహరించిన మహామహోపాధ్యాయులవారు తటస్థులుగా నొకతీర్పును దీర్చి ప్రకటించిరి, దానిపై జయంతిభగీరథశాస్త్రులవారు వ్రాయవలసినవిధియున్నను సర్వాపవాదక మగుగురుశిష్యన్యాయము దానికి బాధక మయినది, అంతలో శ్రీరామారావుగారు తమవాదము గెలిచినదని సంతోషముతో నిట్లొకరిపేరఁ బ్రకటింపించిరి.

(నవంబరు 1వ తేదీ 1912 సం॥ దర్బారునుండి.)

# పశ్యా పశ్యా న పశ్యతః

1 పాఘ్రతి సూత్రములో పైసూత్రమునుంచి ఉపసర్గపదమును కాశికాకారుఁడను వృత్తిచేసినాడు గానపశ్యశబ్దమసాధువు, కౌముదీకారుఁడు అను వృ

త్తి చేయక పోయినందున పశ్యశబ్దము సాధువు అని కొందరందురు గాని అది సరి కాదు- కౌముదీకారునికంటె కాశికా కారుడు ప్రాచీనుడు గాన ప్రాచీనమతమే సాధువు అని "పశ్యాం పుశ్యాం" గ్రంథ కారుడు వ్రాసినారు. 2 దీనిని ఖండించి మంత్రివాది సూర్యనారాయణశాస్త్రిగారి శిష్యులు నల్లాని చక్రవర్తి వెంకటాచార్యులవారు జ్ఞానాదిగుణములచే నధికుడు గాన కౌముదీకారుడు చేసిన అననువృత్తియే బాగున్నది అందువల్ల వైదిక ప్రయోగములు మహాకవి ప్రయోగములు కుదురుచున్నవని వ్రాసినారు. 3 ఇందుమీద మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి శిష్యులయిన జయంతి భగీరథశాస్త్రిగారు జ్ఞానాదిగుణములచే కాశికాకారుడు తక్కువవాడు కాడు. ప్రాచీనుడు గాన నీతనిమతమే గ్రాహ్యమని వ్రాసినారు. 4 దీనిని ఖండించి వెంకటాచార్యులుగారు, కాశికాకారుడు ఉపసర్గపదమును కొందరను వృత్తి చేయగని వ్రాసినందున కౌముదీకార మతము కాశికాకార మతముకంటె ప్రాచీనమయినది. కాన అదే గ్రాహ్యమని వ్రాసినారు. 5 విజయనగర మహారాజ సంస్కృత కలాశాలా ప్రధానోపాధ్యాయులును మహామహోపాధ్యాయులు నగు తాతా సుబ్బారాయశాస్త్రిగారు ఉపసర్గపదమును అనువృత్తి చేసిన అన్నం భట్టాదులే పశ్యశబ్దసాధుత్వము నంగీకరించిరి. కాతన్త్ర వృత్తి కర్త యగు దుర్గసింహుడు కూడ పశ్య శబ్దము సాధువని వ్రాసినాడు. సారస్వత వ్యాకరణమునందు కూడ అనువృత్తి లేదు- గాన పశ్యశబ్దము సాధు వేనని వ్రాసినారు. 6 (వాక్యార్థ చన్ద్రికా వ్యాకరణ గ్రన్థకర్తలగు బ్రహ్మశ్రీ) భాగవతుల హరిశాస్త్రిగారి శిష్యులగు పురిఘెళ్ల రామశాస్త్రి గారు సూత్రభాష్యకైయటములయందు పశ్యశబ్దము ప్రయోగింపఁబడి యున్నది గాన కాశికాకారమతము తద్విరుద్ధమైనదని వ్రాసినారు. 7 ఇవి యన్నియు అచ్చుపడే యున్నవి. ఇక 'పశ్యాంపుశ్యాం' గ్రంథకారులకు తత్పక్షపాతుల స్వపక్ష పాతమే గతిగా కనబడుచున్నది.

బెజవాడ. హితవాది.

పైప్రకటనము శ్రీరామారావుగారు వ్యాకరణవిషయమునఁ బరప్రత్యయనేయబుద్ధు లని చెప్పక చెప్పఁగలదు, అది యటులుండె. ఈహితవాది నామధారి కడువృద్ధు, శాఖాభిమానమును బురస్కరించికొని మమ్ముఁ బరోక్షమున దుర్భాషలాడుటలోఁ దప్ప సన్యత్ర యితఁడు మంచిచెడ్డల నెఱిఁ

గిన వాఁడు, ఈతని పేరఁబ్రకటింపఁ బడిన పైపత్రిక యొక్క మాతృక మావద్దకువచ్చి యున్నది. బ్రాకెట్టులోనున్న 19అక్షరములనుహాంనవాదముంచిరామారావుగారు వ్రాసినవి కాన రామారావుగారు కారణాంతరమునఁ దమపేరితో వాదమునకు దిగకయున్నను "నిందుజోక్యమే లేకయున్నా" రనువారివాదము సత్యదూరము, ఈ యంశము నేయీక్రిందిపంక్తులు బలపఱుపఁ గలవు.

(అభినవసరస్వతినుండి.)

"...పైగ్రంథములు చూడనికతన రామారావుగారు "పశ్య" అనునదిసర్వము తములను సాధువేయనువిశ్వాసముతో నరసారావుపురవాసులు వ్రాయు నుత్తరములకు సమ్మతించిరి. పదపడి యథార్థమెఱిఁగి మిన్నకుండిరి. అది వారియోగ్యతను వేనోళ్ల జాటుచున్నది. అనవసరముగాదూషించి మనబోఁటులొనర్చు ప్రకటనలవలనఁ దేలఁదగునంశమును నేను వేఱేవ్రాయనక్కఱలేదు. చేతనైనచోఁ బత్రికాముఖముననో సభాముఖముననో సమస్యనుగూర్చి పండితసమక్షమునఁ బెనఁగుటయుక్తము, లేదా? యింతటనేని మిన్నకుండుటయుక్తము- యథార్థము నొప్పికొన్నచో మనకప్రతిష్ఠ లేదు- జన్మశతమునకేని రామారావుగారు, సమస్యను నేను బంపలే,దనికాని, నరసరావుపేటసభకు వచ్చి వెళ్లిపోయి పదంపడియుత్తరములు వ్రాయింపలే,దనికానియందు రని నేననుకొనను సమస్యతప్పని నిరూపింపఁగలిగినచో నూటపదియాఱులు కావిత్తుమనియు లేనిచోఁ దమకివ్వవలెననియు రామారావుగారు తిరుపతివెంకటేశ్వరులకు నాచేతనే చెప్పిపంపిరి. నేనబద్ధమాడుదునందురా?

సీ॥ రసికులు సుజనులై రాణించు పులిపాక పూర్ణయ్యగారెనా మొదటిసాక్షి
పణవిత్త మీ నిష్టపడిన రూపెనగుంట్ల హనుమంతరావుగా రవలిసాక్షి
విప్పర్లపల్యాఖ్యవిపులాగ్రహారస్థ పండితద్వంద్వమా పైనిసాక్షి
వేమవరస్థుఁడౌ వెంకటకృష్ణాఖ్యమందిసీదేవుఁ డామీఁదిసాక్షి

తే॥ గీ॥ ఇంక నెందఱోయున్నవా రిందఱేల, రామరాయాఖ్యపండితరాజొకండె
"చెప్పిపుత్తెంచలేదిట్టులప్పు"డనుచు, బలికిన నా కుఁజాలు నో ప్రౌఢులార.

రామారావుగారు స్వయముగా వాదమునకు దిగకుండుటకుఁ గారణము వా

---

రిశ్రీకృష్ణలీలాతరంగిణిలోని హేయప్రసంగముగాని వే కాదు, అదియటులుండె, ఓమ్నటమేము 'పశ్యశబ్దవిచారము' అనువ్యాసమును వ్రాసి మహామహోపాధ్యాయులవారివాదమును ఖండించుచు, "గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి" గా రా

మరావుగారి గురువుగారి వాదమునుగూడ ఖండించితిమి, అంతతో నాయీపండితులు విరమించిరి, పిదప రామారావుగారే స్వయముగా వాదమునకు దిగవలసినవారైరి కాని స్వనామగోపనము మున్ను చెప్పిన హేతువున వారి కావశ్యక మయ్యెను. అట్లుగూఢరీతి నవలంబించివారు, (1) పశ్యశబ్దమీమాంస, (2) పంచాననపలాయనము (3) గుంజాగర్వభంజనము, అనుమూడువ్యాసములు మిగులఁబచ్చిగా వ్రాసి ప్రకటించిరి, ఇందు మొదటిరెండును 'పశ్య'కు సంబంధించినవి, మూడవది తమ లీలాతరంగిణిని. సమర్థించుకొనుట కేర్పడినది, ఈమూడును మాచే రెండువ్యాసములతో ఖండింపఁబడినవి, అందు మొదటిది పిష్టపేషణము, రెండవది 'శలభాలభనము, అంతతో నా'పశ్య'వాదము సమాప్తమైనది, ఆయీవాదమునుగూర్చి నవిశేషాంశములు తెలియఁగోరువారుప్రత్యేక ముందులకుఁగా నేర్పడిన 'పశ్యాంపశ్యాం" లోనగుగ్రంథములు చదువఁగోరెదము, అవి యెల్ల నిందునుదాహరింపవలసియున్నను, గ్రంథవిస్తరభీతిచే నందులకుఁ బూనమైతిమి, విద్వద్వాదము గాన నది యంతతో ముగిసినది, గాని యవిద్వద్వాద మింకను జాలుమూలములు లేక 'హితకారిణీ, మనోరంజనీ, పత్రికలలో డిద్ధబిద్ధడబిద్ధాదులవలనఁ బ్రకటింపఁ బడుచునే యున్నది. అందునుగూర్చి పీఠికలో సంగ్రహముగాఁ జర్చించఁబడును. శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః" (భారతముశాంతిపర్వము...)

తరల॥ తనదు వాదము న్యాయ్యమైనను దైవవంచన కల్గి నెం 233
దునకు మాఱక సారె దుమ్మున దూళిగాఁ గనువట్టు చా
ప్పునకు నక్రవి చింత నొందుచుఁ బోవు త్రోవ యొకండునుఁ
గనక విజ్ఞుఁడు గాన నేవియొ గ్రంథముల్ గనుఁగతటా.

తరల॥ తిరుపతిన్ మఱి వేంకటేశునిఁ దిట్టి యత్తఱి నెవ్వఁడో
*"పరశురాము" లటంచుఁ బద్దెము వ్రాసె నొక్కఁడు యుక్తమై

---

(అక్టోబరు 16 తేది, 1912 సం॥ దర్బారునుండి.)

ఉ॥ తామసవృత్తి వీడి యుచితస్థితి నిక్రము నాలకింపుఁడీ
భూమిపులందఱన్ దునిమి పుత్త్రుల నాకపు మెట్లుఁ జేసి యు
ద్దాముఁడునైన భార్గవుఁడు తప్పినుమంతయులేనియట్టి శ్రీ
రాములఁ దూలనాడియె పరాభవ మొందుట మీ రెఱుంగరే.

పరశురాముఁడు రాచపుర్వులఁ బట్టి నేలకు వ్రాయు ట
త్తఱి మఱెందుకు సంభవించెనొ? తత్త్వమంబ? యెఱుంగవే. ౨౩౪

మత్త॥ గోవు కోసము హైహయుం డొకకొంత కోసము చేసె నా
గోవిశేష పరీతుఁ బట్టుక గూలనేసెను రాముఁడున్
గోవు నా మఱివాఁడు క్రేఁగదొ? కోవిదుల్ పరికించినన్
దేవి? యియ్యెడ దానికై కడ తేర్చి రెవ్వరు రాజులన్? ౨౩౫

మత్త॥ మేమె రాజుల మంచు కొందఱు మిన్ను ముట్టుచు పత్తురో?
నేమ మేగతిఁ గాంచ నేర్తురొ? చెప్పు మట్లగు పట్టునన్
రాముఁ డుద్భవ మందునప్పుడు రాజు లేమయిరో కదే?
జామదగ్న్య కుఠారధారకు జాల్కఁ డేమి యెతింగెడిన్. ౨౩౬

మత్త॥ రాముఁడే యలరామరావని రాజు లిప్డు వచింతురో?
మేము సెప్పెద మాతఁ డేగతి మించి నిల్వఁగ నేర్చెడిన్?
ఏమియందువొ? వచ్చి బాముల నేసి చూపితి మంబరో?
రామరావు కవిత్వమందుఁ బరాభవం బని గూర్చెడిన్. ౨౩౭

మత్త॥ కాన నాతఁడు రామరావనుఁ గాక నామసదృక్షమౌ
దానిఁ బూని యెదుర్ప నేరఁడు దైవవంచితుఁ డౌటచే
నీనఁ గావలె భూమి యూపయి నింక నొండొక రామునిన్.
తేనిచో మనరాజు లూరక తేకు లై చెడఁ గావలెన్. ౨౩౮

తరల॥ తిరుపతిన్ మఱి వెంకటేశుని దిట్టు నింకొకరుండు గ
ర్వ్యలను "రావణకుంభకర్ణు" లటంచు దుఃఖము దీఱఁగన్.
అరసి చూచిన నిదియు వెన్కటియట్లె రాముని శక్తతన్
నురిఁగె రాముఁడు పుట్టుఁగావుత నూరుఁ డింకొకరుం డొగిన్. ౨౩౯

☞ ఆయాదర్శాదు పత్రికలలోని ప్రతిపక్షి పత్రికల ప్రలాపముల కెల్ల మేమిచ్చిన ప్రత్యుత్తర మీక్రిందనుదాహరించుచున్నాము.

(అభినవసరస్వతినుండి.)

"పండితాయతే".

శ్లో॥ భిత్వా సర్వా ణ్యరణ్యా న్యతివిషమలతాగ్రదుర్గాణి భూయో
యాయాన్తం శక్రకాన్తం భషకతతి రియం బుక్కనై ర్ధిక్కరోతి

లజ్జన్తే హన్త మేనాం మదకరటిఘటాభేదసంఘట్టరూఢ
క్రీడాధారేయధారా మమ ఖరనఖరాః కింకరోమి క్వయామి.

(పండితరాజశతకం.)

శాఖాభిమాని భ్రాతలారా!

తగిన ప్రత్యుత్తరమును లిఖింపనేరని "పండితాయతే"గారి ప్రేరణముచే డిద్ధబిద్దాదుల పేళ్లతోఁ దిట్టితిట్టి యానందించు మీ యోగ్యత పండితరాయలు తప్ప నితరులు వర్ణింపఁ జాలరు. "కృష్ణలీలాతరంగిణి"లోని బూతులు గోపురాదులమీఁది బూతులతో పాటు కోర్టువారు క్షమింతురని సంతసించెడి మీ సంతోషము కడు వర్ణనీయము, బోలెఁడు లక్షణగ్రంథము లుండఁగా దాని క్రీగతి పట్టినందులకు మీ యంతట మీరే యొప్పుకొనుటచే దాని యోగ్యత వెల్లడియైనది, కాశికను ఖండింప నేరకయే దో వెఱ్ఱిమొఱ్ఱిమాటలు వ్రాయుటవలన నేమి ప్రాజ్ఞుల నోటరాని యవాచ్యవచనములతో మమ్ము నిందించుటవలన నేమి మీ "పండితాయతే" గారిలోఁతు విస్పష్టమగుచున్నది. సరియైన యుత్తరము స్ఫురించినచోఁ దిట్లతోఁ బని యుండదుకదా! కాశిక ప్రాకృతము పఠనసారములలో లేదనుట వట్టిపిచ్చిమాట. విశేషములు తెలియఁ గోరువారు చూచుచునే యుందురు, సామాన్యులు కొందఱు లఘుకౌముదితోడనే తృప్తినంది సిద్ధాన్తకౌముదినే ముట్టరు. అంతలో దీనికిఁ గాని దానికిఁ గాని గౌరవము చెడదు. కాశిక నక్కడక్కడ దీక్షితులుగారు ఖండించిరని వ్రాసి దాని నప్రమాణ మనుట యుక్తము కాదు, ఎక్కడ నిప్పుడు దాసిని మనము ప్రమాణముగాఁ బట్టుచున్నారమో అక్కడ దీక్షితులుగారు ఖండించినది యుక్తమా! కాదా! అను సంశయము తేల వలసి యున్నది. అందులకు మీవారు పూనవలసియున్నది. కాశిక ననుసరించియే 'పదవాక్యప్రమాణపారీణు'లెల్ల వ్యాఖ్యానములను వ్రాసియున్నారు. అప్పటికి భాష్యమున్నను దీనిని వారంతగా గౌరవించుటచే నిది భాష్యతుల్యమని మేము వ్రాసితిమి, నైషధములో "ధయాన్" అను ప్రయోగమును యథాకథంచిత్సాధ్య మయిన దానినిగా వ్రాసిన మల్లినాథసూరిగారేమి సోపసర్గములుగా "పాఘ్రాధ్మా" సూత్రమునకుదాహరణములు చూపిన మహా వైయాకరణశిరోమణి భట్టోజీయేమి మఱికొండఱు ప్రాచీనులేమి మావాదమును బూర్తిగా బలపఱచుచున్నారు, కాశికను గాని మమ్మును గాని వారిని గాని తిట్టినచో

దిట్టిన వారినోటికంపుబయలువడునే కాని వాదము నెగ్గదు- సదుపాయపూర్తింగూర్చి చొప్పదంటుశంకలను బ్రకటించితిరిగదా; అందు డిద్ధబిద్ధాదులచే బ్రాలుచేయించితిరేమి? నానావిధముల మమ్ముఁ దిట్టియు వేఱొకరిని బొగడియు నెవరికి 'బ్రహ్మపట్టము, గట్ట నుంకించుచున్నారో వారివ్రాలే యందుఁ బగిలింపుఁడు- పస తెలియఁగలదు- ఏకకాలమునందు సర్వజగద్దర్శనయోగ్యత లేక పోవచ్చునుగాని పర్యాయముగా నేల యుండఁగూడదు- మఱియు 'యః' అన్నచో 'జడపదార్థః' అనిరాఁగూడదని యేపండితుఁడును బలుకఁడు- 'పండితాయతే,'లుపలుకుట వింత కాదు "సర్వనామ్నాం బుద్ధిస్థత్వోపలక్షితధర్మావచ్ఛిన్నే శక్తిః" ఇది నిష్కృష్టసిద్ధాంతము- గత్యంతరమేదియును లేక వృథాగ బూతులు తిట్టుమీకేమాత్రమేని వ్రాయుట యనవసరమే- అంతేవాసులలోఁగూడ మీకుఁ దుల్యముగాఁ దిట్టువారు మాకుఁ జేకూఱమి నింతటితో నిప్పటికి విరమించితిమి. "మూర్ఖంఛందానురోధేన

ఇట్లు,

తిరుపతి వెంకటేశ్వరులు.

మత్త॥ ఆంతదనకును మాప్రతాపమహత్త్వమే యలరాఁగతన్
జింత నొందుచుఁ దిట్టి పోయుచుఁ జేతిగాజులమ్రోఁతతో
గొంతు బొంగురు వోవ రోఁజుచు గోఁకి కొంచు శిరమ్ములన్
మంతనమ్ములఁ గుట్రఁ జేయుచు మార్తు రుంకుత మంబికా. ౨౪౦

మత్త॥ "చాల దీయవతార మింకను జాలలోపము లుంటచేఁ
జాలువాఁడు దయింపఁ గావలెఁ జాల నందులకై తపం
బోలిఁ జేయుడుఁ మీరలెల్లరు నూఁగకే యిటు మ్రోఁగుటల్
శీలవంతులు మెచ్చ,,రంచును జెప్పుమంబరో వారికిన్. ౨౪౧

తరల॥ పరశురాముఁడు రాజవంశముపైన వారొనరించె నీ
పరశురాము లటుల్ పౌనర్భవి ప్రాజ్ఞులెల్ల నెఱుంగరే
ఉరక తిట్టుట కట్టువ్రాయుచు నుంట నింతవచింపఁగాఁ
దఱి ఘటిల్లెను యుక్తిచెప్పమి తప్పు సత్కవి కంబికా. ౨౪౨

చ॥ కపితము గట్టు చుట్టములు 'గాడిద' లెద్దులు, మొద్దు, లంచు న
ద్ప్రపుఁదమతెల్వి యంతయును శాశ్వతమై రవిచంద్రమోనభః

కుపదవు లుండునంతవఱకున్ వెలుఁగన్ గిలుకొంగఁ జూచ్చి రీ
కుపితులు గోఁకు పద్దెములకున్ దరి యంచును గాన మంబికా ౨౮౩

తే॥ గీ॥ అన్నిటిట్లకు నాఁటి సహాసమున, కేము మోమోడమనుటయే హేతు వంబ?
వారి మోముఁ జూచినయంత వారిచేఁత, స్వాంతమున కెక్కు కతన నాసనము నీము.

చ॥ ఇతరు లెఱుంగు టెట్టు లెవఁ డేపని సేయుసొ దానిగుట్టు తా
నతఁడె యెఱుఁగుఁ గాక భుజగాంఘ్రుల పద్ధతి నేఁ డెఱుంగు, సం
ర్జితుఁడు మఱొక్కచో నయినఁ జేసెడిదేమి మఱొక్కపట్లు? నే
చతురుఁడు వీరి మెచ్చినను సత్సభ* స్వాంతము డాఁచియేసుమీ. ౨౮౪

---

పోష్టుముద్ర } 4 సెప్టెంబరు 1911 ఎగ్మూరు. { లైబ్రరీ సోమవారం

*... ఈవివాదమునుగూర్చి కొంతవ్రాఁత చూచిన నాటి రాత్రి 27 తేది... మీ కాగితములు వచ్చినవి, ఈస్థితిలోనున్న నాకు ఒడలు పులకలెత్తెను, మహోత్సాహానందములు కల్గెను, నేనుకూడ ఇప్పుడు గుంటూరు రావీలుండిన బాగుండును ...నాకదీవీలు లేదు, . కొప్పరపుంగవులు ఇక్కడనవధానములు చేయుటలో అష్టావధానము పేరేగాని, లక్షణమింతేనియు లేదు, సమస్యలు ముందు చెప్పించుకొనుట... వ్యస్తాక్షరి లేదు... ఒకవేళ వివాదసభలు జరుగునేని ... అష్టావధానము ప్రధానముగా ముందుపరీక్షింపవలసినది, అందు వ్యస్తాక్షరి ముఖ్యతమము, వారి ఆశుధార గొప్పదేకాని ... వేలకొలది వర్ష్యయములు తిరుగుచున్న మామూలు చక్రమే గాని క్రొత్తరీతిని దిరుగదు. ఈయూరనిచ్చిన కథ వారు చెప్పనేలేదు ఇతరం వారి బాటను కొట్టిపోసిరి. వారి బాట తప్పించి (సంభవించెనేని) ఆశుకవిత చెప్పింపవలెను. మాలో శివరామశాస్త్రి కృతార్థతముఁడు, నాయానందమతనికిఁ దెల్పుఁడు. మీరా వారితోఁ దులగా వాదింప నేనిచ్ఛగింపను. గెల్చినవచ్చెడు ప్రతిష్ఠయెంత? ఇఁక నీవాదను లేల? మీరువదలుటయే నాకోరిక. శివరామశాస్త్రియు వలదు, వారెట్టి పాండితికలవారని;...నాటి వివాద స్వరూపము, బీజము, ఎట్టివి? ఆయూర నిరువాగులను బ్రోవాను లెవరు. యావదంశము మీకు వ్యవధిలేకున్నను మనకుఁ బరమమిత్రులగు బ్రహ్మశ్రీ...గారిచేనయిన వ్రాయింపుడు ..ఇంకను అచ్చులోను న్నరి కార్డుప్రూఫులయినను వెంటనే పంపుదురుగాక. వే. ప్ర.

ఉ॥ వచ్చెడి పండితుండెవఁడు? వచ్చినవచ్చుత వచ్చి సత్సభన్
మెచ్చెడి పండితుండెవఁడు? మే మఖిలంబు నెఱింగినార మీ
పిచ్చి కవిత్వ మూఁతగొని పేఁకెదరంట? దడాల్న మీన మీ
సచ్చరితుల్, వృథా నుడులు సైఁచెదరంటె? స్వపక్షు లంబికా. ౨౪౬

చ॥ ఎఱుఁగని యప్డు "మీరు కవులే" యని యొప్పినతప్పు సైఁచు మి
మ్మెఱిఁగితి మాన్యముం దెఱచుచేఁ తడ వంతయు స్పష్టమయ్యె, నీ
శ్వరుఁ డొకసాక్షి మీ రున్నడుపు పద్దెములం దపు డెన్ని మీరు గూ
ర్తురొ మును పల్లి యెన్నియట దూర్తురొ యంబిక? నీ వెఱుంగవే. ౨౪౭

ఉ॥ పత్రికవారి ఘోషయును చామరతన్ మొగమోడి మెచ్చు మా
మిత్రుల ఘోషయున్, దెలిసి మేలు ఘటింపఁగ నెంచి మెచ్చు మా
ఛాత్రుని ఘోషయున్, గని ప్రశంస యొనర్చుచు నాఁడు యోగ్యతా
పత్రిక సంపుతప్పిదము పండితమండలి సైఁపఁగాఁ దగున్. ౨౪౮

ఆ॥ వె॥ శక్తిలేక పూను 'సర్టిఫికట్టు' లా, యువు లవమ్ము లేకయును దమంతఁ
బెండ్లివేళ నిచ్చు పెద్దలదీవనల్, పొందినార మనుచుఁ బొంగిపడుట.

క॥ అవసరమైన కతమ్మున, వివరించితి మంబ! ఘోషవితమెల్లను నీ ౨౪౯
సవిధమున నెఱిఁగి యనృతము, దవిలించితిమేని నీవ దండింపఁ దగున్.

శా॥ ఖండింపంగల శక్తి యున్న యెడఁ గాకవ్యగ్రిణీవ్యగ్రితా
ఖండాఖండకృతి వారకం బయిన యీ కబ్బంబు నేరేనియున్
ఖండింతుర్గద, సోదరుల్ పృథగ వాక్ప్రౌఢూతి వాఁ గొట్టుకో
"నెండుంగండి, గ నేమొ దూఱుదురు మా కేమంతలోఁ బోయెడిన్. ౨౫౦

గీ॥ వారు దూటినకొలఁది నవారిగాఁగ, మాయశము లోకమునఁ బర్వ మాకుఁ గీర్తి
కన్న నన్యలాభమ్ముల నెన్నఁబూని, లేదు ప్రకృతశేషమ్ము నాలింపు జనని.

ఉ॥ అంతట నయ్యె వేసవరమం దవధానము వైరు లెంతయున్
జింతలచేఁ గృశించి పరిశీలన చాలక సారెఁ దప్పదుం
బంతలఁ బెంబడిం బడి ప్రభూతనయుల్ 'కదు' రోయు దూయమా
నాంతరులై మతేదియు సహాయము గానక కుంద నొందఁగన్ ౨౫౧

సీ॥ తలుపోరగామూసి వెలవెల్లమోముతో నొకఁడు "శశ్శోఁటి" మాదికుఁ జూచు
తనయింటి యెదుటి కందలము రావేగవే యొకఁడు "శశ్శోఁటి", తలూపఁచి వైచు
"వశ్య" వాదంబు 'స్వత్న్యభుముల్లై' 'యయ్యో' నంచొకఁడు "శశ్శోఁటి" నీరోడ్చుఁగనుల
"కాశిక" నటుపాముగ ఆచెఁగా 'హుం' మ్మంచునొకఁడు "శశ్శోఁటి" వండ్లురకకొఱుకు

గీ॥ కాశికను జూపి "సూటార్లు" గతుఁడు మనుచుః, కోట్ట కీడ్తురో యేమొ నాకొంపదీసి
యంచునొకఁడు "శశ్శోఁటి" లో నటమటించు, నరస రాట్పురిత్రోవ మేమరుగుతఁని

ఉ॥ "పాటిరి కృష్ణదాఁటి" యని వాగ్వ్యయము న్మను సారెఁజేయునా
కారణ మంతరంగము నగల్పఁగ వేమవరమ్ము మే మెటుల్
చేర భయమ్ముఁ గొందు మటు చేకుఱఁ జెన్నఁటి నేఁత లెన్నిగా
కూరిచి వ్యర్థులై చెడిరి కొప్పరపుంగవిపత్సు లత్తఱిన్. ౨౫౪

చ॥ సకలము నీమనం బెఱుఁగు సత్యవిదుల్ పలుమం దెఱుంగుదు
ర్నికరము దేల్చి పూర్వమె మనీషిహితమ్ముగ ముద్రితంబునున్
బ్రకటితముం బొనర్చి నప్రబంధ మెఱుంగును గాన దానిఁ బ్ర
వ్యకయటఁ జూచికొం డనుచుఁ బ్రాజ్ఞులకున్ వచియింతు నంబికా ౨౫౫

గీ॥ అంబ ? యంతకు మును చేసినట్టి చెట్ట, నేఁత లోకతల వేమవరాత తాగ్రె
హారనత్పభాప్రత్యూహ మలవరింపఁ, బడ్డపాటు లింకొకతల వ పశమని. ౨౫౬

ఉ॥ తప్పదు తోఁవలన్నిటును దజ్జులు దగ్ధము సేయ నంతతోఁ
గొప్పర మూరకుండక ప్రకోపము చెంది* "రిజస్టరుత్తరం

---

*ఆశుకవి చక్రవర్తి, శతావధాని, కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ. కొప్పరము-నంతమాగులూరుపోస్టు, గుంటూరుజిల్లా నుండి. } (రిజస్టరుత్తరపు నకలు) బ్రహ్మశ్రీ తిరుపతివేంకటకవులకు కాకినాడ, & బందరు.

అయ్యా, మీరుప్రకటించిన 'గుంటూరుసీమ, పూర్వరంగము', అను పొత్తము జూచితిని, అయ్యది 'సీ॥మాయమాటలకు నమ్మకమైన వ్యాఖ్యాత తులలేని వచ్చిబూతులకు బుంగ, అను మీశ్రవణానందమునందలి ముదునలిబోగముదాని వద్దెమునకు దాహారణముగ నున్న దని చెప్పవలసివచ్చినందులకు జాలిపడుచున్నాఁడను. 'సత్యంవద' ధర్మంచర; అనువేదవాక్యములకు విరుద్ధముగా ననంబద్ధములై

బప్పుడు వంపెఁ "గే"సాకటి యావలఁ దెత్తు నటంచు సత్యమున్
దప్పి చరించువారలకు ధర్మముతోఁ బని యేమి శాంకరీ. ౨౫౭

---

న యనృతవాక్యములతో మమ్మును, మమ్ములనుబట్టి మానియోగిశాఖను, ఈవిధము గనివ్వవచ్చినట్లెల్ల నిందించుటకై మీకాలమును, మీపాండిత్యమును. వినియోగించి, ఇట్టినికృష్టోద్యోగమునకు, మీమిత్రులంగూడ నియోగించి వారిచేఁగూడ, అసత్యప్రకటనములం జేయించి, యకారణముగ మాహృదయమున కాయాసముంగలిగించితిరి.

2. ఏడనూ యున్నవా రున్నట్లుండక మదీయాశుకవిత్వావధానములనుబద్యములతోఁ బ్రశంసించుచు ముందుగ మాకులేఖవ్రాసి మాస్నేహమును సంపాదించుకొని పిదప మాప్రతిభయు, మాకీర్తియు, మారాబడియుఁ జూచిసహింపలేక వృథాభిమానులగుమీశాఖవారిదురోధములకుఁగూడ లోనై యనవసరముగ నాసనచర్చయొకటి గల్పించి యస్మత్కృతోపకృతి నేని స్మరింపక, కయ్యమునకుఁ గాలుదువ్వి మేము ప్రతిజ్ఞాపద్యములను వ్రాయవలసిన యవసరమును గల్పించి చివరకు సభకు రాక సాకులు పన్ని తప్పించుకొని బందరు కాకినాడలకు,వేంచేసితిరి.

3. అప్పటినుండియు విరామము లేనిమాయవ్రాఁతలకుఁ బూనుకొని మాఱుపేరులతో మాయలేఖలం గొన్నిటిని బ్రకటించి స్వజనముచేఁగూడ నట్టివే కొన్నిటిని బ్రకటింపించి యంతతోఁగూడఁదృప్తిలేక "హితోపదేశము" అనుపేరునఁ గొన్నియనుచితములు వ్రాసిప్రచురించితిరి, అప్పుడే మేము మీమీఁద గొంత చర్య జరిగింపవలసియున్నను,ఎన్నటికేని మీతప్పులను మీరు తెలిసికొని పశ్చాత్తాపమును బొంది క్షమార్పణమును బ్రకటింతు రను సదుద్దేశముతో గొంతహితమును గఱపనెంచి 'జ్ఞానోపదేశము' అనుపేరునఁ గొన్నిపద్యములు వ్రాసితిమి కాని మా'జ్ఞానోపదేశము' మీకడఁ జెవిటివానిముందు శంఖ మూదినట్లయిపోయినది.

4. తరువాత మీరు ప్రకృతవ్యవహారమునకుఁ గారణభూతమైనట్టియు, నసత్యముల ప్రోవైనట్టియు. "గుంటూరుసీమ, పూర్వరంగము"ను, వ్రాసిప్రకటించితిరి, అందు మొదటినుండి చివరవఱకును మీరువ్రాసిన యసత్యాంశములను వ్రాయించుకొన్న యసత్యపులేఖలను,నారాయణశాస్త్రిమూలకముగా ఖండించి లోకమున సత్యమును స్థాపించుటకై మేము ధర్మదేవతచేఁ బ్రోత్సాహపఱుపఁ బడుటచే

ఉ॥ ఇట్టి వృథాప్రజల్పకులు సిట్టివదావదసార్వభౌము లై
నట్టి రవత్రపాధికరణాన్యహృదంతరులైన కొప్రపుం

---

మిక్కిలి దారుణమైన యీక్రిందివిషయమును గూర్చి మాత్ర మిప్పుడు తెలియఁ జేయుచుంటిమి.

5. మాకపకీర్తిని గలిగింపవలెనను దురుద్దేశముతో "గుంటూరుసీమ, పూర్వరంగము 87వ పుటలో" కొప్పరపువారితప్పువ్రాఁతలు" అను శీర్షిక క్రింద నొక కల్పిత (ఫోర్జరీ) లేఖను బ్రకటించి, అట్టిదాని నీ మెవ్వరికో వ్రాసినట్లును, దాని ప్రతి మీకు లభింపఁగా, దానిఁబట్టి దీనిఁ బ్రకటించినట్లును, నొక యసంభవపుఁ గథఁ గల్పించి యుదాహరించితిరి, ఈమిథ్యావ్రాఁత మాకప్రతిష్ఠను గలిగించునది మాత్రమే కాక, మా గౌరవమునకుఁ గూడ భంగము గలిగించునదిగా నున్నది. అందులకై తగు చర్య జరిగించుట మాకుఁ గర్తవ్యము కావున మీకీలేఖ యందిన దిది మొదలు 24 గంటలలోపల నా లేఖను మేమెవరికి వ్రాసినట్లు తెలుప నెంచితిరో, ప్రతి మెవ్వరివలన లభించినట్లు తెలుప నూహించితిరో' వారి పేరుల నెఱింగించుచు, అట్టిమాయలేఖను మీ రే యధికారముమీఁదఁ బ్రకటించితిరో లిఖితపూర్వకముగా మాకుఁ దెలియఁ జేయఁ గోరుచున్నాఁడను, "అంతకింతైనది, ఇంతకెంతగునో" అను సామెతకుఁ దార్కాణముగా మీవ్యవహారము పరిణమించుటం జేసి ముందుముందేమిసృష్టింతురో యనుభయముకూడ మమ్ముఁ జాలఁగా బాధించుచున్నందున నిట్టిచర్యలోనికి దిగవలసివచ్చినందులకై విచారించుచున్నాఁడను.

షరా :— ఈవిషయము మీరిదివఱకుఁ దేల్చికొనినదియే యగుట, మరల నాలోచింపవలసిన యవసరముండదు. లేనిపోని యుక్తులతోఁ గాలముగడపక సదుత్తరము త్వరగ నొసంగుఁడు.

| | |
|---|---|
| వ్రాసినది, ఆశుకవి చక్రవర్తి, శతావధాని కొప్పరపు వెంకటరమణకవి, అడుగులు 4, నాలుగు, పంక్తులు 55 ఏఁబదియైదు (మక్కికిమక్కి నకలు). | ఇట్లు, కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మ, శతావధాని. |

☞ చదువరులారా:—

పై రిజస్టరుత్తర మెందుకుఁ బుట్టినది, ఎందుకేమిటి సోదరులు

దిట్టల మాకు వాదులుగఁ దెచ్చిన తావక తారతమ్య సం
ఘట్టన మేరు మెత్తురు జగాన వచింపఁ గదమ్మ శాంకరీ. ౨౫౮

---

చేయనిపని చేసినట్లు మీరు ప్రకటించినందుకుఁ బుట్టిన దండురా? అటు లేని వారిస్వహస్తలిఖితములగు నీక్రింది యక్షరములను దిలకింపుఁడు.

శ్రీరాములు.

4-4-13. కొప్పరము. సంతమాగులూరు పోస్టు.

అస్మద్గురుమూర్తులైన బ్రహ్మశ్రీ రామడుగు రామకృష్ణశాస్త్రివారి
పాదపద్మముల సన్నిధికి.

భవత్ప్రియశిష్యుఁడు. నమస్కారపూర్వకముగా వ్రాయు విజ్ఞప్తి.

“...వృథాహంకార లాంఛనంబగు వేంకటశాస్త్రిగారి మీసమును దీయింతుమని ప్రతిజ్ఞ సేయునప్పుడును. “సింహమున్నదని తెలిసియుఁ గొప్పరపుఁగవులు కాకినాడకు వచ్చెదరా!” అనిన తిరుపతిశాస్త్రిగారు నివసించిన కాకినాడకుఁ జను నప్పుడును, కాకినాడలోఁ బలుసభ లొనర్చి, సామర్థ్యమున్న యెడల మాకు శత్రుఁడగువాఁడువచ్చి మమ్మెదిరించి జయింపవలసినదని ప్రతిజ్ఞాపద్యములం జెప్పినప్పుడును, ఎంతకఠినముగాఁ గాలుద్రవ్వినను నెదుటికివచ్చి శత్రువులు మాఱొకనమి చేఁ గాకినాడలో సుకవిపండిత శిఖామణులు సంతసించి స్తుతింప జయస్తంభము నాటి వచ్చినప్పుడును......” చిత్తగింపుఁడు.

ఇట్లు, భవత్ప్రియశిష్యుఁడు,

కొప్పరపు వేంకట సుబ్బరాయశర్మ, శతావధాని.

☞ దీనివలనఁ గాకినాడలో — తి॥ వెం॥ కవులఁ బరాభవించినట్లు సోదరులు ప్రకటించుకొనుచున్నట్లు విస్పష్టమే యగునేని దానినే విపులముగాఁ దెల్పు వీరివేరొక లేఖయొక్క నకలును బ్రచురించినమాకు సోదరులు రిజస్టరుత్తరము వ్రాయుటకర్థ మేమో? విచారింపుఁడు, “ధర్మదేవత చేతనఁట? వీరఁట ప్రోత్సాహపఱుపఁబడిరఁట?” “నాఽశ్లీలం కీర్తయేత్” “బుద్ధిః కర్మానుసారిణీ” శాంతం పాపం, ప్రతిహతమమంగళం, అస్తు స్వస్తి. సర్వే జనా స్సుఖినో భవన్తు”.

ఉ॥ దానికిఁ దగ్గ*యుత్తరము తథ్యవచోభరితం బొకఁడు మే
మానరులన్ గుఱించి వెన నంపితి మమ్మది గాంచియున్ వృథా

(మా రిజిస్టరు జవాబునొక్క నకలు.)

*శ్రీమత్పరదేవతాయై నమః

మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయ వెంకటరమణకవులకు.

అయ్యా,

29-7-13 సం॥ తేదీతో నొకటియు, తేదీలేకుండ వేఱొకటియు మీరు మాపేర వ్రాసిన రిజిస్టరుత్తరములకు జవాబు వ్రాయునది యేమన :—

(1) మీరిజిస్టరుత్తరములోని సంగతులు యథార్థములైనవియు, నమ్మఁదగినవియుఁ గావు,

(2) మేము ప్రకటించిన 'గుంటూరుసీమ, పూర్వరంగము'లోని సంగతులు సర్వమును సత్యములైనవియే గాని యందసత్యము లెన్నియును లేవు

(3) మా 'గుంటూరుసీమ' పూర్వరంగము, అను చరిత్ర గ్రంథములోని సంగతులు మీకప్రతిష్ఠ కలిగింపవలె ననుదురుద్దేశముతోఁ బ్రకటింపఁబడినవి కావు, అవి లోకమునకు సత్యము వెల్లడిచేయు సదుద్దేశముతోనే ప్రకటింపఁబడినవి,

(4) తక్కిన మీరిజిస్టరుత్తరములోని సంగతులు ప్రస్తుతము జవాబీఁదగినంత యవసరము గలవి గాఁ దోఁపవు. 'మా గుంటూరుసీమ' పూర్వరంగము 87 వ పుట మొదలుకొని "కొప్పరపువారి తస్కరవ్రాఁతలు" అను శీర్షిక క్రిందఁ బ్రచురించిన లేఖ "ఫోర్జరీ" కాదు, మీరొక గృహస్థునకు వ్రాసిన లేఖయొక్క నకలునుబట్టియే "మక్కీకి మక్కీ"గాఁ బ్రకటింపఁబడినది,

(5) మాకీర్తికి భంగమ్మును, మాగౌరవమునకు హానియు, మారాబడికి లోపమ్మును, మాప్రతిష్ఠకు న్యూనతయుఁ గలుగఁజేయవలె ననుదురుద్దేశముతో నసత్యములును జుగుప్సాకరములును నగు సంగతులు గద్యపద్యోభయరూపంబులుగాఁ బెద్దమనుష్యుల యెదుట వినిపించినందులకును, సంపన్న గృహస్థులపేర నటువంటి సంగతులనే పదిమందికిని వినిపింపుఁడనికూడ వ్రాయుచు మీరు వ్రాయు వ్రాఁతలకును, మీమీఁదఁ గ్రమమైన చర్య జరుపుటకు ముందాలోచించియు దానిని జరిత్ర గ్రంథమగు 'మా గుంటూరుసీమ'లోఁ బ్రకటించి దాని సత్యమును లోకులకుఁ దెల్లము

గా నలవారు *తప్పునుడికల్పన లెల్లెడఁ జేయఁ బూని రెం
దేని యమార్గగాములకు దేవునివల్ల భయమ్ము గల్గునే. ౨౫౯



☞ చదువరులారా:—

పై నుదాహరించిన రిజష్టరుత్తరప్రుఁదుందుడుకుప్రసంగము వేమ
వరావధానమునకుఁ జాలనిటీవలిది, ఇంకను నిట్టి వెన్నో జరగవచ్చును,
ఇఁక నీచరితము ముగించుచుఁ జరితాంశమునకు మాత్రము సంబంధిం
చిన పద్యములు గొన్ని వేమవరావధానమునుండి యుదాహరింతుము.

---

గా వినిపించిన పిదపనే చర్య జరుపవలెనని యెంచి ముందువని ముగించి ప్రస్తుత
ము మేమా ప్రయత్నములోనే యుండఁగా, మీరిజస్టరుత్తరము వచ్చినందున దానికి
జవాబుగా నీయుత్తరము వ్రాయుచు సదరు విషయమై క్రమమైన చర్య జరుపఁబో
వుచున్నామనికూడ నిందుమూలముగానే తెలియఁజేయుచున్నారము,

చిత్తగించవలెను.

(సమ్మతిని)(1) దివాకర్ల తిరుపతిశాస్త్రి, } శతావధానులు { బందరు,
(2) చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రి, } { భైరవప్రస్సు.

15-9-13.

*ది 27-10-13 సం॥.

అయ్యా !

సోదరకవులు కొద్దికాలము క్రిందట మీకు వకరిజష్టరునోటీసును 24
గంటలలో జవాబు యివ్వవలసినదిగాను అట్లా యివ్వనియడ్ల మీమీద డామేజి
తేవడమగునని సదరు నోటీసులో వుదహరించినట్లున్ను అందులకు మీరు సోద
రకవులను క్షమాపణకోరినట్లున్ను మాచుట్టుపక్కల గ్రామాదుల్లో విశేషవాదుక
కలుగజేశినారు అయినప్పటికి యిదివరలో నేను మిమ్ముల్లను యెరిగివుండి మీసా
మధ్యతను గుర్తెరిగి యుండుటచే అందుల సజాసిజములు ప్రత్యేకంమీచేత వినగో
రి వ్రాసినాను తక్షణం జవాబు వ్రాయింపకోర్తాను. దివ్యచిత్తముకు తేపలెను

విధేయుడు; వసుమర్తి లక్ష్మీకాంతం వ్రాలు.

ఇందుఁ దుట్టతుదను దాహరింపఁబోవు శ్లోకము, నాఁటి యవధానమునకు మంగళశ్లోకమని యెఱుఁగఁదగు, ఈయవధానమునకు సంబంధించిన విశేషములు సమగ్రముగాఁ దెలియఁగోరువారు దానికై ప్రత్యేకించి యచ్చయియున్న వేమవరాగ్రహారశతావధానమునందే చూడవలెను. దానివెల పోస్టేజీతో రు 0-14-0. ( ఇది 200 పుటలు గలది.)

## వేమవరాగ్రహార శతావధానము నుండి.

ఉ॥ చెన్నపురంబు చేసె నొకచెన్నుఁడు, వేమవరంబు నేఁడ హా!
చెన్నపురంబుగాఁ దొడఁగెఁ జెన్నయగారియుదారతాప్తి చే
నెన్నవధానముల్ సలిపి యేమిఫలమ్? మిటువంటి యన్నదానో
న్నతి యిట్టితృప్తియును నొందఁ జొక్కటఁ గన నోము హాశ్వరీ. ౧

శా॥ ఎందఱు పెద్దలన్నిలిపి? తెందఱు పాదరజంబుచేత ని
మ్మందిరముఁ బవిత్రగరిమమ్మున నించితి? వెంతమంది నా
నందమునందు ముంచితివి? నవ్యులు గొంత అదేమొ కాని నీ
జిందఁగ నాఁడువారఁటని యిసీ! యిసి! రోఁసితి శతావధానమా ౨

ఉ॥ అన్నము కోసమా మడల కామడ లేగెడి కాల మన్ననో?
"సున్నయు వాళ్ళు" యన్నెయి నినుఁ జూచుతలంపునఁ జేసి గాక యీ
యౌన్నతు లింద ఱిట్టి క్రియ నొక్కటఁ గెక్కటియంగ నేల? మా
యన్న! శతావధానమ! కృతార్థమవైతివి వేయునేటికిన్. ౩

తే॥ గీ॥ "భాగి" పదమిచ్చుటకెఁ బుణ్యభాగియయ్యె
"చెన్న"పదమిచ్చుటకె నుతిం జెన్నుమీఱె
వేమవర మగ్రహారంబు హేమవరపు
నగ్రహారంబుగా మారె నంబ! యిపుడు. ౪

చ॥ జననపులగ్నమం దలరు శక్రగురుండును శుక్రుఁడున్ గుజుం
డును నలరాహువున్ నను ఘనుం బొనరించెడినంతె కాని యే
నును నొకవత్సవీశ్వరుఁడనో "తిరప" య్యయి నొక్క వేఁటి యో
యన ఘుకవిగ్రహంబులు గ్రహంబులు గవ్వను జేయువజ్రముల్. వెం॥ శా॥

సీ॥ మరల నెప్పుడు మీరు మాకు లభింతురో వందనంబయ్య? విద్వాంసులార?
మంచిపద్యములు క్రమ్మఱ వినుటెన్నఁడో జోహారులయ్య? రాసుకవులార?
కన్నులు చల్లఁగాఁ గాంచుటే నాఁటికో మీకుఁ బ్రణామముల్ మిత్రులార?
మరల నెన్నఁడు కనంబడుదును మీకన్నిరు మీకు మంగళ మోయమిత్రులార?
తే॥ గీ॥ మరల మాచేత శారదమాన్యచరిత, ఉరక యెన్నఁడు చేయించునో? శతావ
ధానమా? దివ్యకీర్తి కథావిధాత్రి, ధానమా? నీకుఁగూడ వందనములమ్మ.

సీ॥ విశ్వజనీనుండు వితతభాగ్యుండు భా, గ్యనవ్వాయుండు చెన్నయ్యగారు
పరమసాధువు మేళ్ళచెఱువు వంశాంభోధి, చంద్రముఁడైన శేషయ్యగారు
యజ్ఞోపవీతాన్వయాంభోధి కబ్జుండు, వేంకటాచలపతి వితతయశుఁడు
భాగి వంశ్యుండు వెంపటివారికిం దత్తుఁ, డైన వెంకటసుబ్బయార్యవరుఁడు
గీ॥ అశ్వమేధంబొ? రాజసూయంబొ సత్ర, యాగమో నాఁగ నవధానమలవఱిచిరి
సాటి వెల్నాఁటివారును సాటిలేని, వారు వారికిఁగూడ నావందనములు. తి॥ శా॥

గీ॥ ఇతరశాఖయటంచు లోనించుకేని, భేదమెన్నక ననుఁ దద్దఁ బేర్మిఁజూచి
గౌరవించినమి మ్మెన్నఁగలనెయేను, సర్వనములార? వెల్నాఁటిచతురులార?

చ॥ తిరుపతి యేస్గ గాఁగ గడిదేఱిన శిష్యులనేకు లొప్పనైఁ
బొరిఁబొరి రోఁజుచుణ్ దనదుపొంతను బెబ్బులిపిల్లలట్లు చూ
పఱులకు దోఁపఁ గేల సుకవాటిది బెత్తముఁబూని వేంకటే
శ్వరుఁడు శతావధానమను "సర్కసుఁ" జూపెడిఁ జూడుఁడో బుధుల్.
వెం॥ శా॥

చ॥ తిరుపతి వ్యాఘ్రమై బయలుదేఱిన శిష్యులు గున్న యేస్గులై
వఱలఁగఁ దేఱఁగాఁ దగినవారలు బెబ్బులిపిల్ల లెల్లవా
రు రు కపికుర్కురమ్ము లయి తోఁచఁగ వేంకటశాస్త్రి వీరకే
సరిగ శతావధాన మను "సర్కసు" చూపితివమ్మ శాంకరీ. తి॥ శా॥

సీ॥ "కాసుచొప్పన నింతగా నార్జనము చేసి, తెంతదెచ్చినను మాకింత లేదు
గడగడలాడి సభ గానఁగా నేతెంత్రు, గానఁబోయిన మమ్ముఁగాంచు టరిది
ప్రీతితో నీకు నర్పింతురెంతైన మా, కింత యిచ్చిరయొ నెంతు రేఁతో యనుచు
వించి నీకు వాంఛితములిత్తురు సేవ, గావించినను మాకుఁ గాసు నీరు'

గీ॥ అనుచు మునుపెన్నఁడో యాడినట్టి మాట, కన్యథాత్వంబుఁ గూర్చి సిగ్గందఁ జేసి
తైన నేమయ్యె నీయుత్సవాదికమ్ము, లీవ నైకొమ్మ? యోవెంకటేశ దేవ.

ఉ॥ కాశికనుండి యొండెడకుఁ గాల్గదలింపనివానిఁ గాశివి
శ్వేశుని దెచ్చి యొక్కయెడ నింటికి దాపున నిల్పె నద్యశో
రాశి భవత్పితామహుఁడు ప్రాజ్ఞుఁడు; తిర్పతివేంకటేశ సూ
రీశుల నీవు తెచ్చుటది యేమి విశేషము చెన్నయాగ్రణీ. వెం॥ శా॥ ౧౨

ఉ॥ ఎవ్వరునిట్ గ్రహించిరో బుధేంద్రులు రాజులయొద్ద వారి పే
రివ్వసుధన్ జెలంగునటు లెంతయు నోమిన చెన్నయాదులం
దెవ్వధినేనిఁ బేర్మి ధరియించుచు మేల్ సిరినింపుమమ్మ మా
యవ్వరొ? యింక మాకు సెలవా! యలవేమవరాగ్రహారమా. తి॥ శా॥

సీ॥ ఎక్కించితివిగదా? యేగుచో మేనాల, సర్వతస్సుమవృష్టి సంకులముగ
పట్టించితివిగదా? బ్రహ్మరథముఁ గూడ, స్వస్తివాచనపురస్సరము గాఁగ
కల్పించితివిగదా? గాఢోత్సవమ్ముల, వారాంగనాకదంబములతోడ
తాల్పించితివికదా? తలలపైఁ బాదర, జంబు నాబాలవృద్ధంబు గాఁగ
గీ॥ దురభిమానగ్రహావేశ ధూమధూపి, తాత్రపయోజక గర్తపురాంతర స్థి
తాత్మపద్ధతిపఠానుయాయిసుజన, సంకలిత నిత్యమూర్ఖ, ఆసనపుఁ జర్చ.

సీ॥ పాదరజం బానపడక, యూరక వంక, వంక దండము పెట్టువారు లేరు
"బ్రాహ్మణత్వం బూడిపడ్డదే యాకసం, బందుండి" యనుకూళ లెందు లేరు
భక్తిసారస్యప్రవత్తిసత్తావిత్త్వ, మలవడకున్న బాహ్మణులు లేరు
పరమపాతివ్రత్య పరిపాకగరిమఁ జె, న్నెసలారకున్న గేహినులు లేరు
గీ॥ ఒక్కపద్ధతి దౌర్భాగ్యముండుఁ గాక, అదియు హానదుపాయ సంపదకు నొదుగు
దూరగు లెఱుంగరకట? నీసౌరు సుకవి, వినుతసుఖధామ యోకొండవీటిసీమ.

వెం॥ శా.

సీ॥ ఏయింటఁ జూచినఁ బ్రాయికంబుగఁ జేతి, జిడ్డువాయని మంచిగడ్డపెరుగు
ఏపొలంబరసినఁ గాపుటాంధ్రుడు చరించు, పలుకఁ బాఱిన చాలు పంటచేలు
ఏబావిఁ గనుఁగొన్న 'సేబా'సనఁ గఁజాలు, నమృతంబులోఁ బోరునట్టినీరు
ఏగ్రామము హొగిన నింత లంతలు గూడఁ, బదధూళిఁ దలఁ గోరుభక్తివారు

గీ॥ బ్రహ్మశబ్దంబు దాల్చిన పాడుదండి, కుజనులను దాల్చు పద్ధతిఁ గాఱకుఁ గాదె
పాదరక్షలు దాల్పంగ వలయు నీదు, విధమెఱిఁగినామ రూ కొండవీటిసీమ.

తి॥ శా॥

☞ ఆయీపద్యము లేయేసందర్భమునఁ జెప్పఁబడినవో యాయాసందర్భములకు, వేమవరావధానము చూడఁదగు.

మంగళశ్లోకః

శ్లో॥ కళ్యాణం రసనే నమ స్సుకవితే భద్రం పదేభ్యో నమ
సాగ్రః కాల్పనికోత్తమాయ మనసే వృత్తాని వో వందనం
అస్తు స్వస్తి శతావధానవిధయే విద్వజ్జనాం యాంజలి
ర్యుక్తాయుక్త వివేకినే సుకవితా సారస్య సంగ్రాహిణే. ౧౭ తి॥ శా॥

గద్య

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలకలానిధి, బాలసరస్వతీ
శతావధాని, తిరుపతి వేంకటేశ్వరసంకలితంబును
అన్యతపర్వత దంభోళిసమ్మితంబును నగు
గుంటూరిసీమ, ఉత్తరరంగము
సంపూర్ణము.

శ్రీపరదేవతార్పణమస్తు.

